

# భారతి

సంపు. ౧౩ ధాత సంవత్సరము, చైత్రమాసము (ఏప్రెలు ౧౯౩౬) సంఖ్య ౮

## ఉగాది

బొడ్డు బాపిరాజు

మరల నుదయాద్రి నెత్తమ్ము లరుణబాల
నవ్య లాక్షార్ద్రి చరణ చిహ్నముల మెరసె,
కప్పుకొనియున్న విరదమ్మి రెప్పకొనల
వెలుగు చివురించెవలపు మేల్కొలుపువిరియ.

మెరసె కాబోలు శ్యామసుందరుని మురళి!
శ్రుతి విమోహన కలకంఠ రుతి; మదేక
జీవనమె కాదు, పల్లవించెను సమస్త
చేతనము లీ వసంత విభాత వేళ.

ప్రేమ మధురాశి హృదయ పాత్రికను నించి
తొంగరు తెర లొత్తిగించుచు తొంగిచూచు
ఆ ప్రసవమట్లు నా యంతరాత్మ కూడ
నవ రసానుభవానంద నాట్యములకు.

ప్రాగ్దిశాకాశ మింత మెరవడ నేమి?
దేవ తరుణు లెందరు కెంపు మోవి రేక
లదిమి రిచ్చట ఈ తొలి యుదయమందు!
ప్రత్యుషువు ఆవినూతన ప్రభ చెమర్చు.

కోకిలా! పాడు మొకపాట గోస్తనీ సు
ధాతి మధురమ్ముగా ఈ యుగాది మొదల
చెలిమి గొని యిద్దరము నవజీవనమున
కిది మొదలుగా నుపక్రమించెదము గాక!

# ఉ గా ది

## రాయప్రోలు సుబ్బారావు

నింబ కుసుమింప, మావి పిందియలు మురియ,
చెఱకు పాలీయ, శ్రుతు లభ్యసింపఁ బికము,
పూలు పసుపార, కుంకుమం బూయ చిగురు
వచ్చె నీ ధాత శుభములు తెచ్చుగాత.

౨

మామిడి చూలుమోయఁ, నవమల్లిక పుష్పిణిగాఁ, బయో ధర
శ్యామలగాగ ధాత్రి, లలితార్చనలన్ నవరాత్రులొప్ప, ము
క్తామిహికావళిన్ సరసి తాల్ప, జరాచ్ఛదముల్ త్యజింప నా
రామవనస్పతుల్, సుఖపరంపరలన్ జనుమంచు వత్సర
స్వామికి ధాతకున్, తరుణ దాతకు మ్రొక్కుఁ డుగాది ప్రొద్దులన్.

3

కొమ్మలసిగపూలు కుప్పింతలిడ వనప్రియగీతికల కభినయము సూపి,
స్తబ్ధమానసులకైన చైతన్య ముడికి లాఘవమంద తపన యోగంబు సలిపి,
మెఱుఁగుచెంగులు త్రుళ్ల మిసిమిసలాడు కాదంబినికి మృదంగ తంతునేర్పి,
ముక్త దుర్దినలైన పుణ్య పద్మినులకుఁ బరమహంసలస్నేహభావ మొసఁగి
పంటవలఁతికి శాలితలంబ్రాలువోసి, - వృద్ధతరుల కాకులపాటు సిద్ధినిచ్చి,
పాటవమున నీషష్టాంక నాటకంబు - నాడి భరతవాక్యము పాడవయ్య ధాత.

---

# "హిస్‌మాస్టర్స్‌వాయ్స్"

శబ్దోత్పన్నమందు ఔన్నత్యమును వహించియున్నది.




శబ్దపునరోత్పన్నమందు "హిస్ మాస్టర్స్‌వాయ్స్" కంపెనీవారి వర్షాంతరముల పరిశోధనాఫలిత మగు ఈ 1936 వ సంవత్సరమందును కేవల నిర్జీవములగు గ్రామఫోను మెషీనులనుండియు, రికార్డులనుండియు మిమ్ముల విస్మితుల గావించు జీవనాదమును ప్రకటించి, గాంధర్వగానమును సర్వజనులకు సులభ్యమగు నట్లొనరించి, కళాప్రపంచమునకే మహోత్సవను సలిపిన వీరికృషి మీ ఆదరణకు పాత్రము గాజాలదా?

మీ మెషీను క్యాటలాగులు, రికార్డుల క్యాటలాగులు, మా వద్దగాని మా వ్యాపారులయొద్ద గాని ఉచితముగా బడయుడు.



మాడల్ నెం. 102

| | |
|---|---|
| నలుపు | రూ. 100 |
| వర్ణములు | రూ. 110 |

**ఈ మాడల్పై**

ఈనెల ప్రకటింపబడిన మా క్రొత్త తెలుగునాటకము.

# "పుండలీక"

నేడే దీనిని మా వ్యాపారులయొద్ద విని ఆనందింపుడు.

## ది గ్రామఫోను కంపెనీ, లిమిటెడ్.

**45, సౌతుపేరేడు, బెంగళూరు.**

# హెమోద్రాక్సోమాల్ట్

## ప్రాణానికి ఎంతో హాయిగా వుంటుంది

హెమోద్రాక్సోమాల్టు జీర్ణశక్తి నిచ్చే అన్ని టానిక్కులలోనూ వుత్తమ మయినది. ఆకలి వృద్ధి చేస్తుంది. కృశించి—బలహీనమయిపోయిన నరములకు పటుత్వము నిచ్చి ఒక నూతన శక్తిని—నూతన వికాసాన్ని యిస్తుంది.

రక్త వృద్ధి చేసే 'హిమోగ్లబిన్'—ప్రశస్తమయిన ద్రాక్షపండ్ల రసమూ—యింకా యితర అమూల్య పదార్థములతో—హిందూదేశస్థుల తత్వాలకు పడే విధముగా తయారు చేయడమయినది. ఇది చాలా బాగా పనిచేసి తీరుతుంది. అందువల్లనే యీ మాదిరి విదేశీ మందులకు తావు లేకుండా పోతున్నది. ఈ రోజునే ఒక సీసా కొని చూడండి.



AN

*Alembic*

PRODUCT

# చెల్లమాంబ

## పెమ్మరాజు లక్ష్మీపతి

[చెల్లమ్మ చెంగల్వలవారి కోడలు. ఆదూరివారి యాడుబడుచు. ఈమె భర్త తమ్మయ్య గారు. నేటికి సుమారు నూటపదునెం డెండు సంవత్సరములకు బూర్వ మీమె సహగమనము జేసినది పడమటి గోదావరిజిల్లాలోని రాయకుదురుగ్రామముననే యీసహగమనము జరిగినది.]

నాటుకొనినారు జాతివంగడము లెంచి,
రాయకుదురుపురారామ రమ్యసీమఁ
జేలవలపు తమ చెంగల్వకొలనిలోన
మేల్మిరేకులు మెరయు పద్మిని దెచ్చి. ౧

తమ్మివిరిబాల్చు ధన్య దాంతము కాన
నవనిజనము లాయనఘుఁ దమ్మయ్య యనిరి,
అతనికై వికసించిన దాసుమంబు
అతనితో నస్తమించిన దంత్యవేళ ౨

౧

వసుధవర్తిలు చిత్రభానువత్సరమందు
రేబవలు దివివెలుగు తెప్పవాల్చనిచూపు
మలయు కార్తిక పౌర్ణమాసి, భువికిని దివికి
పూతకాంతుల-చెల్లమాంబా-కట్టె, జ్వా
లాతోరణము-చెల్లమాంబా! ౩

దేవునే విడనాడి దేవాలయము వీడి
తనయూరి ప్రజలెల్ల తండతండాలుగా
తనవెనుక నేతేర తన భర్తశవముతో
తాను నడచెను చెల్లమాంబా-జనులెల్ల
తల్లడిల్లగ-చెల్లమాంబా! ౪

కన్నీటిచే చెరువు పన్నీటికొలనుగా
తాను స్నానముజేసి తడిచీరతో వెడలి
చుట్టుచెంగావిలో సూర్యోదయమువోలె
నడివీథిలో-చెల్లమాంబా-జనములకు
పొడగట్టినది-చెల్లమాంబా. ౫

ప్రళయనాట్యము వేళ ఫాలాక్షుఫాలమున
మెరయు మూడవకన్నుకరణి కుంకుమబొట్టు
పసుపుచాయలనడుమ ప్రజ్వలించుచునుండ
అట్టెచూచును-చెల్లమాంబా!-ఆచూపు
లట్టె నిలుపును-చెల్లమాంబా. ౬

తడిసి ధారలుగట్టు తలకట్టుకొసలతో
పారాణి మెరుపారు పాదాలజంటతో
తడియొడలి కంటుకొని ముడతలగు చీరతో
తానుపూనెను చెల్లమాంబా నిశ్చల
ధ్యాననిష్ఠను-చెల్లమాంబా. ౭

అగరుగంధాలతో అలరుదండలతోడ
సరిగంచు తెలిపట్టుశాలువా కప్పకొని
తమ్మయ్య నిదురింప తనవారు వెన్నంటు
ఆయుత్సవము-చెల్లమాంబా-నడిపించె
నావీథిలో-చెల్లమాంబా. ౮

తాళములు తప్పెటలు తనకీర్తి గీర్తింప
చేరి జనులెల్ల జేజేలువెట్టుచు మధ్య
భర్తపై తనపైన బంతిపువ్వులవాన
కురియింపగా-చెల్లమాంబా-తానేగ
విరిదోటవలె-చెల్లమాంబా. ౯

తనచుట్టు జనసముద్రము పొంగిపొరలగా
తన యోగనిదురలో తన్మయ్యి మునుగగా
ఆదిలక్ష్మియువోలె ఆపాదములుముట్టి
అట్టె నిలుచును-చెల్లమాంబా-తనకనుల
కద్దుకొనునవి-చెల్లమాంబా. ౧౦

పళ్లెముల హారతులు పట్టుకొని స్త్రీలెల్ల
తమగుమ్మముల నిల్చి తనకై నిరీక్షించి
దయసేయు చెల్లమ్మ దయసేయుమాయమ్మ
అనిపిలువగా-చెల్లమాంబా-తానేగి
యందుకొనియెను-చెల్లమాంబా! ౧౧

అందెలును కడియాలు హస్తముల కంకణాల్
ఘల్లుఘల్లున మ్రోయ కలకలా నవ్వుచూ
దోసిళ్లగొనిపోయి తోయజాక్షుల కెల్ల
పసుపు కుంకుమ చెల్లమాంబా-యింటింట
పంచిపెట్టెను-చెల్లమాంబా. ౧౨

తెలుగుయిల్లాండ్ర పాతివ్రత్య తేజములు
పండబారిననాటి పసపు కుంకుమపంట
నందుకొని తమకనుల కద్దుకొని యాస్త్రీలు
మాభాగ్యమిది చెల్లమాంబా-పండించి
మాకిచ్చితివి-చెల్లమాంబా. ౧౩

ఆవలీవలి యూరు లావార్త లాలించి
గుంపుగుంపులుగట్టి కోలాహలముమీర
నదిలోన గలియునుపనదులట్లు నలుదెసల
వచ్చిచేరగ-చెల్లమాంబా-ఊరెల్ల
వరద వెట్టెను-చెల్లమాంబా. ౧౪

అలలు పైపైకెగయు నబ్ధివలె పొంగినది
నడివీధిపొడుగునను నదివోలె సాగినది
కడనున్న *రాతిలింగాకారమును దాటి
†పెంజెరువుకడ చెల్లమాంబా-చేరుకొనె
పితృవనమ్మును-చెల్లమాంబా. ౧౫

భజనమేళాలతో బాజాల మ్రోతతో
ఆలమందలతోడ నాయుత్సవము నడచె
శివుసి యాస్థానంబు చేరువైనకొలంది
అంతకంతకు-చెల్లమాంబా-ఆప్రజల
కడలుకొలిపెను-చెల్లమాంబా. ౧౬

ముదిమిప్రాయపు వేల్పు మూలేశ్వరస్వామి
గ్రామదేవత, చండకాళి మామిళ్లమ్మ
అందరును తనపిలుపు నందుకొని వెంటరా
వారితోడను-చెల్లమాంబా-యికను సెల
వనుచు వీడ్కొనె-చెల్లమాంబా. ౧౭

వ్రాలుచుండిన ప్రొద్దువైపు గన్గొని మ్రొక్కి
'నీవెలుగు సూర్యుడా నీవెనుక నేవచ్చు
నానాధుతో నేను నాకలోకము గొందు'
ననిచెప్పినది-చెల్లమాంబా-ఆసూర్యు
డాలకించగ-చెల్లమాంబా. ౧౮

* రాయకుదురునడివీధిచివరనున్న రాతి శివలింగము.

† ఆగ్రామమునకు పడమటిదెసనున్న యూరిబయలు.

అస్తమించుచున్న ఆసూర్యుడా మెత్తో
తనవెలుగు భాషలో తాఁజెప్పె నిట్లనుచు,
'నీ పసుపుకుంకాలు నింగి, భూమియు నిండ
ఈసంజలో చెల్లమాంబా-నీవుందు
వెల్లకాలము-చెల్లమాంబా—' ౧౯

"అరువదేడుల పెంచినట్టి యీ దేహంబు
పండబారిన తమలపాకువలె యొడిలినది
నిలువ సీరై పోక నిన్నెట్లు మ్రింగునో
అగ్నిహోత్రుడు-చెల్లమాంబా-నీపూజ
లందుకొనడా ?-చెల్లమాంబా. ౨౦

కాచి పెంచిన మేనుకాదా? మేనిపై
కాంక్షలల్లిన బ్రదుకుకాదా? బ్రదుకుపై
కరుణలూరెడు గుండెకాదా? మాతల్లి
యీ యగ్గిలో చెల్లమాంబా-ప్రాణాల
నెట్లువేల్తువో-చెల్లమాంబా." ౨౧

*    *    *    *

౨

అనుచు ఘోషించు నాజనసముద్రముపైన
తలలకెరటాలలో తెలికనులమీలలో
సుకలు విరులను గురియ చుక్కాని చేబట్టి
నడిపించినది-చెల్లమాంబా-ఆపూల
పడవనల్లన - చెల్లమాంబా. ౨౨

ఇంగిలీకముపైన బంగారు సీరాని
రంగురంగులకాంతి రంగారు మలిసంజ
కవలకారొ్కనెడు చీకట్ల తెరలను జీల్చి
నడిపించినది చెల్లమాంబా-ఆపూల
పడవనల్లన-చెల్లమాంబా. ౨౩

అనుసరించిన జనం బాగట్టుననె నిలువ
మేఘాంతరముజొచ్చు మెరుపుతీగయువోలె
వలపువెల్లువ నదీప్రవాహాన నొంటిమై
నడిపించినది-చెల్లమాంబా-ఆపూల
పడవ నల్లన-చెల్లమాంబా. ౨౪

అవిసి కాటుకకొండ లావులించినలోయ
లావలీవలి జీవితాంతముల పొలిమేర
లయ్యగాధంపు గాఢాంధకారముదాటి
నడిపించినది- చెల్లమాంబా-ఆపూల
పడవ నల్లన-చెల్లమాంబా. ౨౫

ఎడదమంటలుబెట్టి బడబాగ్నివలె రగిలి
యెడబాటు దుఃఖంబు యెసరుపొంగులుపొంగు
గుండముల్ తప్పించి గుండెనిబ్బరమూని
నడిపించినది-చెల్లమాంబా-ఆపూల
పడవ నల్లన-చెల్లమాంబా. ౨౬

పొంగిపొరలుచు, పొరలిపొరలలో పెనుమబ్బు
తెరలల్లి, తెరలలో యిరులల్లు శోకాన
అదరనీయకగుండె చెదరనీయకదృష్టి
నడిపించినది-చెల్లమాంబా-ఆపూల
పడవ నొయ్యన-చెల్లమాంబా. ౨౭

దరిలేని, లోతులందగరాని, ప్రేమసా
గరముపై తేలించి, తెరచాపగీలించి,
నరుల కన్నులచూపు చొరరాని సీమలకు
నడిపించినది-చెల్లమాంబా-ఆపూల
పడవ నల్లన-చెల్లమాంబా. ౨౮

రేవులెన్నొ దాటి దీవులెన్నొ దాటి
యేవలపులో కాల నేలుచున్నదొ తాను,
ఆలోకమునె చూచు ఆలోకనములతో

నడిపించినది - చెల్లమాంబా - ఆపూల
పడవ తిన్నగ - చెల్లమాంబా. ౨౯

నునుపుళక్కట్టెడు తేనెకెరటాల పై, వలపు
తరితీపులంచుల బరాబరి గ్రసించుకొన
తేనె వినువాకపై తేలించి తెరువెంచి
నడిపించినది - చెల్లమాంబా - ఆపూల
పడవ నల్లన - చెల్లమాంబా. ౩౦

నిలువబడె తెరచాప తెలిదమ్మి రేకువలె
పడగెత్తి మెలితిరిగి పరువెత్తు పామువలె
ఆకాశగంగ పాయలుచీలి సుడి దిరుగ
నడిపించినది - చెల్లమాంబా - ఆపూల
పడవ నల్లన - చెల్లమాంబా. ౩౧

పొరచేప ఒక్కెంబు తెరచాపపై గట్టి
యెదిరించు మిత్తినో రదిమి కాలము గెల్చి
వలపురాలచ్చి గెలువగ బోవు యోధయన
నడిపించినది - చెల్లమాంబా - ఆపూల
పడవ నల్లన - చెల్లమాంబా. ౩౨

తనలో మహాసముద్రము ఘూర్ణిలుచునున్న
తనచుట్టు జనసముద్రము హోరుమనుచున్న
క్రీడిరథ మాజిలో కృష్ణయ్యనడిపినటు
నడిపించినది - చెల్లమాంబా - ఆపూల
పడవ నల్లన - చెల్లమాంబా. ౩౩

కన్నీరుతో వలపు పన్నీరుతో పాల
మున్నీరులో గలియు మిన్నేరువలె మెరసి
మిన్నంటి తనమగని వెన్నంటి కడువడిగ
నడిపించినది చెల్లమాంబా - ఆపూల
పడవనల్లన - చెల్లమాంబా. ౩౪

ప్రాణాలపై యాన ప్రణయధర్మపుమాన
లోనకరగించు యీలువతనము వెలయించి
వలపుమేలిమి పదార్వన్నియకు గీటిచ్చి
నడిపించినది - చెల్లమాంబా - ఆపూల
పడవనల్లన - చెల్లమాంబా. ౩౫

గళసీమ మెరయు మంగళసూత్రపదకంబు
రహదారిచీటి స్వర్గమువారలకు జూపి
వలపు వినువాకలాకుల తలుపులను తెరచి
నడిపించినది - చెల్లమాంబా - ఆపూల
పడవనల్లన - చెల్లమాంబా. ౩౬

తన వెలుగువెల్లిలో తాను మెరయుచు తేరు
నడిచదల వేవెలుగు నడిపించువడు వడర
తన ప్రేమలోకమంతా ముంచితేల్చగా
నడిపించినది - చెల్లమాంబా - ఆపూల
పడవనల్లన - చెల్లమాంబా. ౩౭

పసపుచాయలనొసట మునదిగొను ముంగురుల
నడుమకుంకుమ, ప్రొద్దుపొడుపుచాయలబరప
ఆర్యప్రణయజ్యోతు లర్యమప్రభలుగా
నడిపించినది - చెల్లమాంబా - ఆపూల
పడవనల్లన - చెల్లమాంబా. ౩౮

చిన్నారినునుసిగ్గు కన్నెవలపుల మొగ్గ
లలరులై, సిరిదోటలై, తేనెసోనలై,
వాకలై, వనధులై; వసుధ దేల్చినసీట
నడిపించినది చెల్లమాంబా - ఆపూల
పడవనల్లన - చెల్లమాంబా. ౩౯

వ్రతములును నోములుపవాసములుసలిపి, యే
వలపుదీపపు జిలుగువెలుగులో తనమనువు
మలపుకొనెనో అట్టివెలుగులో తెరువరసి

నడిపించినది-చెల్లమాంబా-ఆపూల
పడవనల్లన-చెల్లమాంబా. ౪౦

తనగళాన కడానితాళికట్టినదాది
యేబొమ్మనోము తానిన్నాళ్లునోచెనో
ఆబొమ్మనే యొాలలాడించి వెన్నంటి
నడిపించినది-చెల్లమాంబా-ఆపూల
పడవనల్లన-చెల్లమాంబా. ౪౧

ఆకాశమున శారదాభ్రశకలమువోలె
మవ్వంపుతెలచందమామరేకయువోలె
పాలసంద్రంపుకెరటాలపై హంసివలె
నడిపించినది-చెల్లమాంబా-ఆపూల
పడవనల్లన-చెల్లమాంబా. ౪౨

కనురెప్పమూతలో కనుపించు వెలుగులో
తలపుత్రోవలబట్టి వలపుదీవులజుట్టి
శుద్ధభూములమెరసి, సిద్ధసీమల దరిసి
నడిపించినది-చెల్లమాంబా-ఆపూల
పడవనల్లన-చెల్లమాంబా. ౪౩

జగములకు వెలుగిచ్చు మగనాలితనములో
తగవెంచి యయ్యరుంధతి దొట్టి తొల్లింటి
మగువ లేమార్గాన మరలిరో ఆదారి
నడిపించినది-చెల్లమాంబా-ఆపూల
పడవనల్లన చెల్లమాంబా. ౪౪

నడిప్రొద్దు వెలుగులెవ్వడు నిల్చుఘస్రముల
పండుజాబిలి సొట్టపడనట్టి శర్వరుల
గలిగి రెప్పలపాటు కనరాని లోకముల
నడిపించినది-చెల్లమాంబా-ఆపూల
పడవనల్లన-చెల్లమాంబా. ౪౫

చదలపై నేడుగురు జడదారిపడతుకలు
అనురక్తి కప్పురపు టారతులు వెలిగింప
మలపిచుక్కాని మమ్మార్గు వలగొని వారి
నడిపించినది-చెల్లమాంబా-ఆపూల
పడవనల్లన చెల్లమాంబా. ౪౬

పడవమ్మై, యొక గాలిపడగమ్మై, తెలిమబ్బు
తునకమ్మై, నెలవంకదోనెమ్మై, చుక్కమ్మై
నీలాల నింగిలోనికి జోయి మాయమ్మై,
నడిపించినది- చెల్లమాంబా-ఆపూల
పడవనంతట - చెల్లమాంబా. ౪౭

*   *   *   *

3

ఎఱ్ఱటోపీలవా రెగుబుజంబులపైన
మరతుపాకులతోడ నికవురు సిపాయీలు
తము గాంచి బెదరు తీర్థప్రజాసముదాయ
మును జొచ్చి 'ఓచెల్లమాంబా నీకిదే
మ్రొక్కి-చెపుదుము 'చెల్లమాంబా. ౪౮

"దండాలు మాతల్లి! ధర్మమెరిగినతల్లి!
రాజాజ్ఞ తలదాల్చి రాక తప్పదు మాకు
సహగమనములు రాజు శాసించె కూడవని
కరుణించి ఓచెల్లమాంబా! గృహమునకు
మరలనగునో-చెల్లమాంబా." ౪౯

అని యామెపాదాల కనతిదూరమునందు
వంగి నేలకుమ్రొక్కి వడకుగదురగ నిల్చి
యున్నవారల జూచి 'ఓబిడ్డలార! మీ
కభయమనియెను, చెల్లమాంబా-నాత్రోవ
కడ్డులేదనె'-చెల్లమాంబా. ౫౦

నారాజు నావలపు రారాజు తమ్మయ్య
కుంఫిణీ దొరల కిది గుర్తెరుగ రాదయ్య
రాజెవరు? నను పోవరాదనుచు శాసింప
రాజీతడనె-చెల్లమాంబా-రాజ్యమునకు
రాణినేననె-చెల్లమాంబా. ౫౧

వారిపై తనదృష్టి సారించి చూచినది;
నడిసముద్రముపైన నారాయణుడువోలె
ఆ కనులయందు తమ్మయ్య మెరయుటగాంచి
ఆదిశక్తివి చెల్లమాంబా-అని వార
లంజలించిరి-చెల్లమాంబా. ౫౨

సూర్యులో, చంద్రులో, చుక్కలో, మెరుపులో
అంతకంతకు డిగుచు ఆకన్నులై మెరసె
నరసిపోయిన బొమల నొరసికొనుకనులతో
మెరసిపోయెను చెల్లమాంబా-స్వర్గాలె
తెరచుకొనగా-చెల్లమాంబా. ౫౩

తలలు కంకులుగాగ తరమైన యొకకొండ
జొన్నచేనై యూగుచుండు ఆజనమెల్ల
ఆభటులతో మాటలాడు చెల్లముజుట్టి
సుడిదిరుగగా-చెల్లమాంబా-జ్యోతియై
గుడి కట్టినది-చెల్లమాంబా. ౫౪

భక్తునకు ఒక్కడే భగవాను డెన్నంగ
పరమపాతివ్రత్యభరిత కొకటేసూత్ర
మార్యపత్నిత్వమున కాదర్శమొక్కటే
సత్యమనియెను-చెల్లమాంబా-అది ఒకటె
నిత్యమనియెను-చెల్లమాంబా. ౫౫

దీపమారిన వెనుక తేజంబు మిగులునా?
పూవురాలిన వెనుక తావితా నిలుచునా?
మీమాట లివియేల? మీయాజ్ఞ నాకేల?
తొలగిచనుడనె-చెల్లమాంబా-వెలలేని
వెలుగు గనుడనె-చెల్లమాంబా.' ౫౬

అని కన్నులర్రవాల్చి, యంజలిఘటించి, తన
మనసులో వెలుగు తమ్మయ్య ప్రేముడు వెంచి,
తలవంచి, కన్నీరు ధారగట్టగ నట్టు
లే నిలువబడె చెల్లమాంబా-వెలుగులో
లీనమయ్యెను-చెల్లమాంబా. ౫౭

ఆగిపోయెనుగాలి, ఆకాశమున రెక్క
లాపి పిట్టలు నిల్చె, యాకుకదలవు తరులు
ఆలమందలు దొడ్ల కరుగ కటులే నిలిచె
అట్లె నిలిచెను చెల్లమాంబా-కాలమే
ఆపినిలిపెను-చెల్లమాంబా. ౫౮

ఆకు కదలని యడవి అలలు దొరలనియాబ్ధి
యైపోయె క్షణకాల మా జనసమూహంబు.
'శాంతి ఓంశాంతి ఓంశాంతి ఓంశాంతి' యని
కనులు విప్పెను-చెల్లమాంబా-నలుదెసల
కలయజూచెను-చెల్లమాంబా. ౫౯

పద్మాకరముపైన బాలార్క కిరణముల!
జనసమూహము నవ్యచైతన్యమయమయ్యె;
ఆజవానులుకూడ నాపూలలో పూవు
లై పోవగా చెల్లమాంబా-పూదేనె
లారగించెను-చెల్లమాంబా. ౬౦

మరల వాయువు వీచె తరులయాకులుకదలె
నావు లంభాయంచు నాలయంబుల కరిగె
కిలకిలారావముల పులుగు లెగిరెను గూండ్ల
కపరదిక్కున-చెల్లమాంబా-చూచె సూ
ర్యాస్తమయమును-చెల్లమాంబా. ౬౧

ముడుచుకొనె వేవెలుగు పడమటిదిగంతమున
పొడిచి వెన్నెలపువ్వు విడిచినది తూరుపున
నడుమ శివమూర్తి సదనమునందు తనభర్త
చితిప్రక్క ఆ చెల్లమాంబా-ధీరయై
చేరి నిలిచెను - చెల్లమాంబా. ౬౨

సంజబంగరుచాయ రంజిల్లు కెరటాల
నడుమ తామరపూలు విడిచి తేనెలుగురియు
కరణి చెక్కిళ్లపైగల వళులలో జార
గా జూచె ఆ చెల్లమాంబా-కన్నీరు
కాల్వలుగ ఆ-చెల్లమాంబా. ౬౩

విశ్వములె తగులబడు విలయ కాలానల
జ్వాలారుణారుణోజ్వల తేజములవోలె
అఖిలదిక్కులను సంధ్యారాగములు నిగుడ
నందుమెరయుచు-చెల్లమాంబా-నిలిచె-
ఆయగ్ని కెదురుగ-చెల్లమాంబా. ౬౪

వేదమంత్రములు రువ్వెచ్చి విప్రులు చదువ
అంతకంతకు రగిలి యగ్ని కణకణలాడ
తనదోసిటను నిప్పుత్రవ్వి యంజలివట్టి
యగ్ని గనుగొని చెల్లమాంబా-తలవంచి
యనియె నిట్లని-చెల్లమాంబా. ౬౫

'నీవుసాక్షివి కదా ఆవేళ నాపెండ్లి
కీవె చేదును సాక్షి వీ యజ్ఞవేదికడ
దివ్యలోకము జేరు హవ్యవాహనమమ్ము
గొనిపోవుమనె-చెల్లమాంబా-ఆలోక
మును జేర్పుమనె-చెల్లమాంబా. ౬౬

మందార రేకలో మంకెన్న పువ్వులో
యన నెర్రనగునిప్పు లామెదోసిలియందె
జ్వాలలై నాలుకలు జాచి యల్లలనాడ
నవి హారతిగ-చెల్లమాంబా-తనభర్త
కర్పించినది-చెల్లమాంబా. ౬౭

మంచిగంధపు పుల్ల లుంచి పేర్చిన చితికి
ఆయగ్ని జ్వాలతో నామె ముమ్మారు ప్ర
దక్షిణము లొనరించి తనచేతి నిప్పుకలు
తలంబ్రాలవలె-చెల్లమాంబా-చితిపైన
కలయజల్లెను-చెల్లమాంబా. ౬౮

జగదంబ యీయంబ చండకాళిక నిజము
ఈపగిదినిప్పుతోనే పొలతి చెరలాడు!
అని తలలపై చేతు లట్టి జోడించుకొని
చూచుజనములు-చెల్లమాంబా-మమ్ము
దయజూడు మనుటయు-చెల్లమాంబా. ౬౯

తనవారు పెరవార లను భేదమే లేక
అందరిని లోగొనెడునట్టి చల్లనిచూపు
లార కన్నులు విచ్చి 'మీరిండ్ల కడకేగి
వర్ధిల్లు డనె చెల్లమాంబా-ధర్మముగ
వర్తిల్లు డనె చెల్లమాంబా. ౭౦

అని బొబ్బలెక్క కాలినయట్టి యరచేతు
లెత్తి దీవించి, సెల వింక నాకని చెప్పి
తడియారియున్న వస్త్రం బావునేతితో
తడుపుకొనియెను, చెల్లమాంబా-తనకురులు
ముడుచుకొనియెను-చెల్లమాంబా. ౭౧

మరియొక్కసారి తా తిరిగె ఆచితిచుట్టు
భర్తపాదాలు తనఫాలతలమున నద్ది
తనభర్త కెడమప్రక్కను తాను శయనించె
చితిపైన ఆ చెల్లమాంబా-మితిమీరు
ధృతిమీరగా-చెల్లమాంబా. ౭౨

ఎవ రాపగలవార లెవరువద్దనగలరు?
అందరును బొమ్మలట్లట్లె నిలిచిరి కొయ్య
బారి; రెప్పలుపడవు, శ్వాసలాడవుజనుల
కంతలోపల చెల్లమాంబా-తనుమంట
లలమికొనగా-చెల్లమాంబా. ౭౩

మందారపూలలో కుందనపు బొమ్మవలె
నెర్రతామరకొలన నీదు హంసియువోలె
శివుని చిచ్చుటకంట జెన్నారుపాపవలె
మెరయుచుండెను-చెల్లమాంబా-ఆయగ్ని
కిరణములలో-చెల్లమాంబా. ౭౪

"మంచిగందపు పట్టె మంచమా నీకు చితి!
విరిసెజ్జయా నీకు మెరసిమండెడు నిప్పు
లో యమ్మ! యగ్గి కాహుతియైతివా తల్లి!
ఏమిసేతుము-చెల్లమాంబా-అంబ! మా
కేది వెలుగిక?-చెల్లమాంబా!" ౭౫

అనుచు ఘూర్ణిల్లినది ఆజనసముద్రంబు
అవనియే కంపించె-ఆకసము హోరుమనె
అంబాయనుచు నార్చి యావు లశ్రులు రాల్చె
అఖిలజనములు-చెల్లమాంబా-అని చేతు
లప్పళింపగ-చెల్లమాంబా. ౭౬

ఆవునేతిని నానినట్టి గందపుకట్టె
లంతలో నాల్గుమూలలు కలియ నంటుకొన
తన్మధ్యముననుండి తనుబిల్చువారి పి
ల్పులకప్పుడ చెల్లమాంబా-ముమ్మారు
పలికె ఓయని చెల్లమాంబా. ౭౭

అగరువాసనలీను పొగలు గుబురులు తిరిగ
జ్వాల లంతట లేచి జడలల్లుకొనసాగ
ఛటఛటధ్వనులతో చిటిలి మిణుగురు లెగిరె
అంతకంతకు-చెల్లమాంబా-కాంతిల్లె
అగ్నిమయమై-చెల్లమాంబా. ౭౮

నీలాలపొగ లెగసి నింగిగా విరిసినవి;
మిణుగురులు చుక్కలై మింట పుష్పించినవి;
చెల్లమ్మ నిండుజాబిల్లియై దివి బొల్చి
పండువెన్నెల-చెల్లమాంబా-కీర్తిగా
నిండివెలిగెను-చెల్లమాంబా. ౭౯



# నిజమాడిన నిష్ఠూరము

## వేదాల తిరువేంగళాచార్యులు

యువ కార్తికమాసపు భారతిలో బ్ర. శ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు 'వెక్కిరింపబోయి బోల్తాపడుట' యను శీర్షికతో నేదో వ్రాయుచు నందులో నన్నుగురించిగూడా ప్రస్తావించిరి. ఆప్రస్తావనలో రెండువిషయములు ముఖ్యములుగా నున్నవి. ఒకటి, నేనుచెప్పిన దేదో గ్రహింపకపోవుట, రెండు నన్ను దమ నోటికి వచ్చినట్లు దుర్భాషలాడుట. ఇవి రెండును వారికి సహజములనుట జగద్విదితమే. ఎవరు మాన్పగలరు? "దుస్త్యజాహి ప్రకృతి"

అందు ఇపుడు నేను మొదటివిషయమును నిరూపించి, రెండవవిషయమును పరామర్శింతును. అసలు విషయ మిది:

సంస్కృతమున వామనాచార్యుడు రచించిన కావ్యాలంకారసూత్రవృత్తిని నే నాంధ్రమున ననువదించితిని. అందులో బదసంధివశమున నేర్పడు నశ్లీలదోషమునకు పాండవాశ్వమేధములోని "......పృథ్వీధరం బొక్కటా" యను పదద్వయ సమావేశమున నేర్పడు "బొక్క" యనుపదము స్త్రీగుహ్యస్మారకముగా బ్రకృతకాలమున బ్రతీతముగావున నిది యుదాహరణ మగునంటిని. శాస్త్రిగారు దీనిని సమర్థింపబూని "దీనికి బ్రాచీనప్రయోగము లున్నవి కావున నిది యదుష్ట"మనిరి. దీనిపై నేను జెప్పిన సమాధాన మిది:

"కవి యేపదములను బ్రయోగించునో వానియందుగాని, వాని సమావేశమునగాని తనకాలమున నశ్లీలప్రతీతి లేకుండ జూచుకొనవలయును. అశ్లీలప్రతీతి యుండెనేని ప్రాచీనప్రయోగము లున్నను నుపకరింపవు. ఇందు కుదాహరణము పైనుడివిన 'శష్ప' శబ్దము. "శష్పశ్యామాన్" అని కాళిదాసుడు, "శష్పాణ్యత్తి ప్రకిరతి శకృత్పిండకా న్నామ్రమాత్రాన్" అని భవభూతియు బ్రయోగించిరికదా యని ప్రకృతకాలమున నాపద మశ్లీలముకాదనువారుం డరుకదా! ఇట్లే అభిప్రేతయనుపదముగూడ గ్రహింపనగును. ఈపదము లోకపరిగృహీతము కావున సంవృతమనిచెప్పి అశ్లీలములేదని వామను డనెను. ప్రతాపరుద్రీయములో విద్యానాథుడు దీనినే అశ్లీలదోషమునకు "అభిప్రేతపదాపాంసుక దానస్సంభవిష్యతి"అని యుదాహరించెను. దీనివలన వామనునికాలమున "అభిప్రేత" పదము నిర్దుష్టముగా నంగీకరింపబడినను విద్యానాథునికాలమున లోకుల కాపదమున నశ్లీలార్థప్రతీతి కల్గుచుండెననియు, నందువలన నాపదమును విద్యానాథు డశ్లీలముగా నుదాహరించెననియు మనకు స్పష్టమగుచున్నది. ఈపదమునకు బ్రాచీనప్రయోగము మాళవికాగ్నిమిత్రము మొదలగువానిలో నగపడును. కావున బ్రాచీనప్రయోగములున్నను, ప్రయోక్తృకాలమున నశ్లీలార్థప్రతీతిని గల్గించునది యశ్లీలమేనని యొప్పకతప్పదు.

ఈ హేతువుననే వారు (చె. వెం. శా.) చూపిన "మరువ కనుష్ఠించునది సముంజసబుద్ధిన్." అను భారత ప్రయోగము ప్రకృతకాలమున "అనుష్ఠించు" అను పదము నశ్లీలముగాకుండ కాపాడజాలదు. ప్రకృతకాలమున నీపదము, అశ్లీలార్థ ప్రత్యాయకముగానే లోకమున బ్రసిద్ధముకదా! ఇట్లే "బొక్క", "కంపు" అనుపదముల విషయమునగూడ నశ్లీలార్థప్రత్యాయకత్వ మంద రంగీకరించెదరు"

-ఆంధ్ర కావ్యాలంకార సూత్రవృత్తి వివరణము.

ఇట్లు నేను వారిగ్రంథములో దోషమున్నదని నిజమాడినందువలన నిష్ఠురముపాలైతిని. చూడుడు. ఇట్టి సందర్భములో "మహాకవులు ప్రయోగించినను ఇతరులు ప్రయోగింపరా"దని నేననుట మహాపరాధమట. పోత

న్నగారు తనతల్లిని లక్కసానియని వాడిరిగదాయని ఇతరు డెవ్వడైన నిపుడు తనతల్లి పేరునకు 'సాని' యను పదము కూర్చి వాడునా? అట్లు వాడనగునా? వాడుట యుక్తమని యెవ్వరైన నంగీకరింతురా? కావుననే మహాకవిప్రయోగము లశ్లీలదోషమును వారింపజాలవంటిని. ఇట్లనుట నాదిమహాపరాధమట. నేను జ్ఞానలవదుర్విదగ్ధుడనట! దీనిసత్యమును విద్వాంసులే నిర్ణయింపగలరు.

అసలు మహాకవి ప్రయోగము లెచట నుపయోగించును? వ్యాకరణ మసమగ్రమగునపుడు దానివలన ప్రయోగములన్నియు సాధింపబడజాలవు. కావున వ్యాకరణమువలన సాధువులుకాని కొన్నింటివిషయములో నేదేనియొక మహాకవి ప్రయోగములున్నచో నవి అసాధువులు (వ్యాకరణదోషదుష్టములు) కాకుండగల్గును. అంతేకాని, అశ్లీలాదిదోషముల విషయమున మహాకవిప్రయోగములకు ఏవిధమగు ప్రామాణ్యమును లేదు. ఆ వ్యాకరణ విరుద్ధములలోగూడ నన్నియెడలను మహాకవిప్రయోగము లుపకరింపవు. చూడుడు. "తం పాతయాం ప్రథమమాస" అని ప్రాచీనమహాకవి ప్రయోగ మున్నదికదా యని మనముగూడ ప్రధానక్రియానుప్రయుక్తక్రియలను అట్లు వ్యస్తముగా ప్రయోగించినచో పండితలోక మేమనును? కావున నిట్టిపట్టుల నేమహాకవిప్రయోగములు నుపకరింపవు గదా!

ఇకపై జెప్పిన అశ్లీలాది దోషముల విషయములో మహాకవిప్రయోగములకు గాని, వ్యాకరణమునకు గాని ఎట్టి యవకాశమును లేదని యొకరు జెప్పనక్కరలేదుకదా! ఇట్టి సందర్భములో "వ్యాకరణమొక్క త్రోవ, మహాకవులొక త్రోవ" అను చె. వేం. శా. గారి మాటలొక త్రోవ, అసలువిషయము మరొక త్రోవ నున్నదనుట విజ్ఞుల కందరికిని విస్పష్టమే.

అయితే శాస్త్రిగారూ, ఒకచిన్నమాట. మీరు "యద్యపిశుద్ధం లోకవిరుద్ధం, నాకలనీయం నాచరణీయం" అని వ్రాసితిరే. అది తమకే అడ్డము తగులునని గుర్తించుడు. మేము చెప్పినదేమని? ప్రకృతలోకవిరుద్ధమగు పదమును ప్రయోగింపగూడదని. మీరు చెప్పునదేమి? ప్రకృతలోకమున నట్టిదైనను, మహాకవులు ప్రయోగించిరి గనుక ప్రయోగింపవచ్చునని. మహాకవిప్రయోగము శాస్త్రమేకాదా? ప్రకృతసందర్భములో మహాకవిప్రయోగము లోకస్థానాపన్నమగుట శాస్త్రీయమర్యాద నెరుంగనిమాట. కావున నిట్లు శాస్త్రవిహితమైనను లోకవిరుద్ధమైనది కావున ప్రయోగింపరాదనుటయేకదా నావాదము. ఇట్టివిషయమును దెల్పు "యద్యపి" ఇత్యాదివాక్యమును వ్రాసిన నన్నెక్కిరింపబోవుటలో మీకు బోల్తాపడుటయేగదా తటస్థించినది.

ఇట్లు నేనుచెప్పినదేదో మీరింతవరకును గ్రహింపనేలేదు. ఇదొక్కవిషయమేకాదు మీరు గ్రహింపనిది. ఇంకను చాలవిషయములున్నవి. క్రమముగా నిరూపింతును.

ప్రకృతోదాహృతమగునది 'శేప' వంటి యశ్లీలముగా నే నుదాహరించితినని కొంటిరి. కాదు; పురీషం డమహాద్రుమైః" వంటిది. ఇదియు మీరు ముఖ్యముగా గ్రహింపవలసినదేకద! గ్రహింపజాలకపోతిరి. "...మరియు" 'శేప' అనునది యసభ్యార్థకపదాంతరస్మారకమగుట నశ్లీలమని నేను వ్రాసినది నాస్వంతకల్పనమనియు, గర్హ్యమనియు వ్రాసితిరి. చూడుడు కామధేనువ్యాఖ్య: "అత్ర విరేచకయాభశేపపురీషవినాశపదవిన్యాసైః విరేచన మిథునీభావమేహనపురీష వినాశప్రతీతేస్త్రివిధాన్యశ్లీలాని ప్రదర్శితాని" అని. శేప అనుదానికి వైయర్థము లేదుకదా. ఇచట నేనొనర్చిన కల్పనము గర్హ్యమో, గ్రాహ్యమో సాహితీమర్మజ్ఞు లెరుంగుదురు. ఆలంకారికతంత్రమున మార్మికులకుగాని ఎరుగరాని విషయ మిది. ఇట్టిపద్ధతి గర్హ్యము కాదనియు, నిటువంటిస్థలములందు సాహితీమర్మజ్ఞు లిట్టిపద్ధతినే హర్షింతురనియు, లోచనాది గ్రంథజాతమును సవిమర్శముగా గురుపాదములకడ నభ్యసించినవారెరుంగగల్గుదురు. తదితరు లెట్లెరుంగగల్గుదురు?

మరొకవిషయము మీకు తెలియనిది. "ఉచ్చైః కులం చాత్మనః" అను కాళిదాసు ప్రయోగమును జూచిన వెంటనే మీ కుచ్చ స్ఫురించునంటిరి. కావున నా జెప్పిన పద్ధతిని అశ్లీలదోష మేర్పడవలసివచ్చునంటిరి. ఇట్టి వ్రాతవలనగూడ నే జెప్పినదేదో మీకు సరిగా బోధపడ లేదని స్పష్టము. కాళిదాసుకాలమున పైపదము మీ యసభ్యార్థమును స్ఫురింపజేయుచో నతడు దానిని బ్రయోగింపనే ప్రయోగింపడు. ప్రయోక్తృకాలమున నశ్లీలార్థప్రత్యాయన ముండినగదా మా వాదము ప్రకారము ఆపద మశ్లీలమగును? అదిసరే కాని, కాళిదాసుకాలమున నీయాంధ్రభాష అతనివాడుకలో నుండెనా? అతనిదేశమున, నతనికాలమున వాడబడు భాషలలో నీపదమున కశ్లీలార్థప్రత్యాయనమున్నదో లేదో, మీరేమైన నాలోచించినారా?

మీరు సరిగా గ్రహింపజాలనిది ఇంకొకటి. అవతారశబ్దమువిషయము. వామనాచార్యు డీపదము నసాధువనెను. "పరీవాదనవావతారః" అని కాళిదాస ప్రయోగ మున్నదికావున అవతారశబ్దము సాధువని మే మనుట లేదు. మత్స్యావతారశబ్దము సాధువగుట ఈ ప్రయోగ ముండుటవలననుగాదు. ఓహో వామనాచార్యుడు (లక్షణకర్త) అవతారపదమును నిషేధించినను కాళిదాసు అతని నీసడించివైచి అవతారపదము ప్రయోగించెనని నిరూపింపవచ్చునని కాబోలు మీయాస. ఇది వట్టి యడియాస. కాళిదా సేకాలపువాడు? వామనాచార్యు డేకాలపువాడు? ముందెన్నడో వందలకొలది సంవత్సరములతర్వాత వామనాచార్యుడు అవతారపద మసాధువని లక్షణము వ్రాయబోవునని వామనాచార్యునికన్న శతాబ్దములముందుబుట్టిన కాళిదాసు అతని నీసడించుకొనుట సంభవించునదేనా? ఇది నిరర్థకపుటూహ. అసలు లక్షణకర్తను మహాకవి ఈసడించుకొనునా? అట్లీసడించుకొనెనేని యతడు మహాకవి యగునా? సాహితీమర్మ మెరింగి రసపోషణప్రకారముల ప్రదర్శించి తత్కంటకముల నివారించుమార్గములను నిరూపించువాడుగదా ప్రకృతలక్షణకర్త, అనగా, అలంకార శాస్త్రవేత్త. రసపోషణకార్యభారమును నెత్తినిడుకొన్నవాడు మహాకవి. ఇట్టిమహాకవి పైవానిని తనకు మార్గదర్శకుడై, తనకు ముఖ్యమగు సహాయ మొనర్పవచ్చువానిని నిరాకరించునా? నిరాకరింప గలడా? నిరాకరించెనేని అతనికి రసపోషణకృత్యము నెరవేరునా? నెరవేరదేని, అతడు మహాకవి యగుట యటుండనిమ్ము, అసలు కవియైన గాగల్గునా? కావున లక్షణకర్తల అనుశాసనములను మహాకవులెల్లరును శిరసావహింపవలెనేగాని మరియొకటిలేదు. తప్పక యట్లు ధరించితీరవలసినదే. అట్లు ధరింపరేని మీవలె నిట్లు అశ్లీలాది దోషములతో రసపోషణమును జెడగొట్టుకొందురు. కావున "మహాకవులు లక్షణకర్తల నీసడించుకొందురు" అనియు, మహాకవు లీసడించుకొనుచున్నను లక్షణకర్త తాను లక్షణమాత్ర మొనర్చుట తనపనికావున నెట్లయిన నేదో లక్షణ మొనర్చితీరవలసినదే కాని అది లక్ష్యములతో సమన్వితమై ఆదరింపబడునా, లేదా యని విచారింపనక్కరలేదు" అను నీ తీరున వ్రాయువ్రాత లక్షణకర్తలను, వారి గ్రంథములను, మహాకవులను గురించి తత్త్వ మేమాత్రమును తెలియనిమాట. పైవాని తాత్త్వికస్వభావము నెరిగినవా రెవ్వరును ఇట్టివ్రాత వ్రాయరు.

పోనిండు, అశ్లీలదోషము ప్రాచీనప్రయోగము వలన బోవునను లక్షణవేత్తనుగాని, ప్రాచీనమహాకవిని గాని వారీసడించుకొనుచున్నను నేదో లక్షణమును వ్రాయుటయే పనిగా బెట్టుకొనిన లక్షణవేత్తను గాని వ్రేలుమడిచి యొక్కనిని జూపుడు. లక్షణము నీసడించు పట్టుల మహాకవి యనబడువానినిగాని యొక్కనిని జూపగలరా?

ప్రకృతమున అవతారపదమున వామనుని లక్షణము నిరాకృతమగునట్లు కనబడుటలేదా యని యందురా? కాళిదాసుని యవతారపదమువలన మీ యభిప్రాయము సమకూడదనియు, నిది కాలాత్యయాపదిష్టమనియు నెరుంగుడు. నిజమునకు కాళిదాసుని "అవతారము" ఏమాత్రము దుష్టముగాదు. అది భావార్థక మైనగదా వామనాచార్యుని దోషము ప్రసక్తించుటకు,

అధికరణార్థమున వ్యుత్పన్నము. భావార్థముననే 'అప్' అను ప్రత్యయమువచ్చునుగాని, కరణాధికరణార్థములందు రాదు. వామనాచార్యుడును (భావే అబ్విధానాత్) భావార్థముననే అజంతము కావలెననెనుగాని కరణాధికరణార్థముల గాదు. ఆవృత్తిని జక్కగా పరిశీలింపుడు. ప్రకృతమున 'ఇతి' శబ్దబోధ్యమగు పాదత్రయార్థము రఘువునకు అపవాదసాధనముకాని అపవాదముకాదు. ఇది శాస్త్రములను జక్కగా నభ్యసించినగాని బోధపడదు. ఇచట మల్లినాథసూరి "ఆవిర్భావః ఇత్యర్థః" అనుట ప్రమాదము. మహాకవిప్రయోగము లన్యథోపపన్నములై సామంజస్యము నొందునపుడు, వానిని "తాముబట్టిన కుందేటికి మూడేకాళ్లని" తప్పనబోవుట విద్వాంసులగు సజ్జనుల మార్గము కాదుగదా ?

పోనిండు, తుష్యతుదుర్జనన్యాయమున కాళిదాసుని అవతారపదము భావార్థకమనుకొందము; అయినను అపుడు వ్యాకరణముప్రకారమసాధువగుచో నసాధువే కాని సాధువగుట యెవ్వరికిని జెల్లదు. మహాకవిప్రయోగము| నసాధు వనగూడదని మీయూహగాబోలు. ఆ యూహ పొరబాటు.

ఏమనగా నేభాషయందు వ్యాకరణ మసమగ్రమో, అట్టిదని తద్భాషావేత్తలగు శిష్టుల నిర్ణయమో అచట మహాకవుల ప్రయోగములకు వ్యాకరణముకన్న విలువ హెచ్చు. కారణమేమి? భాష వాడుకలోనుండుట వలన వ్యాకరణము భాష కంతటికిని జేయ వీలుగాకుండును. అప్పుడు వ్యాకరణము పరిమితవిషయమే కావున అనంతమగు భాషాసముద్రము నీదుటకు మహాకవుల ప్రయోగములే శరణ్యము లగును. కావున వ్యాకరణము కన్నగూడ మహాకవుల ప్రయోగములకే ప్రాముఖ్యము హెచ్చగును. ఉదాహరణము మన ఆంధ్రభాషయే. ఇక నేభాషకు ప్రకృతమున లోకవ్యవహారము లేదో అట్టి భాషయం దెక్కుడు మార్పు లుండబోవు కావున నా భాషకు వ్యాకరణము సమగ్రముగా రచింపబడవచ్చును. అట్టి భాషలో మహాకవిప్రయోగములకన్న వ్యాకరణమునకే ప్రాముఖ్యముహెచ్చు. వ్యాకరణ విరుద్ధమైనచో నెన్నిప్రాచీనమహాకవిప్రయోగము లున్నను పదము దుష్టమే. వ్యాకరణవిరుద్ధమగుదానివిషయమున మహాకవిప్రయోగము లేమాత్రము నాభాషయం దుపకరింపవు. కావుననే "కథం,శార్వరస్య తమసో నిషిద్ధయే ...అపభ్రంశా ఏవైత ఇతిప్రామాణికాః. అవైహీతివృద్ధి రసాధురేవ" అని ప్రామాణికులు వ్రాయుట కల్గినది. ఇట్టిది సంస్కృతభాష. ఈభాషయందలి "అవతారః" అనుపదము భావార్థమున ప్రయోగించుచో నసాధువనియే యందురు. కాని సాధువనుట ఎవ్వరికి నెన్నటికిని బొసగదు. ఇటువంటి సందర్భములలో మహాకవిప్రయోగము లున్నవి కావున నివి సాధువులని వ్రాయుట విద్వాంసుల సాంప్రదాయము కాదు.

ఇక మత్స్యావతారము విషయము. ఇచట నవతారశబ్దము కరణాధికరణార్థముల వ్యుత్పన్నము. మత్స్యరూపమగు నవతరణసాధనము కలవాడనియు, మత్స్యరూపమగు నవతరణాధికరణము కలవాడనియు నచటి యర్థము. అవతారములు అనచోటగూడ నిట్లే యర్థమును గ్రహింపవలయును. ఈవిషయమంతయు బూర్వాచార్యులే నిరూపించియున్నారు. ఇచట నేను కల్పించుకొనవలసిన యావశ్యకతలేదు. మీ కీవిషయము దుర్గ్రాహము కావున నే నింతదూరము వ్రాయవలసి వచ్చినది.

ఇట్టిస్థలముల మహాకవిప్రయోగముల నాధారముగా గైకొనుట చాలప్రమాదము. అసలు మహాకవుల ప్రయోగవిషయములే అతిపరిమితములు. ఒక అసాధువుల విషయముననే వానికి గొంతకొంత ప్రవేశమున్నది. అదియు వ్యవహ్రియమాణభాషయందే. వ్యవహారభ్రష్టయగు భాషయందు వీనికి ప్రామాణ్యము అసాధువుల విషయమున చాలవరకు మృగ్యము. చూడుడు, "సఖి నా వాసరేంద్రేణ." అని ప్రాచీనమహాకవిప్రయోగమున్నది కదాయని అగునాతను లట్లు ప్రయోగింపవచ్చునా ?

ప్రాచీనప్రయోగములున్నచో బడము లన్నియు ప్రయోగింపవచ్చునను దృఢనిశ్చయముతో నున్న మీరు బాతుపదప్రయోగమును గురించి యాక్షేపించి యుండుటికే, అదియుక్తమగునా? నన్నయభట్టారకుని ప్రయోగ

మున్నదికదా? మీ వాదము పూర్వాపర విరుద్ధము కాదా? "విలువగల మహాకవుల లక్ష్యమ్ములె యీభార మంతయు మోయును" గదా! పాపము మీ కేల ఈ వాగర్థక్యమున నిట్లు శ్రమపడవలసి వచ్చినది? మీ రేదైన వ్రాయునపు డికనైన మీమాటలను వెనుకముందులను బాగుగా ఆలోచించుకొని వ్రాయుటకై ప్రయత్నింపుడు.

నిఘంటువులలో "బొక్క" అనుపదమున కశ్లీలార్థము వ్రాయబడియుండలేదు గనుక నిది యశ్లీలము కాదని ఇంకొక యుక్త్యాభాసము.

ఈ పదమువలన లోకమునందంతట స్ఫురించు అశ్లీలార్థము నిఘంటువులందుండుట యావశ్యకమగుచో ముందు మేము వ్రాయబోవు నిఘంటువులందుండును లెండు. మీ నిఘంటువు మీ కెట్లు ప్రమాణమగునందురా? మీ రెన్నడో వ్రాసికొనిన మాటలు మీకు ప్రమాణమగునపుడు మేము వ్రాయబోవు నిఘంటువు మాకు ప్రమాణమగుటలో మీ రాశంకింప బనిలేదు. లోకసమ్మతార్థమును బ్రతిపాదించుటచే మావాక్యములు ప్రమాణములగునందురా, అది మాకే సహాయకారి యగుమాట. మా యర్థము లోకసమ్మతమేగదా! నిజమునకు మీవాక్యము లోకసమ్మతార్థముకాదు గావున నది ప్రమాణ మెన్నడును గాదు. కేవల మది యప్రమాణము. కావున దుష్టము. చూడుడు– "విలువగల మహాకవుల లక్ష్యమ్ములే భారము మోయును" అనిగదా మీవాక్యము. 'విలువగల' అనగా నేమర్థము? మహాకవులలక్ష్యమ్ములలో గొన్ని విలువగలవియు, కొన్ని లేనివియునా? అట్లు కాదు గావున నీవిశేషణము నిరర్థకము. 'ఈభార' మనగా నేమి? వ్యాకరణమున కందనిపదములను మీరు ప్రయోగించునప్పుడు వానిని సాధువులుగా నొనర్చు భారమేకదా! ఇది కుదురదు. మహాకవుల లక్ష్యమ్ములు కూడ పరిమితవిషయము లేనవియు, నవికూడ సర్వత్ర సాధుత్వాపాదన మొనర్పజాల వనియు నిదివరలోనే నిరూపించియుంటిమి. కావున వ్యాకరణ సమ్మతములు కాని యంతటను సాధుత్వసమర్థనభారము మహాకవుల లక్ష్యమ్ములే మోయుననుట పొసగదుకదా! లక్ష్యమ్ములొక్కదానికే యీ యధికారము లేదు. కావున పై వ్రాసిన మీ వాక్యమంతయు ననన్వితార్థకమై అప్రమాణమును, దుష్టమును. ఇట్లు మాటలాడుచో నంతులేని తప్పులువచ్చు మీ రితరుల నాక్షేపింపబోవుట యెంతవఱకు యుక్తమో ఆలోచించుకొనుడు.

అసలుపదములవలన స్ఫురించు నశ్లీలార్థములు నిఘంటువులం దుండపనిలేదు. వెనుక నిరూపించిన శష్పము, అనుష్ఠించుపదముల కశ్లీలార్థ మేనిఘంటువులం దున్నది? నిఘంటువులైనను లోకవ్యవహారమునుబట్టియే కదా! పదముల కర్థము వ్రాయునది! ఇట్లు నిఘంటువులకుగూడ మూలమగు లోకవ్యవహారమం దీయర్థము సుప్రసిద్ధమైయుండగా నిఘంటువులందు గన్పట్టదని తప్పించుకొనబోవుట అలంకారశాస్త్రమర్యాద నెఱుంగమియేగదా! సంస్కృతభాషలో కొన్ని పదముల కూర్పువలన నప్పటివాడుకభాషలో నశ్లీలశ్రవణ మేర్పడెనేని నశ్లీలదోషము నిరూపింపబడియుండుట మీ రెరింగియున్నచో నిట్టి యుక్త్యాభాసమును వ్రాసియుండరు. ఇట్టిస్థలములందు వ్యాకరణములుగాని, మహాకవుల లక్ష్యములుగాని, నిఘంటువులుగాని మీ కేమాత్రము శరణము కాజాలవు.

నిఘంటువులందు కంపు అనుపదము సువాసనను బోధించునట్లు వ్రాయబడియున్నది. ప్రాచీన ప్రయోగములు ఆయర్థమునందే కన్పడుచున్నవిగదా! కావున ఆపదమును మీరు అత్తరుకంపు, పూవులకంపు అని వాడుదురా? అట్లు వాడినచో లోకము మెచ్చునా? మెచ్చదు.

నేను అప్రసక్తముగా మీ వ్రాతను దడవితినంటిరి. నేను లక్షణగ్రంథమును వ్రాయునపుడు లక్ష్యములకై చాలమంది గ్రంథములను గైకొందును. అట్లే మీ గ్రంథములను గైకొంటిని. ఇందప్రసక్త మేమిగలదు? లక్షణకర్త లక్ష్యములకై ఇతరుల గ్రంథముల గైకొనుట యప్రస్తుతమగునా? వామనాచార్యుడ ట్లొనర్ప లేదా? ఆలంకారిక తంత్రవేత్తలందరు నించుమించుగా నీపనినే

చేసిరి. ఇందు నేనప్రస్తుతమగుపని నొనర్పలేదు. అప్రస్తుత మనగానిది (మీరొనర్చినపని). ఎవరినిగురించియో యేదో వ్రాయుచు నంగులో ఆశీర్షిక క్రింద నేమాత్రము సరిపడకున్నను నావిషయమును దడవుట అప్రస్తుతము.

మీ గ్రంథము లెన్నో యుండగా నీపదము నొక్కదానినే యుదాహరించితినిగాన రంధ్రాన్వేషణపరుడ నంటిరి. పాండవాశ్వమేధము, బాలరామాయణము, మీశతావధానము మొదలగు మీ గ్రంథములు మూడు నాల్గు ఇంచు పరామృష్టములైనవి. షుమారు పదివరకు నిందు దోషోదాహరణములుగా మీపద్యము లుదాహరింపబడినవి. ఇట్టిస్థితిలో నిదియొక్కటే ఉదాహరించితిననుటయు, నిచట నింకను మీ రసభ్యప్రసంగము నొనరించుటయు నేమియు నుచితముగా లేవు.

నా గ్రంథములో "అయితే యోచించి" అని వ్రాసితిననియు, నవి దుష్టపదములనియు వ్రాసితిరి. అవి దుష్టములైనంతమాత్రమున మీదోషము తొలగిపోదు. కావున నీరాతవలన మీకేమాత్రమైన ప్రయోజనమున్నదా ? నిజమునకు ఈవిషయమునుగురించి యాక్షేపించుటకు మీ కెట్టి యధికారమును లేదు. "ప్రకాస్తి" పదమును, "అభణపుగాండ్లు", "డిల్లికి ఢిల్లే పల్లెకుబల్లే" యనియు వ్రాసిన మీరు ఈవిషయములో నోరెత్తుట కేమాత్రమును అర్హులుకారనువిషయము మఱవకుడు. 'ప్రకాస్తి' అనునది పామరైకప్రయోజ్యమగు గ్రామ్యపదము. 'అభణపుగాండ్లు' అనునది నిరర్థకపదము. డిల్లికి అనునదియో పామరుల వాడుకలోనిది. ఇట్లు వ్రాసిన మీరుగూడ నితరుల నాక్షేపింపబూనుట పరిహాసభాజనమగుటకే గాదా ?

నేను వ్రాసిన 'అయితే', 'యోచించి' ఇని రెండును శిష్టవ్యవహారసమ్మతములు. శిష్టవ్యవహారసమ్మతమగుభాష వాడుట నాసాంప్రదాయము. 'సిద్ధిర్లోకాద్రష్టవ్యా' అని గదా భువనోపజీవ్యు డుపదేశించినది!

"తగునిజ తెగదని మదిలో
వగవక సాధులకు బీదవారల కొగ్గల్."

అనిగదా అమహానుభావుని మార్గము. అది నాకు శిరోధార్యము. 'యోచించి' అనుదాని విషయములో గొంత చెప్పవలసియున్నది. "యోజించి" అనియుండవలెనని మీయూహ. అదితప్పు. యోజించి అనగా కూర్చి, లేక సమన్వయించి అనిమాత్రమే యర్థము. 'ఆలోచించి' అనునర్థ మెచ్చటను నెట్లును రాదు; రాజాలదు. ఆయర్థమున యోచించుటయే శిష్టవ్యవహారసిద్ధము. కావున మీ యోజన పూర్తిగా దుష్టము. నాయోచించుట మిక్కిలి యుక్తము.

నా గ్రంథము తప్పులతడకయనియు, నింక నెన్వియో వ్రాసితిరి. దానివలన మీకు గల్గులాభ మిసుమంతయును లేదు. నా గ్రంథము ముద్రణమునందు చాల పొరబాట్లకు లోనైనది. వ్రాతప్రతిని జూచినచో నన్ని విషయములును స్పష్టపడగలవు. అచ్చువేయించుటలో జరిగిన లోపమువలన నట్టివ్యత్యాసము జరిగినది. అందువలన నా గ్రంథముల కొకలోటుగాని, మీకు కొంచెమైన లాభముగాని యొదవదు. పాపము మీకు వృథా కంఠశోషమాత్రమే.

అది యటుండనిండు— ప్రకృతవిషయము విద్యావిషయము. ఇట్టిపట్టుల విమర్శించునపుడు మృదువును, సరళమును, శాస్త్రీయమును అగు యుక్తిజాలమే ఆవశ్యకముగాని ఊరక నిరర్థకములగు తిట్టుల కేమాత్రమును ప్రసక్తిలేదు. నేను మీ గ్రంథమును విమర్శించునపుడు నా యాంధ్ర కావ్యాలంకారసూత్ర వృత్తివివరణమునం దొక్క పరుషవాక్యమేని మీవిషయమై వాడియున్నట్లు చూపగలరా? అట్టిసందర్భములో మీ రేలనో చాల తొందరపడి అనవసరమైన నిందావాక్యములను, పరుషవాక్యములను చాలామిగిలియున్నారు. చూడుడు. అసలు కారుణ్యము వేయుటతోనే మీరాత ప్రారంభమైనది. జ్ఞానలవదుర్విదగ్ధుడనియు, పనిలేని పాటగా తెలివితేటలు వెళ్లబోసితిననియు, మేము నూటికి ముప్పదియైదుమార్కులతో ప్యాసగుదుము కావున మాది మూషవవంతు పాండిత్యమనియు, చెట్టుక్రింది ప్లీడర్ల తెగలోని వారమనియు, ఉట్టికెగురలేనమ్మ స్వర్గాని కెగురబోయి నట్టున్నదనియు, అల్పజ్ఞానమనియు, మాజ్ఞానము శోచ్య

మనియు,సహృదయులు మమ్ముల మందలింపవలెననియు, ఇట్టివే యింకను మీచేతికి వచ్చినట్లు వ్రాసితిరి. ఇది మర్యాదకలవారు వ్రాయుపద్ధతియేనా? కారుణ్యము వేయుదుమను ప్రల్లదపుమాటకాదా? జ్ఞానములసంగతి ప్రకృతవ్యాసములవలననే విజ్ఞులగు చదువరు లెరుంగ గలరు. ప్రకృతవిషయము సభాముఖముననైనను మీరు సమర్థించుకొనవచ్చును. అప్పుడే మన తారతమ్యములు తేటపడును. ఊరకవృథాదూషణములతో బని యేమి? వయోమాత్రవృద్ధులగు మీరు మావిషయములో తొందర పడుట ఇదియే మొదటిసారి కావున ఇప్పటికి సహించి ఇంకొకసారి మీకు జాగ్రత్తకై దృఢముగా హెచ్చ రించుచున్నాను. చేతనగుచో సభాముఖమున నిల్చి మీ వాదమును నిలబెట్టుకొనుటకు ప్రయత్నింపుడు. లేదేని యూరకుండుడు. అంతేకాని నిరర్థకముగా తిట్లు తిట్ట కుడు. అది విద్వాంసులు, మర్యాదకలవారు, సజ్జనులు నొనర్చుపనికాదు. మేము మీగ్రంథమున దోషము లున్నవని నిజము చెప్పితిమి. అది సజ్జనులగువా రందరు నాదరింతురు. ఇతరు లట్లు చేయరు. లోకమున నున్నదే కదా నిజమాడిన నిష్ఠురము!

---

# ప్రాచీనాంధ్రకవులు

నిడుదవోలు వేంకటరావు

## ౮. కవిమహేంద్రుఁడు

కవిమహేంద్రుఁ డను బిరుదుపేరు గలిగిన యీకవి భాస్కరాచార్యకృతలీలావతి గణితశాస్త్రమును పద్యకావ్యముగ తెలిఁగించినవాఁడు. ఈతఁడు నియోగిబ్రాహ్మణుఁడు. కోడూరు వల్లభామాత్యుఁ డీతనిపేరు. తండ్రి రాఘవసూరి. తాత యెఱ్ఱయామాత్యుఁడు. ప్రబోధానందస్వామిశిష్యుఁడు. తెలుఁగున శాస్త్రీయగ్రంథరచనము గావించిన పూర్వకవులలో నొకఁడు. హారితసగోత్రుఁడు.

ఈతఁడు క్రీ. శ. ౧౫౪౦ సంవత్సర ప్రాంతమున నుండెనని యీతని యాంధ్రలీలావతిలోని యీక్రిందిపద్యమువలనఁ దెలియుచున్నది:

శ్రీనరసింహానందను న
 రిందమవిక్రము, కృష్ణరాయభూ
జానిని వెండియుం దదను
 జన్ముని నచ్యుతదేవరాయనిన్
దా నధికాప్తుఁడై కొలిచి
 తద్దయు మన్ననగాంచి మించు వి
ద్యానిధి బొమ్మలాట విరు
 పాధిపు కాళని ప్రార్థనంబునన్.

పై పద్యమువలన నీతఁడు శ్రీకృష్ణదేవరాయలకాలముననేకాక, రాయలవారి సవతి తమ్ముఁడగు నచ్యుతదేవరాయల కాలమున నున్న బొమ్మలాట విరూపాక్షుని కుమారుఁడగు కాళని కాప్తుఁడై యుండెనని తెలిసికొంటిమి. ఈతని యితరగ్రంథము లేవియు తెలియుటలేదు. గణితశాస్త్రమును దెలిఁగించినవాఁడగుటచే కవి తనకు కృతిభర్తయగు కాళఁడు వేయినూటపదార్లు బహుమతియొసఁగినట్లు నభ్యాసమున కొనంగు లెక్కవలె యిట్లు చెప్పియున్నాఁడు:

"నరసనరేంద్రునందనుఁడైన యచ్యుత
 దేవరాయల కృపాదృష్టిఁజేసి
అందోళికారూఢుఁడగు...బొమ్మ
 లాట కాళఁడు వేడ్క నర్థరాశి
లో నాత్మగురునాథుఁడైన కుమారతా
 తాచార్యవర్యున కర్థమిచ్చె
ద్విజులకు శేషతృతీయముల్ రెండిడి
 శేషపాదము కవిశ్రేణి కొసఁగె
స్నేహమున దన చెలులకు శేషనవమ
భాగపంచకమంతయు బంచిపెట్టె
కవిమహేంద్రున కర్పించె కలిగినట్టి
వేయినూటపదా రెంత విత్తరాశి?"

ఈతని గ్రంథము పూర్తిగఁ జిక్కకపోయినను చిక్కినంతవఱకుఁ జక్కని భాషాంతరమని 'విజ్ఞానసర్వస్వము' నుడువుచున్నది. కవులచరిత్రమున కెక్కక పరిశోధకులకుఁ దక్కినవారిలో నీతఁ డొకఁడు.



సూర్యాస్తమయము D. A. R.



ద్వారపాలకులు K. M. R

(Sources of Vizianagar History Page 156 - 157. No. 52 Lilavati by Vallabhacharya, other wise Kavi Devendra)

౯. కట్టవరదరాజు

ఈతఁడు తొల్లి తెలుఁగునాటిని పాలించిన తెలుఁగుచోడుల వంశమువాఁడు; రాజకవి. ఈతఁడు రచియించిన గ్రంథములు మూఁడు మనకుఁ దెలియుచున్నవి. పరమ భాగవత చరిత్ర, శ్రీరంగమాహాత్మ్యము, రామాయణము. ఇందు మొదటివి రెండును పద్య కావ్యములు; మూఁడవది ద్విపద కావ్యము.

౧. ఇది తంజావూరుపుస్తకశాలలోఁ గలదు.

ఈతఁడు తన కాలమును దెలుపలేదు. తన వంశక్రమము కరికాలచోడునినుండియు వర్ణించినను, తెలుఁగు బిజ్జలునివద్దనుండి వంశక్రమము వర్ణించునపుడు "ఏతద్వంశవిస్తారుఁడై" అని చెప్పుటచే, తెలుఁగుబిజ్జలుని వెనుక పెక్కుతరముల తరువాతివాఁడని తెలియుచున్నది. తరములేల ? శతాబ్దములు గడచియుండవలెను. ఏలయన, శ్రీరంగమాహాత్మ్యమున కవిస్తుతియందు

"నన్నయభట్టు దిక్కనను, నాచనసోముని సార్వభౌము దిక్కన్నను, బెద్దిరాజు మొదలైతగు నాంధ్రకవీంద్ర ముఖ్యులన్."

సన్నుతిచేయుటచే నీతఁడు నల్లసాని పెద్దనాదులవెనుక, నన(గా ౧౫౫౦ ప్రాంతమునకుఁ దరువాతివాఁ డని నిశ్చయింప వచ్చును.

ఈతఁడు శ్రీ వేంకటేశ్వర స్వామిభక్తుఁడు. విశిష్టాద్వైతి. శ్రీరంగ మాహాత్మ్యగద్య వలన నీతని కవితావిశేషము తెలియగనగును

"ఇది శ్రీ వేంకటేశ్వర వరప్రసాదాసాదితచాటుధారా నిరాఘాట సరస చతుర్విధ చతురకవిత్వ రచనాచమత్కార సకల విద్వజ్జనాధార, కట్ట హరిదాసరాజ గర్భాబ్ధిచంద్ర వరదరాజేంద్ర ప్రణీతంబైన గారుడ పురాణశతాధ్యాయి శ్రీరంగ మాహాత్మ్యంబను మహాప్రబంధంబునందు సర్వంబును దశమాశ్వాసము."

ఈతని ద్విపదరచనము మిక్కిలి మేలైనది. కవి పదునాఱవ శతాబ్దమువాఁడు కాఁదగును.



# వర్ణసమామ్నాయమున 'క్ష'కారము

కల్లూరి వేంకటసుబ్రహ్మణ్యదీక్షితులు

'ఓనమాలు' దిద్దించిన తొలిగురువుల యుపదేశముస్మృతి నాయీవ్రాతకు బలమిచ్చుచున్నది. కనుక నయ్యనంత 'గురు' శబ్దవాచ్యమగు నఖండజ్యోతి కిదే జోహారు.

అకారాదిక్షకారాంతవర్ణమాల ప్రథమోపదిష్టమగుట మఱపునకు రాదు. పెద్దఱికము హద్దుమీఱిన కొలఁది 'క్ష'కారము క్ర-క్య మొదఁలగువానివంటి సంయుక్తాక్షరమే కాని ప్రత్యేకవర్ణము కాదనియు, చిన్నబడిపంతుళ్లగుట నాచిన్నతనపు గురువు లట్లు నేర్పిరనియు ననఁదగు స్థితికి వచ్చినారము. ఆంధ్రభారతీ సేవా సమాసాదిత పుణ్యధార నాప్రామాణికాతిక్రమణపంకము నించుకనైనఁ గడిగికొని, క్షమార్పణము సెప్పుకొందమని యీవ్యాసముం బ్రకటింప సాహసించితిని.

ఆంధ్రలాక్షణికులు 'క్ష'కారము నొకమాఱు గదిపిచూచినవారే కాని, యదియు నొక సంయుక్తాక్షరము, దాని జోలి మనకేల యని తమదారిం బోయినవారు కారు. అందులకు వారికిని బ్రథమగురూపదేశమే కారణము. తుదకుఁ గాదన్నను, అది వర్ణసమామ్నాయమునఁ బ్రత్యేకవర్ణమగునా కాదా, యని తొలుత లాక్షణికుల హృదయ ప్రబోధమున రేకెత్తిన యాశంకయే నేను నిరూపింపఁబోవు నద్దాని వైశిష్ట్యమునకుఁ బ్రబలాధార మగుచున్నది. కనుక శిష్టాతిక్రమణ దోషభయమును నాకు లేదు.

అప్పకవి

ఆగమజ్ఞులు దొడ్డబీజాక్షరంబు
లందు లేకున్కి సన్నంబు నదియుఁ గూడ
నొకటిగాఁ జేసి బీజోపయోగి గాన
క్షాను జేకొనిరది శబ్దసరణి గాదు
కాకు 'షా' జడ్డమైన క్షకార మగుట
దలఁప కేఁబదిలిపులలో దానిఁ గూర్చి
తొలుత భిన్నాక్షరంబైన దొడ్డళాను
విడిచిపెట్టె ననంతుండు వెఱ్ఱి గాఁడె?"

అని తనసిద్ధాంతమును వాకొనియె.

అకారాదివర్ణమాతృకలకు మంత్రశాస్త్రమున వినియోగము కలదు. అందు వర్ణమాలలో 'క్ష'కారము మేరువుపూసగా గణించు నాచారమును గలదు. మఱియు 'అ'కారము మొదలు 'క్ష'కారముదనుకఁ గల వర్ణమాలను బ్రత్యాహారము చేయుచు 'ఆదిక్షాంతలిపి' అను మంత్రశాస్త్రపాఠముంబట్టి 'అక్ష' మాలయను పద మేర్పడినది (కొందఱు 'అక్షర'మును ఆదిక్షాంతవర్ణ ప్రత్యాహారఘటిత మనిరి. కాని యది సరికాదు. 'నక్షరతీత్యక్షరః' అని యేర్పడిన దక్షరము). ఆగమజ్ఞుల మతమునుంబట్టి 'క్ష'కారము వర్ణసమామ్నాయసిద్ధమనిన యప్పకవిమాట కిది నా వివరణము. ఇఁక నాతఁడు 'శబ్దసరణి కాదు' అనెను. అది సరికాదు.

కవికల్పలత-శబ్దస్తబకమున

"ఆదిక్షాంతలిపౌ కాది
క్షాంతశబ్దగవేషణమ్,
చిత్రానుప్రాసయమక
శబ్దనిశ్చయకృ ద్భవేత్"
—అనుప్రాసకుసుమము.

అని సుప్రసిద్ధాలంకారికుఁ డగు దేవేశ్వర మహాకవి యమకకవిత్వమును నేర్చుకొను రీతిని వివరించునట్లు నుల్లేఖించెను. ఇట నాగమ ప్రసక్తిలేదు. వాఙ్మయశాఖలో నుట్టంకితము. కనుక కేవల భాషాతత్త్వవేత్తల మతమునను అకారాదిక్షకారాంతములు వర్ణము లనుట సంప్రదాయరూఢ మనుట నిర్వివాదమే.

ఉచ్చారణముంబట్టియు 'క్ష' కారము నకు వైశిష్ట్య మక్షరతత్త్వవేత్తలకు గోచ రింపకపోదు. సంయుక్త వర్ణోచ్చారణమున క్ + ర = క్ర, క్ + త = క్త అనువానిలో 'క' కారమును, రేఫ తకారాదులయు నుత్పత్తిక్రమ మాయాస్థానములయందు స్పష్ట ముగా గోచరించుటయేకాక రెండు వ్యంజ నములయొక్కయు ప్రత్యేకధ్వని శ్రవణగోచర మగుచునే యుండును. కాని క్ + ష = క్ష.

అనుచో 'క' కార మంతర్లీనమై, యిది సంయుక్తాక్షరము లన్నింటికంటె నొక యవా చ్యమగు వైలక్షణ్యమును సంపాదించుచు న్నది. కనుక శబ్దసరణియందు సిద్ధానికిఁ బ్రత్యేకత సాధింపరానిది కాదు. (మోక్ + షము) మోక్షము ఇత్యాదుల భేదము నరయు నది.

ఈస్థితిలో సిద్ధానికి గీర్వాణవాణియం దలి వర్ణసమామ్నాయమున లాక్షణికమగు ప్రత్యేకత యీఁబడలేదుగదా యన్న నది యొక బాధకము గాదు. ఆభాషలో నందు వలనఁ గలిగిన లాక్షణికమగు ప్రక్రియా లోపము లేకపోవుటయే కారణము. కాని ఆంధ్రభాషలో నీయక్కరమునకుఁ బ్రత్యేకత యంగీకరింపకున్నచో నాలోపమును గలుగు చున్నది. చూడుఁడు!

ద్రుతసంధియందుఁ బరుషములకు సర ళాదేశము విహితముకదా! అట్టియెడ

"ఈదృశగుణగణనిధికిని
వేదార్థ కవిత్వతత్త్వ విధివిత్పతికిన్
క్ష్మాదివిజకవిజనాళీ
ర్వాద............" —కాశీఖండము.

అనుచో 'క్ష్మా'కు సరళత్వము రావలసినదే కదా! వచ్చెనా? ద్రుతముపై క్ర, త్య ఇత్యాదు లున్నపుడు రాకమానునా? 'క్ష' తక్కంగల సంయుక్తాక్షరములతోఁ బాటిదే యగుచో నీ వ్యత్యాసమునకుఁ గత మేమి? కనుక సంస్కృతమున 'క్ష'కారమునకుఁ బ్రత్యేకత వ్యావహారికమును, ఆంధ్రమున లాక్షణికముగూడ ననుట సిద్ధాంతము.

ఆంధ్రవాగనుశాసనుఁడు మొదలగు లాక్షణికులలో నొక్కయనంతుఁడుమాత్రము

"యరలవ లంతస్థులు నాఁ
బరగును శషసహాలు దేటపడ నూష్మలనన్
సొరిది క్షకారము గూడుక
సరినేఁబది యయ్యె వర్ణసంఖ్య ధరిత్రిన్"

అని క్షకారప్రత్యేకత వివరించెను. అది శబ్దసరణిగాదని తోలుతటిరీతి ననంతుని వెక్కి రింపజేసినాఁ డప్పకవి. ఇందెవరు వెక్కివారో విజ్ఞులు నిర్ణయింతురుగాక!

# వ్యావహారిక రచనకు కొన్ని నియమాలు*

తెకుమళ్ల కామేశ్వరరావు

వ్యావహారిక రచనలు ఇరవైఏళ్లనుంచీ మళ్లా కనబడుతున్నాయి చిన్నయసూరి ౧౮౫౩లో 'నీతిచంద్రిక' ప్రకటించాడు. అతను అది ప్రకటించిన వేళావిశేషమేమిటోగాని గ్రాంథికం క్రమేపీ వ్యాపించిపోయింది. మన వచన సాంప్రదాయం తలకిందులయింది. అరవతెలుగువాని మాటలే తెలుగువారికి రుచి అయాయి. ఈవిపరీతస్థితి అరవైఏళ్లపాటు వుంది. ఇంతట్లో కొందరు మహానుభావులు గ్రాంథికశైలి మన సాంప్రదాయం కాదనీ, వ్యావహారికమే రచన కుపయోగించవలసిన భాష అనీ కనిపెట్టి, గ్రంథకర్తలకు బోధించడం మొదలుపెట్టారు. మొదట్లో వారివాదాన్ని ఎవరూ ఆలకించలేదు; పైగా హేళన చేశారు; వ్యతిరేక ప్రచారంకూడా సాగించారు. దాని ఫలితమే ఆంధ్రసాహిత్యపరిషత్తు. వ్యావహారిక వాదులకూ గ్రాంథికవాదులకూ ఘర్షణ ఎక్కువయింది. గిడుగువారికి పట్టుదల యెక్కువయింది. ప్రచారం మీద కొంతమంది రచయితలు వ్యావహారికాన్ని ఆమోదించడం మొదలుపెట్టారు. పాతదయినా వ్యావహారికం మళ్లా కొత్తదవడంచేత అంతవేగిరం వ్యాపించలేదు. అంచేతే మొదటి పదిసంవత్సరాలూ మనకు ఆట్టే వ్యావహారికరచనలు కనపడవు.

ఇటీవల పదిపన్నెండు సంవత్సరాలనుంచీ లెక్కకు మించినన్ని వ్యావహారికరచనలు కనబడుతున్నాయి. ఏదేనా వాఙ్మయపత్రిక తీసి చూస్తే చాలు, ఇంచుమించుగా వచనభాగమంతా వ్యావహారికంలోనే వుంటుంది. ఇప్పుడు అనేకమంది పెద్దలు కూడా ఈశైలిలోనే రాస్తున్నారు. యువకులమాట చెప్పేఅక్కర్లేదు. వాళ్లు సర్వసాధారణంగా ఈశైలిలోనే రాస్తున్నారు. రానురాను వ్యావహారికాన్ని ఆమోదించే పెద్దల సంఖ్యకూడా విస్తరిస్తూంది. ఈమోస్తరుగా వ్యావహారికం దినదినాభివృద్ధి చెందుతూంది. ఇలాగ అభివృద్ధిచెందుతూంది అన్నంతమాత్రాన్ని దీనికి విరోధం ఎక్కడా లేదని అనుకోవద్దు. అపకారం చేసేవాళ్లు ఆప్రయత్నం గట్టిగానే చేస్తున్నారు కాని లాభించకుండా వుంది.

ఇంకా రచయితలందరూకూడా వ్యావహారికంలోకే దిగలేదు. నూటికి తొంభైమంది మాత్రమే వ్యావహారికంలో రాస్తున్నారు. మిగిలినవారు అనేక మోస్తర్లుగా రాస్తున్నారు. కొందరు గ్రాంథికంలో రాస్తున్నారు. అరసున్నలు, బండి'ర'లు విడిచిపెట్టి కొందరు గ్రాంథికం రాస్తున్నారు. కొంతమంది తమకు గ్రాంథికం, పాత్రలకి వ్యావహారికం వాడుతున్నారు. కొంతమంది గ్రాంథికంలోనూ, వ్యావహారికంలోనూ కూడా రాస్తున్నారు. అచ్చతెనుగే వచనశైలికి ఉత్తమమని ఆశైలిలోనే రానేపెద్దలుకూడా వున్నారు! ఈమోస్తరుగా అనేకశైలులున్నాయి. ఏదైనా వ్యావహారికంయొక్క ప్రభావంచేత కమోసు గ్రాంథికంయొక్క కాఠిన్యం మొత్తంమీద అన్నివిధాలా తగ్గిపోయింది.

వ్యావహారికభాషాప్రయోజనాన్ని గురించి ఇంకా అనేకమందికి అనేక ఉద్దేశాలు వున్నాయి. కొందరు వ్యావహారికం చిన్నకథలకీ, పిట్టకథలకీ, సాంఘికనాటకాలకేగాని విమర్శ, శాస్త్ర, భాషావ్యాసాలలాంటివాటికి పనికిరాదంటున్నారు. ఈమోస్తరుగా వ్యావహారికం కొన్నిటికేగాని అన్నిటికీ పనికిరాదనుకోడం ఉత్తభ్రమ. వ్యావహారికానికి సరిపడని రచన అంటూ

* ఈవ్యాసం ౧౯౩౮ లో రచించబడింది:—తే. కా.

వుండదు. అలాగవుంటే ఆరచన తెలుగుభాషకే సరి పడ దన్నమాట. ఇప్పుడు అనేకమంది అనేకవిమర్శ, శాస్త్ర, భాషావ్యాసాలుకూడా వ్యావహారికంలో రాస్తున్నారు. వాటిని అందరూ మెచ్చుకుంటున్నారు. ఇంకముందు వ్యావహారికం కొన్నిటికేగాని అన్నిటికీ పనికిరాదనే వాదన తగ్గిపోతుందని అనుకొంటున్నాను.

ప్రత్యేకంగా వ్యావహారికశైలిసంగతి చూద్దాం. ఈపేరు పెట్టి అనేకశైలులు బయలుదేరుతున్నాయి. వ్యాసంలో మొదటిసగం గ్రాంథికం - అరసున్నలు బండి'ర'లు లేనిది— రెండోసగం వ్యావహారికం. లేక మొదటిసగం వ్యావహారికం, రెండోసగం పైమోస్తరుగ్రాంథికం ఒకవాక్యం వ్యావహారికంలోనూ, రెండోవాక్యం గ్రాంథికంలోనూ వున్న వ్యాసాలు కూడా లెక్కకుమించి వున్నాయి. అంతేకాదు, ఒక మాట ఒకమాటు వ్యావహారికంలోనూ, అదేమాట మరొకమాటు గ్రాంథికంలోనూ కూడా వాడుతున్నారు. ఈమోస్తరుగా కలగాపులగంభాష ఎంతో కనబడుతూంది.

ప్రత్యేకంగా వ్యావహారికభాష సంగతి ఏమిటంటే—. ఈప్రత్యేకంగా వ్యావహారికభాషే అనేకమందికి అనేక ఊహాపోహలు కలిగిస్తూంది. కొందరి పెద్దల అభిప్రాయాలు ఇక్కడ తెలియచేస్తాను. (౧) 'మాటలాడునట్లే వ్రాయవలెనన్న జాతి కొకభాషయు, జిల్లా కొకభాషయు నేర్పడవలసివచ్చును. ఈవిషయమునుగూర్చి వ్రాసి విసిగితిని. ప్రజ లిదివరకే విసిగియున్నారు.'—(ఆంధ్రగ్రంథాలయసర్వస్వం, మొదటి సంపుటం, ౧౪౦ పుట) (౨) 'మొదట భాషావిషయమున రెండుపక్షములేకాని యిపుడు రెండువందల పక్షము లేర్పడినవి. ఎవరిసాంప్రదాయం వారిదే. ఎవరి ప్రయోగములు వారివే. ఎవరి వ్యాకరణము వారిదే. ఎవరి యిష్టము వారిదే. హద్దు లేదు. ఆజ్ఞ లేదు. అఃలేదు, ఉఃలేదు.'— (గిడుగువారి జన్మదినోత్సవ వ్యాససంగ్రహంలో తెలుగు భాగంలో ౧౧వ పుట) (౩) 'భారతిలోని కథలు చదువగాచదువగా ఏకత లేని లోపము కనపడ్డది'. (భారతి ౧౧ వ సంపుటం, ౨ వ సంచిక) (౪) 'వ్యావహారికభాషలో........ అనేకపదాలు ఒకతీరూ ఒకతెన్నూ లేక నానా రూపాలను పొందివుంది. పదాలుమాత్రమే కాదు, వాక్యరచనావిధానంకూడా అట్లే కనబడుతువుంది. అందుచేతనే వ్యావహారికభాషను అభిమానించి అంగీకరించేవారుకూడా 'దానికి ఏకత అక్కరలేదా' అని ప్రశ్న వేస్తున్నారు'—(భారతి ౧౧వ సంపుటం ౩ వ సంచిక 'మనవిమాటల'లో) (౫) 'గ్రామ్యభాష అంటే ఈవాడుకభాష ఒక్కరీతిగ నుండదు. అది ప్రతిజిల్లాకు మారుతూంది. ఒకజిల్లావాడుకభాష యింకొకజిల్లావారికి లాటినుగా వుంటుంది. అట్టి సందర్భంలో ఏదోఒక జిల్లావాడుకభాషలో వ్రాయబడిన గ్రంథాన్ని తెలుగు ప్రపంచాని కంతకూ జూపించి ఇది ఆంధ్ర వాఙ్మయము అని చెప్పితే బాగుండదు.—' (సాహితి ౪ వ సంపుటం, ౪౫౭ వ పుట) (౬) 'భాషకు కట్టుబాట్లు వద్దనటానికి వీల్లేదు, మనిషి కొక తెలుగై పూరుకుంటుంది—ఇప్పుడు కానేఅయింది'—(ప్రబుద్ధాంధ్ర అయిదో సంపుటం, ౧౩౫ వ పుట). వ్యావహారికాన్నిగురించి విమర్శకులలో ఇటువంటి అభిప్రాయాలున్నాయి. వీరుచెప్పే మాటల్లో సత్యం లేకపోలేదు. కాని వ్యావహారికరచనలను సూక్ష్మదృష్టితో పరిశీలిస్తే పైవారి మాటలన్నీ అతిశయోక్తులని అనిపిస్తాయి. ఎంచేతంటే, పేరుమోసిన పెద్దలు అనేకమంది రాసే వ్యావహారిక రచనలలో ఒ రచన కొక పుంజీడు తప్పులేనా దొరకడం కష్టం. ఇంక మరి కొత్తగా వ్యావహారికరచన ప్రారంభించినవాళ్లలోనో కావలసినన్ని తప్పులు. పైవిమర్శకుల అభిప్రాయాలు ఆమోస్తరుగా వుండడానికి కారణం ఈ రెండోరకంవారి రచనలే.

కొంతమంది పెద్దలు రాసే రచనలలో సాధారణంగా తప్పులు కనపడవన్నాను. ఎంచేత? సాధన మీద వారు తెలుసుకొంటారు, వ్యావహారికానిక కూడా కొన్నినియమా లున్నాయనీ, ఆనియమాల ప్రకారం రాస్తే తప్పులుండవనీ. పెద్దలలోకూడా ఒకరిద్దరు గ్రహింపులేనివారు వున్నారులెండి! వారు దొంతులు దొంతులుగా వ్యావహారిక గ్రంథాలు రాసినా

వ్యావహారికశైలిలో కొన్ని నియమాలు వున్నాయనీ, అవి పాటిస్తే వ్యావహారికం యిష్టంవచ్చినట్లుగా వుండ డనీ గ్రహించలేకపోయారు. కాని సాధారణంగా ఒకరచయిత కొన్ని వ్యాసాలు రాసేటప్పటికి ఇదీ పద్ధతని తెలిసిపోతుంది. హాస్యవ్యాసాలుండే 'వినోదిని' గాని, 'చిత్రగుప్త' గాని ఒక్కమాటు తీసిచూడండి. ఎన్నివ్యాసాలు స్వచ్ఛమైన వ్యావహారిక భాషలో వుంటాయో! ఈ వ్యాసాలలో కొన్నికొన్నిటిలో రెండుమూడు తప్పులేనా కనపడడం కష్టం. ఎవరు నేర్పారు వీరికి ఈమోస్తరుగా రాయడం! వారంతట వారు నేర్చుకొన్నదే. కొన్నివ్యాసాలు రాయడంతోనే ఇదీపద్ధతని తెలిసిపోతుంది.

ప్రారంభకుల రచనల్లో తరచు తప్పులు వుంటా యన్నాను. అలాగ తప్పులుండడానికి ముఖ్యకారణ మేమిటంటే, వారు మేము మాట్లాడేటట్టే రాస్తామని అంటూవుండడం. మాట్లాడేటట్లు రాయడం అసలు సాధ్యమవుతుందో, కాదో చూద్దాం. మనం మాట్లాడే టప్పుడు ఒక అక్షరం వదిలేస్తా మరొక అక్షరం సాగతీస్తాం, ఒకమాట విడిచిపెడతాం, మరొకమాట మళ్లీమళ్లీ వాడతాం, వెనకమాటలు ముందూ, ముందు మాటలు వెనకా చెప్తాం. ఒకప్పుడు కొన్నికొన్ని మాటలే విడిచిపెట్టి ఏదోఒక సంజ్ఞతో పూర్తిచేస్తాం. ఒకప్పుడు రెండుమాటలు కలిపేసి ఒక్కమాటలాగే వాడతాం. మరొకప్పుడు అదే ఇంగ్లీషులో చెప్పి తెనుగులో చెప్తాం. అనవసరంగా ఇంగ్లీషుముక్కలు వాడతాం. ఒకమాట ఒకరూపంలో మొదట వాడి ఆతర్వాత అదే మరోరూపంగా అంటాం. ఇన్ని రకాలుగా వుంటుంది మాట్లాడే భాష. మాట్లాడే మాట ల్లోని ధ్వనులన్నీ మనం రాతలో చూపించడం మన తరంకాదు. మాట్లాడడంయొక్క ఉద్దేశమేమిటంటే, మన ఉద్దేశం ఎలాగో ఒకలాగ అవతలవారికి తెలియ చెయ్యడమే. మనం రాసేటప్పుడు కూడా ఇన్నిమో స్తర్లుగానూ వుండవలసిందేనా! ఉంటే మన రచన తిరిగి మనం చదువుకున్నా అర్థంకాదు, ఇతరుల మాట చెప్ప నవసరంలేదు. అంచేత మాట్లాడేటట్లు రాయడం అసాధ్యం, నిష్ప్రయోజనం. మాట్లాడేటట్లు రాయడం గురించి గిడుగువారు చెప్పినమాటలు వినండి: 'ఒక్కమనుష్యుడే ఒకశబ్దమును ఒకప్పుడు ఒకలాగునా మరొకప్పుడు మరొకలాగున ఉచ్చరిస్తాడు, ఒక్కకుటుం బంలోనివా రెవరైనా ఒక్కశబ్దమే ఒకరు ఒకవిధము గాను, మరిఒకరు మరిఒకవిధము గాను పలుకుతారు. ఇట్లే వివిధజాతులవారిలోనూ వివిధమండలములవారిలోను వ్యత్యాసము కనబడుతుంది' (బాలకవిశరణ్యం పు. ౨౬౬) మాట్లాడేటట్లే రాయబోతే మూడుకోట్ల తెలుగుభాష లేర్పడతాయి; మనిషి కొకభాష అన్నమాట. కనుక మాట్లాడేటట్లు రాయడానికి ప్రయత్నించవద్దు.

మాట్లాడడంలోవుండే తొందరవల్ల మన కన్ని భాష లేర్పడుతున్నాయి కాని, నిదానంగా రాసేరా తల్లో ఇన్నిభాష లెందుకు ఏర్పడతాయి? అలాగ ఏర్పడవుకాబట్టే సాధన వున్నవాళ్ల వ్యావహారికశైలి యించుమించుగా ఒకలాగే వుంటు దన్నాను. వారు, మాట్లాడడంలో వచ్చేటటువంటి తప్పులన్నీ రాతలో రానియ్యరు. ఒకేమాటకు అనవసరరూపాలు కల్పించరు. ప్రారంభకులు మాత్రం సంభాషిస్తున్నట్లే రాయడానికి ప్రయత్నించి, అనేక తప్పులు రాస్తూవుంటారు. వీరి రచన యిలాగ వుండడానికి ఇదొక్కటే కారణం కాదు. మరొకకారణంకూడా వుంది. వారు పాఠశాలలో చదువుకొన్న భాష గ్రాంథికం. వ్యాసంలో రాయ బోయేది వ్యావహారికం. అంచేత గ్రాంథికానికీ మాట్లాడ డానికీ మధ్య ఎన్నిరకాలుగా వుండాలో అన్నిరకాల గానూ వారి శైలి వుంటుంది. ఇటువంటి రచనలను గురించే నేను పైన ఒకవ్యాసంలో సగం గ్రాంథికమనీ, సగం వ్యావహారికమనీ, ఒకవాక్యం గ్రాంథికమనీ మరొక వాక్యం వ్యావహారికమనీ, ఒకమాట ఒకమాటు వ్యావహారిక రూపంలోనూ మరొకమాటు గ్రాంథిక రూపంలోనూ వుంటుందనీ చెప్పాను. వీటికి కొన్ని ఉదాహరణలు చూపిస్తాను. ఆఉదాహరణలు చూపించే ముందు మరొకమాట. వ్యావహారికంకూడా తప్పులతో రాస్తున్నప్పుడు, ఆతప్పులతో రాయడ మేదో గ్రాంథి కంలోనే రాయరాదా అని గ్రాంథికవాదులు అంటా

రేమో ! వ్యావహారికం కొంత సాధనమీద శుభ్రంగా రాయవచ్చు. ఎంతసాధన చేసినా కృతక గ్రాంథికమే గాని స్వచ్ఛమైన గ్రాంథికం పట్టుబడదు. అర్ధశతాబ్దం పాటు గ్రాంథికంలో కృషిచేసిన శ్రీజయంతిరామయ్య పంతులుగారు ఉత్తరరామచరిత్ర నాటకం ఎలాగ రాశారో చూడండి! ఆనాటకంలో వున్న తప్పులు గ్రాంథికమంతా శ్రీ చిలుకూరి నారాయణరావుగారు 'ప్రబుద్ధాంధ్ర' ౫వ సంపుటంలో విమర్శించారు. ఈతప్పులలో ఒకటిరెంటినిమాత్రమే శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు తమ 'గ్రామ్యారణ్యకుఠారం' లో సమర్థింపజూచారు. ఏభైయేళ్లపాటు అభ్యసించినా గ్రాంథికభాష మానవుడికి స్వాధీనంకాదు. మరి వ్యావహారికమో! స్వల్పపరిశ్రమమీదే చాలా నేర్పు కలుగుతుంది. కలగాపులగంవ్యావహారికానికి ఉదాహరణ లింకయిస్తాను. ఉదాహరణలు మూడో నాలుగో యిచ్చానని యిటువంటి రచనలు యింతేఅని అనుకోకండి. ఇటువంటి రచనలు వందలూ వేలూ వున్నాయి. మచ్చుకుమాత్రమే మూడునాలుగు యిస్తున్నాను. (౧, 'ఈలక్షణము పాత్రానుగుణముగా వచ్చింది; దుష్యంతుడు కాముకుడు. శ్రీరాముడు దేవాంశ సంభవుడు, అందుచేత నీభేద మావశ్యకమయ్యెను. తపోవనమున నడుగుపెట్టింది మొదలు దుష్యంతుడు మదనోపాస మగ్నుడైయుండెను. అట్టివానికి శకుంతల సరళ నిర్మల తాపసత్వము తట్టదు. కామలోచనములకు కామ్యగుణములే కానవచ్చును. శ్రీరాముడు సీతాసహితుడై చాలాకాలమున్నా అతని కామె నిర్మలచారిత్రమందే ప్రత్యయము కుదిరింది. కాని ఆమెబాహ్యరూపమాతనికి పరమలక్ష్యము కాలేదు.' (౨) 'గోపాలానికి పదునాలుగు ఏళ్లు. అమ్మో నాముద్దుకొడుక్కు తండ్రి లేడు అని ఏడుస్తుంది, వసంతమ్మ రహస్యంగా. గోపాలం బడినుండి వచ్చెను.' (ఆనందబోధిని, సంపుటం ౧ సంచిక ౧) (3) 'నాకునూ అలాగే తోచినది వెంటనే. నామ్రుతి ఒక్కటే కాదు మహారాణీ అగ్నిప్రవేశము నిశ్చయము. నాకొమార్తె మానరక్షణకై ప్రాణత్యాగము చేసికొనునో, అది వీలుకానినాడు, మాన మర్యాదలు పోయి జీవచ్ఛవమైయుండుటో - హా! తల్లీ లవంగీ, నా ప్రాణపదమా! ఎంతమాట అనవలసి వచ్చినదో గదా నీవిషయమై! మాముగ్గురితో సరి మావంశము! కాని నే నెందుకూ భయపడలేదు. నాథుడులేని రాజ్యము పాట్లు ఎవరెరుగనివి? ప్రజలు నాపిల్లలు, పరరాజాధికార సంక్షోభ...నాకు మాటరాకున్నది. అందుకూ నా క్షోభ (కళ్యాణి ౧ సంపుటం ౫ సంచిక) (౪) 'ఇంక నీముఖమైన చూడనుపో; నాయాచారమంతా గంగలోకలిపావు, నానిష్ఠంతా దగ్ధమైంది. కాశీకిపోయి గంగలో స్నానముచేసిన గాని యీదోషము పరిహారముకాదు.' ఈ ఉదాహరణలో వున్న శైలికే కలగాపులగంశైలి అనిపేరు. ఇటువంటి వ్యాసాలకి లెక్కలేదు.

వ్యావహారికభాషననుసరించి పండితుల ఉద్దేశాలెలాగున్నాయో పైన చూపించాను. వరి అభిప్రాయాలు పరిశీలించిచూస్తే మనకు మరొకసంగతి కనబడుతుంది. అదేమిటంటే, వ్యావహారికభాష జిల్లా జిల్లాకీ భేదిస్తూందనీ, అంచేత ఈశైలిలో రాయకూడదనీ. ఈమాట లెంతమట్టుకు సత్యమో చూద్దాం.

వ్యావహారికరచనలు బాగా బయలుదేరి పదిపన్నెండేళ్లయింది. తెలుగుదేశంలో అన్నివైపులనుంచీ రచయితలు కాస్తో కూస్తో వ్యావహారికంలో రాస్తున్నారు, ఉత్తరసర్కారుల వాళ్లరచనలు యెక్కువగా వున్నాయి. ఇప్పటిమట్టుకు ఆజిల్లావారి రచనలు తెలియలేదని ఈజిల్లా ప్రజలుగాని, ఈజిల్లావారి రచనలు తెలియలేదని ఆజిల్లావారు కాని అనడం చూడలేదు. ఎందుకని అంటారు? నెల్లూరివాడు మాట్లాడితే విజయనగరంవాడికి తెలియదా, విజయనగరంవాడు మాట్లాడితే నెల్లూరువాడికి తెలియదా, ఒకవేళ యాసవల్ల మొదట్లో వేగిరం అర్థం కాకపోవచ్చుగాని. అయితే ఈ మోస్తరుగా ఒకరిభాష ఒకరికి అర్థంకాదని మనకు చెప్పినవా రెవరు? గ్రాంథికవాదులు వారు తమవాదంకోసం ఈ అతిశయోక్తులు కల్పించారు. ఈఅతిశయోక్తులు తీసి పారేస్తే నిజం కొంతమట్టుకు కనబడుతుంది. అదేదంటే, ఈ జిల్లాలో శిష్టులు సంభాషణలో వాడని కొన్ని ముక్కలు ఆజిల్లాలో శిష్టులు వాడతారు. అదే మోస్త

రుగా ఆజిల్లాలో శిష్టులువాడని కొన్నిముక్కలు ఈ జిల్లా శిష్టులు వాడతారు. ఈ వాడబడని ముక్కలు అవతలజిల్లావారికి తెలియవా అంటే అవే ముఖ్యంగా తెలుస్తాయి. ఎంచేతంటే, సరదాగా ఆక్షేపించుకోడానికి మొట్టమొదట ఈముక్కలే నేర్చుకొంటారు. అంచేత ఒకరిమాటలు ఒకరికి తెలియకపోవడం వుండదు. పోనీ అప్పటికీ ఏవో కొన్ని తెలియని ముక్కలే వుంటాయనుకోండి. వ్యావహారికాన్ని ఆక్షేపించడానికి అదో పెద్ద కారణం కాదు. ఎంచేతంటే, మనయిళ్లల్లో ఆడవాళ్ల సంభాషణ వింటూవుంటే మనకు తెలియనిమాటలూ, జాతీయాలూ యెన్నెన్నో కనబడతాయి. అంతమాత్రంచేత వాళ్లభాష వేరు, మనభాష వేరు అనుకుంటున్నామా, లేక వాళ్లతో మాట్లాడకూడదని అంటున్నామా. తెలియని ముక్కలేవేనావుంటే నేర్చుకోవాలిగాని భాష పనికిరాదని అనకూడదు.

ఇప్పుడు తెలుగుదేశంలో కొన్నిప్రాంతాల్లో వ్యావహారిక రచయితలు విశేషంగా వున్నారు, ముఖ్యంగా ఉత్తరసర్కారులలో. చిత్తూరు, రాయలసీమ, నిజాంఆంధ్రదేశంలో అసలు ఏదోఒకటి రాసేవాళ్లే తక్కువ. అందులో వ్యావహారికంలో రాసేవాళ్లు బొత్తిగా తక్కువ. కాని మనకు దొరికినంతమట్టుకు వారి రచనలలోని వ్యావహారికానికీ మన వ్యావహారికానికీ విశేషం భేదం కనపడడంలేదు.

ఇప్పుడు వ్యావహారికరచయితలు అంతా శిష్టుల భాషలోనే రాస్తున్నారు. లెక్కలేనంతమంది బ్రాహ్మణేతరరచయితలు వున్నారు. వీరంతాకూడా శిష్టుల భాషలోనే రాస్తున్నారు; గ్రామ్యంలో రాయడం లేదు. రచనకి అర్హమైన భాష ఒక్క శిష్టులభాషే అని రచయితలు చాలామంది గ్రహించారు.

సాధనవున్నవారి రచనలలో తప్పులు సాధారణంగా వుండవన్నాను. ప్రారంభకులలో తప్పులు విశేషంగా వుంటాయన్నాను. ఇప్పుడు సాధనవున్నవారి రచనల్లోని నియమాలనుబట్టి ప్రారంభకుల రచనలలోని దోషాలను చూపిస్తాను. ఈదోషాలు కొన్నివర్గాల కింద విభజించి తెలియజేస్తాను. ఈదోషాలన్నీ మాసపత్రికలలోంచీ, పుస్తకాలలోంచీ తీసినవే.

## ౧. కుదింపులు

కుదింపులు రెండురకాలు. ఒకటి, ఒకమాటలో అక్షరంగాని, అక్షరాలుగాని విడిచి, లేక అక్షరంమీద అక్షరం యెక్కించి, హ్రస్వం చెయ్యడం. రెండోది, రెండూ లేక కొన్నిమాటలకు అనవసరమైన సంధికల్పించి హ్రస్వం చెయ్యడం. ఈకుదింపులు సాధనవున్నవారి రచనల్లో ఎక్కడోగాని కనపడవు. ప్రారంభకుల రచనల్లోనో విశేషంగా వుంటాయి. సాధారణంగా రచయితయొక్క ప్రారంభదశలో ఇవి విశేషంగా వుండి సాధనచేస్తూన్న కొద్దీ తగ్గిపోతాయి. ఈకుదింపులు గ్రంథకర్తయొక్క మొట్టమొదటి రచనల్లో విస్తారంగా ఉండటానికి కారణమేమిటంటే, గ్రంథకర్త ప్రారంభదశలో సంభాషణ ననుకరిస్తూ రాయడమే. మన సంభాషణల్లోవుండే కుదింపులకు లెక్కలేదు. గ్రంథకర్త ప్రారంభదశలో సంభాషణ ననుకరిస్తూ రాస్తాడు కాబట్టి ఇవి అతని రచనలో చేరతాయి. కాని ఈకుదింపులవల్ల శైలిలో స్పష్టత ఉండదని తెలిసికొని క్రమేపీ తనరచనలో వాడడం తగ్గించుకొంటాడు.

కుదింపులవల్ల శైలిలో స్పష్టత ఉండదు. చదువరులకు చదవడానికి విసుగ్గావుంటుంది. కనక రచయితలు తమ రచనల్లో కుదింపులు చేరకుండా వుండేటట్లు చూసుకోవాలి.

కుదింపులు ఒక్కచోటమాత్రమే వాడవచ్చు. అదేదంటే పాత్రపోషణకోసం; అంటే, ఒకపాత్రయొక్క ఒకానొకగుణం తెలియచెయ్యడంకోసం. స్త్రీల సంభాషణల్లో కుదింపులు విశేషంగా వుంటాయి. కాబట్టి స్త్రీపాత్రల సంభాషణలో వాటిని కొంతవరకూ వాడవచ్చు. ఏదైనా వీటిని మితంగా వాడడమే ఉత్తమం. ఎంచేతంటే వీటివల్ల శైలిలో స్పష్టత వుండదు. ఇది ఫలానాశబ్దమని చదువరికి చటుక్కున తెలియక చదవడానికి విసుగుకలిగిస్తుంది. అంచేత వీటిని ఎంతమితంగా వాడితే అంతమంచిది.

ఇక్కడ కొన్ని కుదింపులు
వాటిలో ఏమైనా అచ్చుతప్పులు వు ఉదాహరిస్తాను.
నాకు తెలియదు. అవి వున్న ప్రకాహ్నాయో యేమో
ప్రక్కనే అవి ఏమో స్తరుగా సమే రాసి, వాటి
చేస్తాను. వుండాలో తెలియ

అంగా స్త్రం-అంగవస్త్రం
అండమే-అనడమే
అడు గావేపేసి-అడుగు
ఆయన్తో-ఆయనతో - ఆవేపు వేసి
ఆయం దెక్కడో
ఇంకోడివగ్గరి ఀ-ఆయన దెక్కడో
ఇంటి క్కెళ్లా కెళ్లి-ఇంకొకడి దగ్గరికి వెళ్లి
ఇదం తేవి ప్పుడు-ఇంటికి వెళ్లేటప్పుడు
ఊరుక్కా-ఇదంతా యేమిా
ఏమను ి-ఊరుకుని
కనప -పీకునను
కర్ణణీయను-కనపడనీయను
క ం-కరణం
క్రగోటి-క్ర వొకటి
త్త-కలత
ళ్లింబ -ళ్లి వెంబడి
కాల్వ-కాలవ
కురూ పెందుకాక్క వాలీ-కురూపి ఎందుకు కావాలి
గట్టొచ్చు-కట్టవచ్చు
గల్ను-గలను
గాల్లు-గాలులు
గోలెట్టితే-గోలపెడితే
చావాలసిందే-చావవలసిందే
చూట్టానికి-చూడడానికి
చూపాల్సొచ్చింది-చూపవలసివచ్చింది
చూళ్లేదు-చూడలేదు
చేయూపి-చెయ్యివూపి
చేయేసి-చెయ్యివేసి
డాక్టర్తో-డాక్టరుతో
కంటైనట్లుగా-తినదైనట్లుగా

## వ్యావహారిక రచనకు కొన్ని నియమాలు

తలూపి-తలవూపి
తాప్తా-తాపితా
తిన్తూవుంటే-తినుతూవుంటే
తిర్గి-తిరిగి
తూల్తూ-తూలుతూ
తెలివొచ్చేసరికి-తెలివి వచ్చేసరికి
తెల్లారలేదు-తెల్లవారలేదు
తేల్తూ-తేలుతూ
తోట్లోని-తోటలోని
దాని క్కారణం-దానికి కారణం
దృక్కుల్తో-దృక్కులతో
దెబ్బలాడ్టం-దెబ్బలాడటం
నమ్మిట్లు-నమ్మేటట్లు
నల్లబడ్డంకూడాను-నల్లబడడంకూడాను
నిద్దరట్టడం-నిద్దరపట్టడం
నుంచున్న-నిలుచున్న
నేన్నవ్వాను-నేను నవ్వాను
పట్టమ్మనే-పట్టుకురమ్మనే
పట్నం-పట్టణం
పడ్తూంది-పడుతూంది
పెట్టూ-పెడుతూ
బన్తూంది-బడుతూంది
బరెగ్గొట్టడానికి-బరి ఎగగొట్టడాని
బీత్తనం-బీదతనం
మాట్లాడాల్సొస్తే-మాట్లాడవలసివస్తే
మేం-మేము
మొదణ్ణుంచీ- మొదటినుంచీ
రూపాల్తో-రూపాలతో
రాల్తే-రాలితే
వలేసి-వలవేసి
వింతగున్నదేదీలేందేటచే-వింతగావున్న దేదీ లేక పోడంచేత
విభూ తెట్టుకొని-విభూతి పెట్టుకొని
వెడ్తారా-వెడతారా
వెడ్దాం-వెడదాం

సాహేబుల్కి—సాహేబులికి
స్నేహితుల్తోటి-స్నేహితులతోటి

కొన్నికొన్ని శబ్దాలకు కుదింపులు వుండితీరాలి, విడబరచి రాయకూడదు. ఉదా:—సణుకుకుంటు న్నాడు, అతుకుకుంటుంది మొదలైన ప్రయోగాలు కనబడుతున్నాయి. ఇవి తప్పని వేరే చెప్పనక్కర్లేదు. కాని ఇటువంటివి ఎక్కడెక్కడోగాని కనబడడం లేదు. ఆమాటలు సణుక్కుంటున్నాడు, అతుక్కుంటుంది అని వుండాలి.

ఈక్రింద చూపబడ్డలాంటి కుదింపులు తరచు ప్రయోగించకూడదు. వదిలేసిన, మొదలెట్టింది, యంత్రాగారాల్లో, పనుల్లో మొదలయినవి. ఇవి విడబరచిరాస్తే సొంపు చెడిపోతుంది అన్నచోట్ల మాత్రమే అలాగ కుదించి రాయాలి.

ఆగమాలు—ఇ, ఈ లతో ప్రారంభించే మాటలు వాక్యంమధ్య ఎప్పుడుకూడా యి, యీలగా మారతాయని అనుకోవద్దు. ఆసందర్భాన్నిబట్టి రాస్తూవుండాలి. ఒకప్పుడు అచ్చుగావుంచితేనే రసవంతంగా వుంటుంది. మరొకప్పుడు ఆగమంవస్తే బాగుంటుంది. ఈరెండిటికీ ఉదాహరణలు ఇస్తాను: మాయిల్లు అయిందా ఇప్పుడు. అదేమోస్తరుగా ఉ, ఊ, ఒ, ఓ లతో మొదలెట్టేమాటలు వాక్యంమధ్య అప్పుడప్పుడు వు, వూ, వొ, వోలుగా మారతాయి. అలాగే ఎ, ఏలతో మొదలెట్టే మాటలు వాక్యంమధ్య అప్పుడప్పుడు యె, యేలవుతాయి. ఆయా సందర్భాలయొక్క శ్రావ్యతనుబట్టి అచ్చులు, హల్లులు వాడాలి.

విసంధి, సంధి - వాక్యంలో అన్నిచోట్లా సంధి చెయ్యకూడదు. అలాగచేస్తే బొత్తిగా అసహజంగా వుంటుంది. కొందరు ఇతరభాషలలోని నామవాచకాలకుకూడా సంధిచేస్తున్నారు. ఉదా:—అత డఫ్జుల్ ఖాన్, అత డాస్వాల్డు మొ. ఈమోస్తరుగా సంధులు చేస్తే భావం స్పష్టంగా తెలియదు. పైగా చెవికి వికృతంగా కనపడుతుంది. కొన్నికొన్నిచోట్ల యెంత విడబరచిరాస్తే అంతచక్కగా వుంటుంది. అన్నిచోట్లా

...య్యకూడదో అలాగే అన్నిచోట్లా విసంధి సంధి ఎలాగు కూడదు. అదీ అసహజంగానే వుంటుంది. ...కూడా చెయ్యక... అచ్చులే అయితే ఉచ్చరించడం వాక్యంమధ్య అనేకా సందర్భాలనుబట్టి సంధి, విసంధి కష్టం. కాబట్టి ఆ...లి.
ప్రయోగిస్తూ వుండ...

...రాలు, రూపాంతరాలు

౧. శబ్దాంత...పేరు, రూపాంతరాలు వేరు ఒంటె ... శబ్దాంతరాలు ...ం లొట్టిపిట్ట. ఈరెండు మాటఅన్న పదానికి శబ్దాంతర... వున్నాయి. ఒంటె అన్న...లకు తిరిగి రూపాంతరాలు ...ట్ట అనే మాటకు లొట్టిమాటకు ఒంటియ అనీ, లొట్టిపి...గే అనేక మాటలకు. ...ఒ, లొట్టె, లొటిపిట్ట అనీ. ఇల... చెవు...పిల్లి. కుందేఉదా:—౧. కుందేలుకు శబ్దాంతర...న్న పోతుకు శబ్దాంలుకు రూపాంతరం కుందెలు. ౨. దు...తుకు రూపాంతరాలు కారుపోతు, ఎనుపోతు. దున్నపో...ం కాగ్పోతు. తరం దున్న. కారుపోతుకు రూపాంతర... రూపాంత ౩. కోకిలకు శబ్దాంతరం కోయిల. కోకిలకు...న్న, అప్ప, రం కోకిలము. ౪. తండ్రికి శబ్దాంతరాలు న... అబ్బ.

...టుంటే,

శబ్దాంతరాలు ఏర్పడడానికి కారణమేమిటంటే ఒకేవస్తువుకు ఒక్కొక్కప్పుడు ఒకొక్క...మం. దున్న ఒకొక్క పేరు వుంటుంది. ఒకప్రాంతంలో ...పోతు పోతు అంటారు, మరోప్రాంతంలో ఎ...రొక అంటారు. ఒక...ల్లాలో నుయ్యి అంటారు, ...ంటే ...జిల్లాలో బావి అంటారు. ఒకప్రాంతంలో కానీ ...త్త యింకొన్నిప్రాంతాల్లో కాలణా, చిన్నడబ్బు, బ్బ, డబ్బు అంటారు. చొక్కా అన్నమాటకు జు...యా లాల్చీ, కుడితినీ మొదలైనవి ఇలాగ ఏర్పడ్డవే. ...ల్చి ప్రాంతాల్లో వాడుకలోవున్న మాటలే ఇప్పుడు ...స్తకా వున్నాయి. వాడుకలోంచి పోయిన మాటలు ...పుడు లలో నిల్చివున్నాయి. ఆయాప్రాంతాలలో ఇ...ఉద వాడుకలోవున్న కొన్నిశబ్దాంతరాలు యిక్కడ ...హరిస్తాను.

| (గోదావరిజిల్లాలు) | (గుంటూరుజిల్లా |
| --- | --- |
| నుయ్యి | బావి |
| పప్పు | బేడలు |

| | |
|---|---|
| ఏబులం | సవాశేరు |
| (గోదావరి జిల్లాలు) | (విశాఖపట్టణంజిల్లా) |
| దూట | దవ్వ |
| దూడ | పెయ్యి |
| గుండుసూది | అల్పి |
| హెచ్చు | లావు |
| లావు | వలం |
| వాకబ్ | భోగట్టా |
| చాలా | ఇనోన్నటి |
| జ్వరం | ఉష్ణం |
| పిల్ల | గుంట |

ఇంక రూపాంతరాల విషయం చూద్దాం. రూపాంతరాలు కొన్నిమాటల ప్రకృతి. కొన్ని రకాల మాటలు యెల్లకాలం ఒక్కలాగే వుంటాయి. ఉదా:— కాకి, మేక, చెంబు, పడవ. కాని మరికొన్ని మాటలు మనుష్యులనోళ్లలో అనేక మోస్తర్లుగా మారతాయి. రూపాంతరాలు ఏర్పడతాయి. ఉదా:—౧. గోరిక, గోరింక, గోరక, గోరువంక, గోర్వంక, గోర. ౨. తీగె తీగ, తీగియ. ౩. తీవ, తీవె, తీవియ. ౪. ఉయ్యేల, ఊయేల, ఉయేల, ఉయాల, ఊయల, ఊయాల, ఉయ్యాల, ఉయొల, ఉయ్యాల, ఉయ్యల. ఇప్పుడు ఆయాప్రాంతాలలో వాడుకలో వున్న రూపాంతరాలు కొన్ని ఉదహరిస్తాను.

| | |
|---|---|
| (గోదావరిజిల్లాలు) | (గుంటూరుజిల్లా) |
| కళ్లు, పళ్లు, వాళ్లు, మొ. | కండ్లు, పండ్లు, వాండ్లు, మొ. |
| పడుకో | పండుకో |
| ఉండాలి | ఉండాలె |
| చెయ్యాలి | చెయ్యాలె |
| మొహం | మొఖం |
| ఇచ్చాయి | ఇచ్చినై, ఇచ్చినాయి |
| విన్నాకా | విన్నాకనా |
| అలా | అట్లా |
| అనుకునేటట్టు | అనుకునేట్టు |
| ఉంది | ఉన్నది, ఉంది |
| వండుకుతినాలి | వండుకుతినాలె |
| ఎదురుగా | ఎదురుగ్గా |
| అలకగానె, చెయ్యగానె, మొ. | అలకంగానె, చెయ్యంగానె, మొ. |

| | |
|---|---|
| (గోదావరిజిల్లాలు) | (విశాఖపట్టణంజిల్లా) |
| తాటాకు | తాటికమ్మ |
| పులుపు | పుల్ల |
| పడుకో | పడుకో్క |
| ఉంది | ఉన్నాది, ఉంది |

ఈకాలపు పత్రికలలోనూ, పుస్తకాలలోనూ కనపడుతూన్న రూపాంతరాలు, శబ్దాంతరాలు * (శేర్వేరు చెయ్యకుండా) కొన్ని ఇక్కడ ఉదహరిస్తాను.

---

* ఇంతవరకూ గ్రాంథికపు తెలుగులో వున్న రూపాంతరాలు గల మాటలసంఖ్య (దీనిలోనే శబ్దాంతరాలు కూడా చేరతాయి), వాటివాటి రూపాంతరాలసంఖ్య యిక్కడ తెలియచేస్తాను.

చింతా సుందరరామశాస్త్రి అనేఆయన 'సంస్కృతాంధ్రశబ్ద రూపరహస్యము' అనే పుస్తకం ౧౮౭౭ లో మచిలీపట్టణంలో అచ్చువేయించాడు. ఈయన కాలంనాటికే అప్పిడే గ్రాంథికం పాతుకు పోయింది. కనుక ఈపుస్తకంలో కేవలం గ్రాంథికరూపాలే యియ్యబడ్డాయి. ఈగ్రంథంలో రూపాంతరాలుగల శబ్దాలజాబితా అకారాదిగా యివ్వబడింది. రూపాంతరాలు గల శబ్దాలు సంస్కృతంలోనూ, తెలుగులోనూ కలిసి ౩౬౩౦వున్నాయి. వీటిలో తెలుగుశబ్దాలు ౧౩౭౮. నేను లెక్కపెట్టినప్రకారం యిక్కడ తబసీళ్లు తెలియచేస్తాను రెండురూపాలుగల శబ్దాలు ౧౦౫౮, మూడురూపాలుగల శబ్దాలు ౨౦౪, నాలుగు ౬౬, అయిదు ౧౯, ఆరు ౧౧, ఏడు ౫, ఎనిమిది౨, పది౩, పదకొండురూపాలుగల శబ్దం 'ఎవరు' పధ్నాలుగురూపాలు గల శబ్దం 'మారకత్తి', పదహారు గలది 'ఒకడు', ఇరవైరెండు కలది 'ఎవర్తె', ముప్పయి కలది 'ఒకరు', యాభైరెండు కలది 'ఒకర్తె', సంస్కృతంలో పదహేనురూపాలకు మించి వున్న శబ్దం ఒక్కటైనా లేదు.
వే. కా.

అయినా, ఏనా, అన్నా
అలాగ, అలా, అల్లా, అల్లాగ, ఆలాగ (ఆలాగ తప్పు)
అవసరం, అవుసరం
అవుతుంది, ఔతుంది
అడుగోడం, పుచ్చుకోడం, మొ. అడుగోవడం, పుచ్చుకోవడం, మొ.
అపాళంగా, అపణంగా
ఇంక, ఇక, ఇహ ('ఇహ' తప్పు)
ఇయ్యడం, ఇవ్వడం
ఇవాళ, ఇవ్వాళ
ఇవి, ఇవ్వి (ఇవ్వి తప్పు)
ఉంటాయి, ఉంటవి
చెప్తున్నారుట, చెప్తున్నారట
ఉంశిట, ఉంచట
ఉన్నాయి, ఉన్నై, ఉన్నవి
జరిగాయి, జరిగినై, జరిగినాయి
వచ్చాయి, వచ్చినై, వచ్చినయి
ఎలాగ, ఎల్లాగ, ఎలా
ఒక, ఒహ, ఓ
ఒకడు, వకడు ('వకడు' తప్పు)
కనికిష్టం, కనాకష్టం
కమోసు, కామోసు, కామోలు
కళ్లలో, పూలలో, మొ. కళ్లల్లో, పూలల్లో మొ.
కాదు, కా, గా, ('కా' వాడుక తప్పు)
కూర్చో, కూచో
కోసం, కోసరం
గడప, కడప
గాడిద, గాడిదె
చుట్టూ, చుట్టూర
చూశాను, చూశా
చెబుతున్నాను, చెప్తున్నాను, చెపుతున్నాను

చెయ్యడం, ఇయ్యడం, చూడడం, మొ. చెయ్యటం, ఇయ్యటం, చూడటం (కాని ఈ 'టం'లు తప్పు)
చేసుకుంటే, అనుకుంటే, మానుకుంటే, మొ. చేసుకొంటే, అనుకొంటే, మానుకొంటే మొ.
జరుగుతూంది, ఇస్తూంది, పోతూంది, మొ. జరుగుతోంది, ఇస్తోంది, పోతోంది మొ.
తెలియాలి, తెలవాలి (తెలవాలి తప్పు)
దగ్గిర, దెగ్గిర, దగ్గిర, దగ్గరశ.
దానితో, దాంతో, ('దాంతో' తప్పు)
దిగులు, దిగాలు
నములు, నమలు
నవ్వతాలకు, నవ్వటాలకు
నుంచి, నించి ('నించి' వాడుక తప్పు)
పెందరాడే, పెందరాళే
పోయాను, పొయ్యాను
ముందు, ముందస్తే, ముందర్తే
మట్టుకు, మటుకు
మడచడం, మణచడం
మర్యాదగా, మర్యాదాగా
మల్లె, అల్లె ('లాగ' అన అర్థం)
మునగడం, మణగడం
ముసలమ్మ, ముసలమ్మ, ముసిలెమ్మ
మొహం, మొఖం
లాగ, లా
లావుపాటి, లావాంటి
లేను, లా
వంక, వేపు, కేసి
వచ్చాడు, ఒచ్చాడు (ఒచ్చాకు సంధిలో వస్తుంది. ఇదైనా తప్పు)
వెనకాల, వెనకాల
వెళతాడు, వెళ్తాడు, వెడతాడు

సశేషం

# మౌనముద్రాలంకారః

## (కోన్ హై)

పచ్చనివాడు......పద్మనయనంబుల వాడు.....
కృపారసంబు పై జల్లెడువాడు ... ... నవ్వు రాజిల్లెడు మోమువాడు......

అంతవరకుమాత్రమే - పూర్వపు మధురాపురీ మాంత్రికునితో బాహ్య-పోలిక గల్గిన వ్యక్తి యిప్పుడు మనలో వున్నాడా?. వుంటే, ఎవరా అంటారా?...

అరుణోదయ కాంతులు ప్రసరించేవేళనో, గోధూళిధూసరిత - చీకట్లు అలముకొనేవేళనో, మీరు బృందావన (బందరు) పురవీధుల్లో చూస్తే, ఆ మంగళమూర్తి గోచరిస్తాడు...కాని, ఏ తాలింఖానా సరుకో, ఏ పంజాబీ వస్త్రాదో అని మీరు పొరబడకుండావుండి, ఆ ఉజ్జ్వలరూపాన్ని చూడ్కితీవల్లో చిక్కబట్టిస్తే, ఆయన ఎవరో, ఆయనలో విశేషమేమిటో, తర్వాత మీకే తెలుస్తుంది.......

జ్ఞానభారంచేత కాబోలు, వొరిగినతలను నిటారుగా పెట్టకుండానే, క్రిందికిదించిన చూపును ఎత్తకుండానే, ఇంటిదగ్గరనుంచి బయలుదేరి, ఆఫీసుకు జేరుకునే ఆవింత వైఖరివ్యక్తే...శ్రీ శ్రీ... ముట్నూరివంశ పయఃపారావార రాకాసుధాకర... సన్మణీ...కృష్ణరాయాగ్రణీ!......




ముట్నూరి కృష్ణారావు

క్షమించాలి,యీ వందిమాగధ-వల్లింపుకు...ఇక రానీను అసావాదితో్య శిష్టగ్రాంథిక దూకుడును.

కృష్ణాపత్రికను చదివే అంతమంది, కృష్ణరావుగార్ని చూచివుండరు...అవును మరి? ఆమానవు డెప్పుడైనా ఊరువదిలి, ఏసభలలో పాల్గొనడానికైనా, ఏ ప్రారంభోత్సవం జరిపించడానికేనా, ఏసభాధ్యక్షత వహించడానికేనా ఏఉపన్యాసాలు యివ్వడానికైనా, వేటికైనా వెడితేగా?...ఉన్నవూళ్లోమాత్రం? ఇల్లు కదిలి ఆఫీసుదాటి, పబ్లికులో ఎక్కడైనా కన్పడితేనా? నోరువిప్పితేనా? ...అదేమిటోమరి!...

మాట్లాడడమంటే పట్టాభిగారికి ఎంతమమకారమో; సిగరెట్ అంటే చిర్రావూరి చింతామణిగారికి ఎంత సరదావో; పరపతిసంఘాలంటే రామదాసుగారికి ఎంతప్రీతో; రైతుసమస్యలంటే రంగాగారికి ఎంత రెపరెపో; అడ్వరుటైజుమెంటంటే అమృతాంజనానికి ఎంతఆపేక్షో; ...మౌనమంటే కృష్ణారావుగారికి అంత మక్కువ!

ఎంచేతా?...బహిరంగోపన్యాసాలంటే భయమా?...లేక, యిస్తే వాటిని గ్రాహ్యంచేసుకునే సద

స్యులు లేరనా?...ఏమో?...ఏదెల్లావున్నా, అది ఆయనగారికి అలవాటైపోయింది. మౌనముద్రఅలంకారం... వక్షస్థలే కౌస్తుభం!

ఒకసారి...గాంధీగారు గవర్నమెంటుమీద లవణాస్త్రం ప్రయోగించినరోజుల్లో...ప్రతివాదభయంకర పట్టాభిగారు భీమాడిండిమ చెలుకువాడగారు పల్లెలప్రచారం మొదలెట్టి, కృష్ణారావుగారినిగూడా ఉత్సవవిగ్రహంగా వెంట తీసుకువెళ్లేవారు కారులో...

ఒకవూళ్లో, కృష్ణారావుగారు సభాధిపత్యం వహించక తప్పిందికాదు...పీఠం అలంకరించి, ఉపన్యాసకుల నందరినీ ఒకరొకర్నే చేతి సైగలతోనూ, కనుచూపులతోను పిలిచి, మాట్లాడించి......తర్వాత, ప్రారంభోపన్యాసంగాని, అంత్యోపన్యాసంగాని, మరే ఉచ్చారణా లేకుండానే సభ 'జయప్రదం' గా గాముగించారు...

“కృష్ణారావు పంతులుగారు మూగవారేమిటి చెప్మా?” అని ఆ అమాయకపు గ్రామస్థులు దిగులు పడ్డారుట!......అందులో వాళ్ల తప్పేముందీ పాపం?

ఒంటరితనమంటే కృష్ణారావుగారికి పిచ్చి అభిమానం. వెన్నెలవికాసాన్ని...చీకటిపరుసల్ని గమనిస్తూనో ఆయనవుంటే, సిరికి చెప్పడమూ లేదు, ఏపరివారాన్నీ జేరడమూ లేదు...

“ఎప్పుడూ ఏకాంతంగా వుంటే ఏంతోస్తుందండీ మీకు?” అని నే నొకసారి కొంటెగా అడిగితే

“ఏకాంతంగా లేకపోతే, నోళ్లంతా జెర్రులు ప్రాకినట్టుంటుంది” అని మరింతకొంటెగా జవాబు వచ్చింది......

ఇంట్లోనైతేనేం, ఆఫీసులోనైతేనేం, మరెక్కడనైనా అయితేనేం...ఆయన మితభాషి. క్రొత్తవాళ్లయెదుట, ఆడవాళ్లయెదుట, అసలే జమ్ముకుపోతారు...ముప్పయి వాల్యూములలో నిశ్శబ్దతారహస్యాన్ని బోధించి కార్లైలుఋషి లక్ష్యమో? లేక ముప్పయియేళ్లుగా లోకకౌతుకాన్ని గిలిగింత పెస్తూ పుదుచ్చేరిలో మౌనవ్రతం వహించిన అరవిందయోగి గురువో?...

కావలసినచుట్టాలూ, అక్కర్లేనిబాదరాయణ సంబంధీకులు చాలామందివున్నారు కృష్ణారావుగారికి...

అయినా...ఆయనకు ఎవ్వరితోనూ జోక్యంలేదు. “దూరాత్ సంకుచితే వగచ్ఛతి...”...ఆయన యజ్ఞోపవీతాన్ని విసర్జించి “నాయుడుగారి బ్రహ్మసమాజం” లో చేరాడనీ, కొమార్తెలకు రజస్వలానంతరవివాహం చేశాడనీ, మడిమైలలు అట్టేల పాటింపడనీ కోపంతో, కినుకతో వాళ్లందరూ ఆయన్ను వెలివేసినప్పుడు, ఆయన లోలోపల నవ్వుకొన్నారుగాని, పైకి ఏమన్నా అన్నారా?...

“కృష్ణారావుగారితో మాకు బాగా పరిచయం వున్నది... ఆయన ఆంతర్యం తెలిసికోగల్గాం...ఇదిగో ఆయనతత్వం యిదీ” అని నిక్కచ్చిగా చెప్పగల్గినవాళ్ల సంఖ్య లెక్కపెస్తే అయిదువేళ్లలోనూ కొన్ని మిగిలిపోతాయి!

కాని...ఆయనపరిచయభాగ్యంకల్గి, ఆయన వాగమృతధారల్ని గ్రోలి ఆనందించినవారు పలువురు...

నలుగురైదుగురుకన్న ఎక్కువ లేకుండా చుట్టూ జేరి ఆయన్ను పురికొల్పితే యిక ప్రారంభమౌతుంది జలపా! కళాశాలఆవరణంలోని వృక్షచ్ఛాయల విశ్రమించి అయితేనేం, బొంబాయికాలువవొడ్డున సైకతస్థలాల కూర్చుని అయితేనేం, ఆఫీసులో కుర్చీ వెనక్కు తన్ని పెట్టి గీవిగా హస్తవిన్యాసం చేస్తూనైతేనేం, ఇంట్లో పడకకుర్చీలో నడుంవాల్చి మాలతీమలయమారుతాన్ని ఆఘ్రాణిస్తూనైతేనేం 'మూడ్' వచ్చినప్పుడు ఆయన ఆవేశంతో విశదీకరించే విషయాలకు అంతులేదు.

ఆధునికాంధ్రసారస్వతం...పూర్వపు సంస్కృతకావ్యాలు...చిత్రకళ...గీతారహస్యం ... ఉపనిషత్సారం...గాంధీగారి రాజకీయాలు ... ఘోషుగారి వ్రాతలు...టాగూరుగారి రచనలు...నాటకాలధోరణి...సినీమాసంగతులు ... నాట్యవిన్యాసాలు ... అలం

శంకించకుండా కృష్ణారావుగారికి "ఫాలకేటన్యస్తకరాబ్జుడై సరసలీలన్ మ్రొక్కి" ప్రక్కకుర్చీలో ఆసీనుడైనాడు...

సాధారణంగా సంభాషణభారం వచ్చినవాళ్ళకే వదిలివేసే కృష్ణారావుగారు అతిథిని అవలోకించి "ఏం యిలావచ్చారు" అని ఆ వృద్ధసుందరుని కళ్ళతో ప్రశ్నించారు...

ఆ పెద్దమనిషి ఆగకుండా అన్నాడు: "ఇవ్వాళ నా పుట్టినదినం. తెల్లవారి లేచి ఘనతమమైన కార్యాన్ని చేయాలని సంకల్పంకల్గింది. మీదర్శనంచేసి, మీకు నా హృదయాంజలి అర్పించవచ్చాను. మీరంటే నాకెంతో గాఢగౌరవం...మీ తెలివితేటలనీ, బుద్ధికుశలతను, మౌనముద్రను, అన్నిటికన్నా మీ చక్కని డ్రెస్సునుగురించి తల్చుకొని ఎన్నిమార్లో నాలోనేను ఉబ్బిపోతూంటాను. గుప్తంగావున్న నాహృదయరహస్యాన్ని యీనాడు మీకుచెప్పి నాభారం తగ్గించుకున్నాను... డిస్టర్బుచేసినందుకు క్షమించాలి" అని చకచక వెళ్లిపోయినాడు.

ఆనందంకన్న ఎక్కువగాకల్గిన ఆశ్చర్యాన్ని అణుచుకుని కృష్ణారావుగారు మధ్యవిడిచిన వ్యాసాన్ని పూర్తిచేశారు...

కృష్ణారావుగారు "చేలములూడగ గౌగలించు గోపాలక ధూర్తశేఖరుడు" కాదు...అంటే అపార్థం చేయవద్దు...ఆయన ప్రాక్టికలుమనిషి కాదని తాత్పర్యం. ఎందులోనూ ముందంజవేసి, పరిస్థితులతో పట్టుపట్టామని కాంక్షించే 'లోకతరబడి' వ్యక్తికాదు... బిజినెస్అంటే నైజవిరుద్ధం—అయినట్టే అయితే:—

పాతికేళ్ళక్రిందట ఆయన ప్రారంభించిన సోప్ ఫ్యాక్టరీ పురిటిలో ఎన్నెమ్మకొట్టిపోకుండావుంటే, వృద్ధియై యీపాటికి ఆయన్ను లక్షాధికారిగా జేసేవుండేది......

కృష్ణాపత్రిక టైమ్సుఆఫ్ ఇండియా ఇలస్ట్రేటెడ్ వీక్లీగా పరిణమించి ప్రఖ్యాతిపొందేది...

ఇంకా ఎన్నెన్నో చేసేవారు ఆయన...కాని... ప్రకటనఅంటే అపరిమితవెరపు...అది ఆయనకేకాదు, మనఆంధ్రపెద్దలకు చాలామందికి వుంది...

లేకపోతే:—

పట్టాభిగారు రాజేంద్రప్రసాదుగారంత పేరు పొంది, కాంగ్రెసుపీఠాన్ని అలంకరించేవారు యీపాటికి.

కోపల్లె హనుమంతరావుగారు మాలవ్యా అంత మహనీయుడై ఆంధ్రజాతీయకళాశాలను కాశీహిందూ విశ్వవిద్యాలయమంతదానినిగా...

రామలింగారెడ్డిగారు బులాభాయిదేశాయిగారి స్థానే భారతశాసనసభలో బుస్సులుకొట్టవలసింది.

దేశభక్త కొండా...పంతులుగారు వల్లభాయి పటేలుగారంత ప్రాముఖ్యత సంపాదించవలసింది.

కీ. శే. అహోబలరావుగారు డాక్టరు అన్సారీగారంత లోకవిదితులు కావలసింది...

కృష్ణారావుగారు బ్రజేంద్రనాథశీల్, భగవాన్‌దాసు బాబుగార్లల్లె సాహితీ, సభి ఆరతులను అందుకోవలసింది...

అందుకోవలసింద...కాని !!

ఇప్పుడేమనుకుంటే ఏంలాభం ?

కృష్ణారావుగారిలో మరొకచిత్రం. తక్కినవారు కొంత అడ్వరుటైజుమెంటుకేనా ఒప్పుకుంటారు. ఆయనకు అటువంటిది ఎంతమాత్రం యిష్టంలేదు.

తార్కాణానికి చెప్తాను:

ఆయన కావాలని కూర్చునితీయించుకున్న ఫోటో ఏమీలేదు. ఎవ్వరు బలవంతంచేసినా ఒప్పుకుని తీయించుకున్నదీ లేదు ..

అయినప్పటికీ ఆయన సత్యాగ్రహిగా జెయిలులకు వెళ్లినప్పుడు ఆయనఫోటో "ఆంధ్రపత్రిక" లో

అచ్చుపడ్డది...ఆఫోటో ఎక్కడిదో, ఎల్లాతయారైందో ఎవ్వరికీ తెలియదు, ఆపని చేసినవాళ్ల కుతప్ప...

జైలునుంచి వచ్చినతర్వాత—"ఆ పాడుపని" చేసినవాళ్లను కృష్ణారావుగారు రూక్షణవీక్షులతోణా ఎట్లా మందలించారో నాకు జ్ఞాపకమున్నది...

తర్వాత ఓమారు ఆయన మెద్రాసువెళ్లినప్పుడు, ఎవరో పత్రికావిలేఖరి స్టేషనులో కలుసుకొని— "తమపేరు 'రాకపోకల' లిస్టులో వేస్తాను. ఏపనిమీద విచ్చేశారో, బసఎక్కడో..." అని ప్రార్థించగా... "నేనంత ఘనుణ్ణికాదు" అనికృష్ణారావుగారు నవ్వుతూ, ప్లాటుఫారంమీద వేచివున్న కారులోఎక్కి నిష్క్రమించారు.

ఓమారు నేనన్నాను— "మీమీద ఎవరో వ్యాసం తయారుచేస్తున్నారుట..." అని.

"మధ్య, నామీదెందుకూ వ్రాయడం?...మరేం విషయాలు దొరకన్నా?" అన్నారు వికటంగా...

తర్వాత మరోమారు:

దొడ్లో తోటలో పచార్లుచేస్తున్నాం...ఎండిపోయిన చెట్టు కన్పించిందిఒకచోట. దాన్ని వ్రేలుతో చూపిస్తూ:—"చూశావా నామోస్తరుదే!" అన్నారు ఆయన...

"ఆప్రక్కన చూశారా?" అని పూచిన మల్లెతీగె వైపు చూపాను. కన్నుగిలురించి వూరొకన్నారు...

"ఎవర్సిశక్తిసామర్థ్యాలు వాళ్లు యథార్థంగా తెలుసుకోగల్గితే యింకేం?...తనలో ఎంతసౌరభమున్నదో గులాబికి తెల్సునా?...తాను ఎంతఎత్తో గోపురానికి తెలుసా?"అన్నాను.

వినీ వినిపించుకోనట్టు నటించారుఆయనగారు...

"కృష్ణాపత్రిక" నడిపేది కృష్ణారావుగారని చాలామందికి తెలియకపోవడంలో వింతలేదు. అధునాతనపత్రికల్లో మోస్తరు ప్రస్ఫుటముగా ప్రథమపుటలోగాకుండా, పత్రికచివర ఏదోమూలన వున్న ఆయన పేరును ఎవరు గమనిస్తారు?

అయితేమాత్రం, ఆయనకేం? తాను కృష్ణాపత్రికా సంపాదకుడ ననేది లోకవార్త కావాలని ఆయనకు లేశమైనావుంటేగా?...

అసలు, కృష్ణాపత్రికాధిపత్యం కృష్ణారావుగారికెల్లా లభించిందో అదీ తమాషాయే......

సి. వై. చింతామణిగారిమోస్తరు కృష్ణారావుగారికి యూనివర్సిటీడిగ్రీ ఏమీలేదు......ప్రపంచం-పెద్దవాళ్లనుకొనేవాళ్లలో చాలామందికి లేదు...దానికేం...

కృష్ణారావుగారు మెద్రాసులో ఎఫ్. ఏ చదువుతున్నరోజులవి ... వంగనాయకుడు బిపిన చంద్రపాల్‌గారు పట్నం విచ్చేశారు - బ్రహ్మసమాజంతరఫున ఉపన్యాసాలివ్వడానికి...కృష్ణారావుగారికి ఆయనమీద గురికుదిరి, శిష్యులైపోయినారు...

అటుపై ఆవంగవీరునితో బెంగాలు వెళ్లారు. దాదాపు వత్సరం - అజ్ఞాతవాసమైనతర్వాత-గృహోన్ముఖులైనారు ... కలకత్తాలో బిపినపాలుగారితో కృష్ణారావుగారు పడ్డ తికమకల కేంగానీండి, ఆయాత్రతో, అనుభవంతో కృష్ణారావుగారి జీవి దృక్పథంలో తీవ్రమైన మార్పుకల్గింది.

మల్లిక్‌గారి విశాలభవనంలో అరవిందఘోషు, రవీంద్రకవి, బిపినపాలు మొదలైన ఉద్దండులు సమికూడి జాతీయజీవన సౌధానికి పునాదులు వేసేవారు. మూగనోమువ్రతులై కృష్ణారావుగారు ఆమీటింగులన్నింటికీ హాజరై, సంగతులను గ్రహించి, నూతనావేశభరితులయ్యేవారు...

బెంగాలుపర్యటనం పూర్తియై బందరు జేరుకున్నారు కృష్ణారావుగారు. చదువుకు స్వస్తి...ప్రత్యేకించి చేసేపనిలేదు...క్లబ్బుకుమాత్రం హాజరుతప్పేది కాదు.

ఆరోజుల్లో శ్రీయుతులు కొండా వెంకటప్పయ్యపంతులుగారు శెడింబి హనుమంతరావుపంతులుగారు యిత్యాదులు "కృష్ణాజిల్లాసంఘం" తరఫున అయిదారుపేజీల అల్పపుకృష్ణాపత్రికను ప్రకటిస్తూండేవారు...

కారశాస్త్రమథనం. ఒకటేమిటి, మీ కేది కావలిస్తే అది, ప్రపంచంలో ఎన్ని విషయాలున్నాయో అన్నీ, కూలంకషంగా కలయబెట్టబడతాయి. అప్పుడు కేవలం...భృంగరాజీలలితన్వనే......

"ప్రస్తవికురస్తోమంబు ఫాలంబుపై ముర వున్ నూప" "అతులజ్ఞానకళోదకములై విలసిల్లెడు కన్నులదోయితో" ఆయన ముచ్చటించడం మానాలి. ఎక్కడనుంచి వెలివడుతుందో, ఆ పరికిలనాపటిమ, ఆ చర్చాసంరంభం, ఆ ఉత్సాహభర ఉద్వేగం!

ఓ ఏడాదిపాటు పరిశ్రమ చేసి గ్రంథాలు చదివి నేర్చుకున్న దానికన్న ఎక్కువగ ఓగంట కృష్ణారావుగారి బోధలు విని జ్ఞానసముపార్జన చేసే శిష్యబృందాలు, "అనవరతానుచింతన సుధారసపీచుల నోలలాడుచు" నోపికల ఉబలాటంతో "యింకా, యింకా" అని వారిని రెట్టించడం నాకు తెలుసుకదా.

కృష్ణారావుగారు, "చలాకీమనిషే." అనుపడేటంత బిరుదుకాదు. ఏవిషయాన్ని గూర్చి ఐనాధారాళంగా ధోరణి సాగించగల మేధావి. ప్రాత విషయాలనైనా క్రొత్తకోణంనుంచి చూపింప శక్తిగల ధీశాలి: అని దేశానికి ఎక్కువగా తెలిసింది. ఆయన జైలులోవున్నప్పుడు......

ఎందుచేతనూ సౌక్యం కల్గించుకోని మానిసి చల్లగా సత్యాగ్రహసమరంలో రెండుదఫాలు రాజుగారి ఆతిథ్యాన్ని అందుకొన్నారు...

యువకు లందరూ కృష్ణారావుగారి చుట్టూ జేరి ఆయనకు "కీ" యిచ్చి వింటూండేవారుట. వాళ్ళందరికీ అదొక క్రొత్త అపూర్వానుభవం. ఎవళ్ళకు కావలసింది వాళ్లు అడిగి తెలిసికొనేవారుట, కావలా లేనిగనిలోనుంచి బంగారాన్ని లాక్కొన్నట్టు!

విముక్తులై వచ్చిన తర్వాత కొంతకాలంవరకూ ఆయన అమితోత్సాహంతో ఎప్పుడూ జైలుకబుర్లే చెప్పేవారు. అక్కడచేసిన నలభీమపాకాలు, సల్పిన గోష్ఠిసభలు, తత్వానందస్వామిగారిమీద ప్రయోగించిన ట్రిక్కులు, ఆంధ్రులకు అరవలకు జరిగిన సంవాదాలు' లక్షవింతలూ, విడ్డూరాలూను. వినడానికి మాకు విసుగువచ్చేదికాదు...

కృష్ణారావుగారు సరసులు...'రసానందో బ్రహ్మ', మంత్రరహస్యార్థవిబోధితులు. రుచి, పస తెలిసిన రసికులు. సంస్కృతంలో, తెనుగులో, ఇంగ్లీషులో ఉత్తమకావ్యాలను సవిమర్శంగా సమీక్షజేసి చక్కగా వొంటపట్టించుకున్న సాధుశీలుడు...వీటికితోడు స్వతః సిద్ధంగావున్న తేజోవికాసం... బుద్ధితీక్ష్ణత...ఆయన తరిచిచూసి తేల్చని నిగ్గులు లేవు. అవి ఆయన వ్రాతల్లో, సంభాషణలలో అనవరతమూ ప్రత్యక్షమౌతూనే వుంటాయి...

రసాస్వాదనకు రెక్కలువిప్పి వెలాగ్చే విహంగమూర్తి కృష్ణారావుగారు. రససిద్ధిని బడయడానికి విసువులేకుండా అంచనాలువేసే రసికమూర్తి......

పిత్రార్జితమైన ఆపాతయింటికే, నాజూకులు, నగిషీలు...మందువాచుట్టూ రంగవల్లులను చెక్కించడమో, హాలులో అక్కడక్కడ ఆగ్రా చలువతాళ్లను తాపించడమో, స్తంభాలకు చెక్కడపు ఆర్చీలను పెట్టించడమో, సింహద్వారంపైన పద్మపీఠియైన లక్ష్మిని కుడ్యాలంకారంగా బిగింపించడమో, ఏదో ఒకటి తోస్తూనేవుంటుంది ఆయనకు...

"ఎందుకండీ యివన్నీను. వృద్ధనారికి అలంకారాలు..." అని అంటే, "అని వూరొక్కంటామా" అన్నారు.

పదునుకత్తులబారుల పరవళ్లుకొట్టే ఆయనరసిక నైజం వూరొక్కదు....

ఆ సందుగొందుల ఆఫీసులోనూ అంతే ... ఆ వున్న జానెడుబెత్తెడు ఆవరణలోనూ, శిలావిగ్రహాలు, పర్ణశాలలు, కాసారాలు, లతాకుంజాలు, జాతిచపటాలు, తోటపసందులు ...... నందనవనాన్ని సృష్టించాలని సంకల్పం.

కృష్ణాపత్రిక తయారులోగూడ రసప్రవాహం గోచరిస్తూంటుంది. ఆబొమ్మలు, అమకుటాలు. గ్రహించే వాళ్లకు తెలుస్తుంది వాటివిలువ.

చివరకు, ఆయన జైలులో వున్నప్పుడుగూడా ఆర్టుకు బలాటాన్ని వదిలిపెట్టలేదు.

అందరిఖైదీల గదులకన్నా ఆయనగది అలంకార అందంగాను, అలంకారభూయిష్ఠంగాను వుండేదిట, లోపల రంగులతివాచీ గద్దె. బయట, గదివాకిలి ముందు ముద్దులుగుల్కే ముగ్గులు, సీమసున్నపు ముక్కలతో...

మరి...చక్కని విషయాలతో ఎకసక్కెము లాడేడి చక్కనయ్యకదూ ఆయన!

ఈరసకాంక్షే కృష్ణారావుగారి దుస్తుల్లోగూడా అవుపిస్తుంది. ఆయన 'అతిమోహనవేషధారి' మొదట్లో కాలర్ కోట్లతోనూ, నెక్ టైలతోనూ క్లిప్పులతోనూ ఆయన మురిసిపోయినా......పంజాబుహత్యలకాలం నాటినుంచీ ఒకేమోస్తరు కద్దరువేషాన్ని ఖాయపర్చారు...మెడదగ్గరనుంచీ మోకాళ్ల క్రిందవరకూ సాష్టాంగపడే తెల్లనిలాల్చీ, సంస్థానాధీశ్వరుల రీని ధిక్కరిస్తూ కోణాలు తేలిన ధవళశిరోవేష్టం అంతే మళ్లీ, కాని అదే ప్రత్యేకత!...

ఆయన తలపాగాయే మరీ చిత్రం. యాస్థనీ ఈడెనుగారి నల్ల ఫెల్టుహాటుకు ఈయనగారి తెల్లతలపాగాకు వాటికి మార్పులేదు. పాగాలేకుండా కృష్ణారావుగారిని బయట ఎప్పుడైనా కదాచిత్ గాగూడ చూడ్డం దుర్లభం. అది లేకుండా ఆయనను గుర్తించడం అసంభవం!......మీకు నమ్మకంలేకపోతే యిదివినండి జరిగినవిషయం...

ఎన్నాళ్ల క్రిందటిదో మాట...మరికొందరితో కలిసి కృష్ణారావుగారు– మహానంది సభలకు అనుకుంటూను వెడుతున్నారు. పెంపుడు కుక్కలకన్న ఎక్కుడు విశ్వాసాన్ని చూపిస్తూ సి. ఐ. డి. లు వెంటవున్నారు. బెజవాడలో రైలుఎక్కారు నాయకులు. ఇంకా అరగంట టైంవుంది రైలుకదిలేందుకు...ఉక్కగా వుండడంచేత కృష్ణారావుగారు తలపాగాతీసి ప్రక్కనపెట్టారు ...అంతవరకు కనుపెప్పమోస్తరు కాస్తూ అప్పుడే యథాలాపాన దృష్టిని మరల్చిన సి. ఐ. డి. ఛప్పున వచ్చి ఆయన్నే "అయ్యా,యిప్పు డిక్కడవున్నారే... యింతలో కృష్ణారావు పంతులుగారు ఎక్కడికెళ్లారు" అని దిగులుగా పృచ్ఛచేశాడు. ఆయన నవ్వు ఆపుకొని "ఇప్పుడేవస్తారు, అటు చూడు" అని వెంటనే తలపాగాను యథాస్థానానికి చేర్చారు. ఆకుంచగోడి పంతులుగారి గారడీని గ్రహించనేలేదు...ఒకవేళ గ్రహించినా పరాభవాన్ని దిగమ్రింగుకొనివుంటాడు...

కృష్ణారావుగారి వేషాన్నిగురించి యింతగా వ్రాయడమెందుకు? అందులో ఏంగొప్పవుంది?లాల్చీలు, తలగుడ్డలు ఎందరో అలంకరించుకుంటున్నారు... అంటారేమో మీరు...

అలాగ శెలవిస్తేకాదు, మరి...

కృష్ణారావుగారి వేషంలో ప్రాముఖ్యత వుండబట్టే యింతగాచెప్పడం...దుస్తుల్లో ప్రత్యేకతను పకడ్బందీగా పట్టుకొస్తున్నవాళ్లు, పట్టుకురాగలిగినవాళ్లు, చాలాకొద్దిమంది...ఉత్తరాన మాలవ్యాపండితుడు, ఆంధ్రరాష్ట్రంలో కృష్ణారావుగారు నాకు కన్పడ్డది...

నాకేగాదు, చాలామందికి అదేఅభిప్రాయం కృష్ణారావుగారి దుస్తుల్నిగురించి...

ఒకాయన ఆఅభిప్రాయాన్ని ఓసందర్భంలో నొక్కివక్కణించాడుకూడాను.

అయిదారేళ్ల క్రిందటి మాట...ఒకాయన లెంచెమో గొప్ప, వైద్యవృత్తిలో పేరుపొందిన డాక్టరు. గాంధీగారు తనకులంవాడేనసే గర్వంచేతనో, లేక శిసలైన దేశాభిమానంచేతనో ఖద్దరుధారి...తెల్లనిధోవతీ గూడకట్టు, థియసాఫికలు వర్టుమాటున తొంగకాడే చిలుబొజ్జ, కొట్టచ్చేమీసాలు:—ఆయన చూడడానికి వింతగావుండేవాడు......

ఆ నడివయస్సు డాక్టరుగారు ఓనాడు కృష్ణాపత్రికాఫీసులోకి ప్రవేశించి......"వ్రతభంగంబంచు"

మెల్లగా అది కృష్ణారావుగారి హస్తగతమైంది.

కాని ఆయనగారికి సాఫీ తెనుగు వ్రాయడం వస్తేగా?...కాని జంకలేదు..."బాలుండీతడు కొండ దొడ్డది మహాభారంబు సైరింపగా జాలండోయని... శంకింపగాబోకుడు" అనే అభయహస్తంతో ఉపక్రమించారు

ఇప్పుడో...

దాదాపు ముప్పైఏళ్లు తరలిపోయినాయి. "కేలల్లాడ" కుండా ఎత్తిపట్టిన "విపులచ్ఛత్రం" కృష్ణాపత్రిక.

ఇప్పుడో...

అనేక తెనుగుపత్రికలకు మార్గదర్శియై...వున్నవాటికి మకుటమై అలరారుతున్నది...

ఇప్పుడో...

కృష్ణాపత్రికే కృష్ణారావుగారు, కృష్ణారావుగారే కృష్ణాపత్రిక...

కృష్ణాపత్రికాభివృద్ధిలో కృష్ణారావుగారికి తోడ్పడింది ఎవ్వరూ లేరు. అంతా ఆయన స్వంతకృషే.

స్వతస్సిద్ధంగా ఆయన మౌనముద్రాలంకారుడైనా కృష్ణారావుగారు కృష్ణాపత్రికద్వారా మాట్లాడక తప్పకుందికాదు. అంచేత అది చాలావరకూ ఆయన ప్రతిబింబమే. కాబట్టి కృష్ణాపత్రిక చేసినసేవ ఆయన చేసిందిగానే భావించడంలో దోషంలేదు...

కృష్ణాపత్రిక చేయని మంచిపనిలేదు. జోక్యం కల్గించుకుని, చేయూతయివ్వని ఉద్యమంలేదు. దేశంలోని అన్నిసమస్యల్లోనూ కొద్దో గొప్పో పాల్గొన్నది. జీవితానికి సంబంధించిన సమస్తవిషయాలనూ తర్కించింది...ముఖ్యంగా ఆంధ్ర సాహిత్యానికి, కళలకు, కాంగ్రెసుసంస్థకు చేసినసేవ నిరుపమానం...

కృష్ణాపత్రిక న్యూస్ పేపరుకాదు, వ్యూస్ పేపరు అన్నారు కృష్ణారావుగారు ఓమారు.

ముమ్మాటికీ నిజం. అంచేత, ఆపత్రికలో సాధారణంగా ముఖ్యభాగం ఎడిటోరియలు మాత్రమే.

ఆ ఎడిటోరియల్సు జర్నలిస్టుకు ధోరణిగా వుండవు. వాటిది వ్యాసరూపం ... నవ్యాంధ్రసారస్వతంలో "వ్యాసం" అనేదానికి వరవడిపెట్టింది కృష్ణారావుగారి ఎడిటోరియలు...

దానిపసందు, ప్రభావం చదివినవారికే తెలుసు. దానికో వింత ప్రత్యేకత...అటు సనాతన గ్రాంథికమూ గాదు, యిటు శిష్టవ్యావహారికమూ కాదు దానిశైలి. ధోరణినిబట్టే అది కృష్ణారావుగారి హస్తలాఘవమని గ్రహింపవచ్చు.

విషయం మామూలుదైనా, మహత్తరమైనదైనా ఏది మహాత్ముని అవతారరహస్యాన్ని గూర్చియైనా, బొబ్బిలిరాజాగారి జిల్లాబోర్డు విభజననుగూర్చియైనా, అందులో ఆవేశం, అదురుడు తప్పవు...

అవి ఆర్టు, ఈస్థటిక్సును గురించిఅయినవా— "ధనియాల పొలాలగట్టులం విహరింతము రమ్మ హోయిగా" అని మనలను ఆహ్వానిస్తాయి.

అవి స్వదేశోద్యమం, దేశారాధననుగురించి అయినవా—"ఆవో ప్యారే, వీరో ఆవో, దేశధర్మపర బలి బలి జావో, ఏకసాథ సబ మిలకర గావో, ప్యారా భారతవర్ష హమారా" అని ఉత్సాహింపజేస్తవి.

అల్లాంటి ఎడిటోరియల్సులో అద్భుతం కృష్ణారావుగారి తూలికోత్కర్షం...ఒకప్పుడు ఆయనభావాలకు కలంశక్తి చాలడంలేదేమో ననిపిస్తుంది. చదువరిని ఉద్రేకంతో శివాలాడిస్తుంది, చిందులు త్రొక్కిస్తుంది.

మీకు నమ్మకంలేదా? పాతఎడిటోరియల్సును కొన్నిటిని చూడండి. పదులు, వందలు, మీరక్తాన్ని పొంగిస్తాయి.. పదులు, వందలు మీభావాన్ని ఉద్రేకింపజేస్తాయి...పదులు, వందలు మిమ్మల్ని చెయ్యిపట్టుకు లాక్కుపోతాయి "ఎవరుండని ముగ్ధవాటికిన్."

"పువుతేరుచు తెన్నుతోటలో ఎలకోయిల ఈలవేస్తెగా..."

ఆ సుమమాలల వెలయింత యని, ఆ రసగుళికల విలువ యిట్టిదని నిరూపింప ప్రయత్నించడం "వ్యర్థమోయీ, వ్యర్థమోయీ"...

ఆశైలి ఆసౌష్ఠవం, ఆదూకుడు, ఆదర్జా కృష్ణారావు గారికే సరిపోయింది. అల్లాగ వ్రాసేవాళ్లు తెనుగునాడులో ఎవ్వరూ లేరు. అతిశయోక్తికాదు; యథార్థం...

కృష్ణాపత్రికలో కృష్ణారావుగారు టాగూరిగారి కవితాతత్వాన్ని, పరామర్శిస్తూ వ్రాసినవ్యాసాలను చూచి పులకించి, వాటిని పురస్కరించుకొనికాదూ (సర్) సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారు తమ "ఫిలాసఫీ ఆఫ్ టాగూరు" అనే గ్రంథానికి పునాదులువేసింది ?

కృష్ణారావుగారి ఎడిటోరియల్సుచూచి, చదివికాదూ, ఒక్కొక్కప్పుడు డాక్టరు పట్టాభిగారు తమ "జన్మభూమి" పత్రికకు ప్రధానవ్యాసాలు తయారు జేసేవారు?...

కృష్ణారావుగారు "హిందూ ఈస్థటిక్స్" ను గురించి లిఖించిన వ్యాసపరంపరలను ఆసలా చూచుకొనికాదూ, ఆంధ్రరత్న దుగ్గిరాలగారు అప్పుడప్పుడు ఆర్టుమీద ఉపన్యాసాలు యిచ్చేవారు?...

కృష్ణాపత్రిక "రసమంజరి" యిన్స్పిరేషన్‌తో కదూ మన నవయువకవులు తమ భావగీతాలకు కొనలు సాగించింది ?...

కృష్ణాపత్రికద్వారాగాదూ, ఆంధ్రుల్లో ఎక్కువగా నవ్యభావోదయం ఉద్బోధితమైంది ?...

గంపలగూడెం కుమారరాజాగారు కదూ "కృష్ణాంధ్రపత్రికాసన్మాన" సందర్భంలో, బహిరంగ సభలో వక్కాణించింది, "నాకున్న సంస్కారానికి ముఖ్యకారణం కృష్ణాపత్రిక ... ఇన్నేళ్లనుంచీ నేను కృష్ణాపత్రికను ఒక్కవారమైనా చదవకుండా వుండలేదు..." అని ?...

వెనుక, పద్ధెనిమిదవ శతాబ్దాంతంలో మార్ల్బరో డ్యూక్ గారు అన్నారు: "నాకున్న చరిత్రజ్ఞానమంతా షేక్స్పియరు నాటకాలు చదవడంవల్ల కల్గిందే" అని!...

నాతో అనలేదూ, ఓవృద్ధమాతృశ్రీ ఓమారు రహస్యంగా: "కృష్ణారావుగారి కృష్ణాపత్రిక సాక్షాత్తు 'అయి మురళి'" అని ?...

నిజం...కృష్ణాపత్రికయొక్క నగవులు, చూడ్కులు, నానావిహరణములు, ధ్యానంబులు, నర్మాలాపంబులు- మానసముననాటి మరుడవు...మరుడవు...

'లోకములోపలన్ రసికలోక మనేకము గల్గు గాక"...కాని-

కృష్ణాపత్రికయొక్క- కృష్ణారావుగారియొక్క "కమనీయతామహిమ" దానికదే; సాటిలేనిది...సానల దీరిన జాతిరత్నము...

కాని కృష్ణారావుగారు మొగమాటమనే "రాచకురుపు" జిక్కుట వింతగా హరీ!"

ఆయనకు ఎట్టివిధమైన ప్రచారమన్నా పడదు. లేకపోతే యీసరికి, ఆంధ్రదేశం-ముఖ్యంగా బందరు పౌరులు - బ్రహ్మరథం పట్టకపోయినారా?...కృష్ణాపత్రికను వటవృక్షమంత గట్టిసంస్థనుగా చేయక పోయినారా ?

"చాటునుండే రెంకిసభకు రాజేశావ పదిమంది నోళ్లల్లో పడేమంటరాశావ..."

ఓమారు ప్రయత్నించి బలవంతంగా కృష్ణారావుగారిని సభకులాగారు...కొందరు...

"కృష్ణాంధ్రపత్రికా సన్మానం" సంగతి చెప్పేది...ఆగౌరవం తన కక్కర్లేదని కృష్ణారావుగారుచేసిన హంగామాచినా?...దేశోద్ధారక నాగేశ్వరరావుపంతులుగారి కొక్కరికే చెయ్యమని చేసిన అప్పీలు లేనా?...కాని, తప్పిందికాదు. కార్లమీద కార్లలో ఘనాపాఠీలు వచ్చి మొదలుపెరిచారు. బలవంతపు బ్రాహ్మణార్థంగా వొప్పుకున్నారు కృష్ణారావుగారు...

అప్పుడుజరిగిన తెరలోకలకలమంతా యిక్కడ వెలి పుచ్చడం సమంజసంగాదు...

సన్మానసందర్భాన, మద్రాకథామందిరంలో సభ జరుగుతూండగా తీయబడ్డ ఛాయాచిత్రాన్ని చూడండి ...ముఖాన్ని చేతులమాటుల మరుగుపర్చుకున్నారు కదూ కృష్ణారావుగారు?...

విద్యార్థిదశలో వుండగా, లేడీమాక్బెతుపాత్రను ధరించి కృష్ణారావుగారు రంగస్థలాన వెలిబుచ్చిన ఉత్సాహం, సరదా యిప్పుడేమైనవో!...

మాలవ్యాజీ, ఆయన చిన్నతనంలో శకుంతల వేషాన్ని వేశాడు. అది యథార్థమో కాదోనని నేనొకమారు ఆపండితసత్తమ్ముణ్ణి అడిగాను...

"నిజమే ... కాని యిప్పుడుమాత్రం ఆ నాయికాపాత్రను పోషించమని నన్ను బాధించకు" అన్నాడు నవ్వుతూ.

"విధి తప్పింప నెవ్వారి తరంబు"? కృష్ణారావుగారి సత్తా, శక్తిసామర్థ్యాలు పూర్తిగా వెలువడి రాణించలేను. ఆ బెంగలేదు ఆయనకు ... అసలు, తనలో ఆసుగుణాలు, ఉన్నతత్వము వున్నవని ఆయన అంగీకరిస్తేగా?...

కృష్ణాపత్రికద్వారా ఆయనగారి ప్రత్యేకత, పటుత్వం, ప్రాభవశ్రీ కొంతవరకుమాత్రమే లోకానికి వెల్లడి అయినది, అవుతూన్నది...

కృష్ణారావుగారిని పూర్తిగా అర్థంచేసుకోవడం, అన్వయం చెయ్యడం అసంభవం...ఆలోతు గభీరం... మేలిపసిండిగాజుల సమేళపు పచ్చల కీల్కడెంపు డాకేలు గల భావకన్యలు విహరించే జగమిది!...

కాని, నేను కొంతవరకు ఆయనగారిని బాగానే తెలుసుకొన్నాను అనేదిలాసాతో వ్రాశాను యిది... కృష్ణారావుగారి "గుణసంధామాధురీసాధురీతులలో నించుకయైన నావచనసందోహంబులకా" ఇతరులకు స్పష్టమైతే...వారికి నామీద కోపంవస్తుందని తెలిసీగూడా ధైర్యంచేసి వ్రాసిన నాశ్రమ వృథా కాదు...

---



తపస్సు                D. A. R.

# శ్రీరాములు

## పూడిపెద్ది వెంకటరమణయ్య

అక్షరాలు వ్రాసి కాస్తవర్ణక్రమం అలవడింతంటే బల్లమీద పుల్లతో శ్రీరాములు వ్రాస్తారు పిల్లలు. శ్రీరాములు వ్రాయడం చాలామంది కలవాటు. ముసలివాళ్లూ, ముసద్దీలూ శ్రీరాములుచుట్టి మరీ మొదలిడతారు ఏకాగితమయినా వ్రాయడానికి. కొందరు దినారంభంలో నిద్రమేల్కొనగానే కన్నులు మూసికొని ఎడమ అరచేత కుడిచేతి వ్రేలితో (చూపుడు వ్రేలితోనో, నడిమి వ్రేలితోనో) శ్రీరాములు వ్రాసికొనుట నభినయించి ఆ వ్రాసినవి అక్షరాలు కావు చిత్తరు వన్నట్లు చేతులు రెండూ కలయనులుముకొని కన్నులురాచికొని దోసిలి తెరచి తేరి దానిని చూచుకొని మరీ నిద్రలేస్తారు. కొందరు నడుస్తూన్నా కూర్చున్నా జాగ్రదవస్థలో నున్నంతసేపును కుడిచేతి చూపుడు వ్రేలితో బయలు హృదయంలో గాలిపత్రాలలో అలా శ్రీరాములు చుడుతూనేఉంటారు. శ్రీరాములు, శ్రీరాములు అని కొంచె రవకాశమయినప్పుడెల్ల కాగితంమీద వ్రాసి ఒక కోటిమారులు శ్రీరాములు వ్రాయుటకాగానే అదొక వ్రతముగా భద్రాచలాదియాత్రలు సాగించి సంతర్పణలూ, సమారాధనలూ చేస్తారు.

కార్యారంభం సౌజన్యంగా చేయడం మొకఅలవాటయింది. జీవితంలో క్రొత్తదినారంభం - క్రొత్తవర్షారంభంకూడా కాస్తపట్టుదలగా చూస్తారు. 'ఉదయమున లేచి ఎవరిముఖము చూచేనో' అంటారు ఏదయినా విపరీతపరిస్థితి ఏర్పడినప్పుడు. ఆరంభం అంతప్రాముఖ్యమయింది. సంవత్సరారంభం ఉగాది. జీవితంలో క్రొత్తసంవత్సరానికి చుట్టిన శ్రీరాములు.

"ఏదిరా నాయనా నీదస్తూరీ చూస్తా" నెలాగుంటుందో వ్రాయం"టే బల్లమీద "శ్రీరాములు వ్రాస్తాడు పిల్లవాడు. ఎందుచేత ? ఆపేరుబాగానలిగిఉండి ఆ అక్షరాలు పదంలో ఒప్పనలగాఉంటాయని. దానియందు వా డారోపించుకున్న పవిత్రతచేతనో, భక్తిచేతనో, ఎందుచేతనోగాని వానికన్నులకుకూడా ఆనాలుగక్షరాలూ అల్లికగొలుసులాగు చాలా ఒప్పిదంగా కనబడుతాయి.

ఉగాదినాడే కార్యమయినా ఒప్పిదలగా చేయాలి శుభప్రదంగా ప్రారంభించాలి. ఆనందంగా ఆరంభించాలి. అది సంవత్సరంలోని దినపంక్తులకు వరవడికావాలి. మకుటం కావాలి. మంజులంగా ఉండాలి. ఇవి మనఆశయాలు వచ్చింది. ఉగాదివచ్చింది. అరవైపూవుల వందలో అందంగా విరుతూన్న పూవు. వికాసానికి శ్రీకారంచుట్టిం దారేకును. ప్రకృతి తన వార్షిక కావ్యానికి వసంతారంభంలో శ్రీకారం చుట్టింది. కళారచనకూ శ్రీకారం చుట్టింది. మానవుడు చేయబోయే వాగ్రచనకూ శ్రీకారంచుడతాడు. దానికి సత్యమే శ్రీకారం. నూటిగాసత్యం చెప్పడం శ్రీరాములు వ్రాయడంకంటెనూ సులభం, అంతకంటెనూ అందం అదియే జీవప్రణాళికకు నాడి.

గంపలు తెస్తవాడు. చేపలుపట్టుట వానివృత్తి చక్కగా చేపలుపట్టు పేరుగలవాళ్లు వానితండ్రి జోగన్న, వానితండ్రి పెంటన్న కూడాను. చేపలు పట్టుట ఒకకళాప్రజ్ఞగా గణిస్తారు. కళారచనకు శాస్త్రత్వం అక్కరలేదు. తాత్కాలికానందం ఇచ్చేదయినా కళగా గ్రహిస్తుంది లోకం. కొంచె రెంతో ప్రయాసపడి అమృతం రచించినట్టే కొన్నిరచనలలో విశేషప్రజ్ఞ చూపుతారు. అబద్ధం ముడిపదార్థంగా విచిత్రశిల్పంచేసి చూపే కళాప్రజ్ఞ లున్నాయి. ఇది కేవలమూ కృత్రిమమయినా తాత్కాలికంగా కళఅయితే ఆనందం ఇస్తుంది. వెనుకటి కోశిల్పిసీమలో ఏంచేసేడు?

అది శీతలప్రదేశ మవడంచేత పాలమీదివెన్న చాలా పేరుకొని ఉంటుంది. మైనంలాగు సాగుతుంది. వెచ్చదనమంటకుండా ఉంటే. అలాటి వెన్నతో ఆశిల్పి అతి చాకచక్యంగా ఆకులూ, మొగ్గలూ, పువ్వులూ, తీగలూ ఇవన్నీ తయారుచేసి వానినెల్ల ఉచితస్థానాలలో అంటించి వానిని గాజుగోలెములలో నిలిపి చిత్రవస్తుప్రదర్శశాలకు పంపించేడట. అది ముఖ్యస్థానమున ఆప్రదర్శనశాలలో బెట్టి ఆపదార్థరచనావిధానాది వివిధాంశములు నొకపటమున వ్రాసి దానికడనుంచి ఆరచనకు ప్రథమబహుమాన మొసంగినట్టు వాకొన్నారు. ప్రదర్శనకాలము ముగియవచ్చినది. ఆశిల్పికి కబురంపేరు. బహుమతిపుచ్చుకొమ్మని, తనవస్తువును తిరిగికొంపోమని. ఏమయింది ? ఆతడు వచ్చేసరికి అక్కడ వట్టి గోలెమే ఉంది. చూపరుల ఊర్పులవేడిమికో, లేక గాలి వేడికో గాని క్రమక్రమముగ ఆశిల్పము కరగిపోయినది. అందరునూ కరగిపోయినారు. అస్థిరమయినా తాత్కాలికానందంఇస్తుంది అన్నతికళారచన. దీనికి కాస్త దేశకాలపాత్రలు తోడ్పడాలి.

గంగులు మంచివాడే. గంగ వాని కులదేవత. కుటుంబమున తొలిచూలుబిడ్డకు గంగపేరు పెట్టుట ఆచారము. ఆడుది గంగమ్మ, మగవాడు గంగయ్య. గంగులు ముద్దుపేరు.

ఏ పేరుపెట్టిపిలుస్తే పలుకడు జీవుడు? 'డాగీ' అంటే కుక్కపలుకుతుంది. త్యాగీఅంటే కర్ణుడు కుండలాలు పోయినచెవులు విరివిగా, చుల్కనగా రిక్కించుకొని మరీ వింటాడు. పిలుపునకు పలుకు పతి.

చిప్పెడువానపాములు (ఎఱలు), చేబారతో రెండంతలురివ్వ-పేనిన కరకుత్రాటికొసను వాడియైన, తెల్లని, సూక్ష్మమయిన గాలపుముల్లు, ఇది సూక్ష్మంగానే ఉండాలి-ఆచేప నోరెరిగి కొలకుచేసింది కాదే! త్రాటితోనూ, తుంగపోచలతోనూ అల్లిన చిన్న చదుర ఆచెరువుగట్టునపరచికొని, మండీమడపున కాళ్లడుగున నిమిడ్చికొని, పొట్టనుడలచుకొని, గుండెపిరియించుకొని, మౌనియై నిశ్చలసమాధిలో ప్రవేశించినట్టు కదలక నిలింపియై రెప్పవాల్పక. యోగియై ఏకాగ్రచిత్తముతో లోజూపుమాచే దిదృక్షతో దృష్టి లాజొన్నపుల్లనాథారంగా పాదుకొల్పి 'అదిగో ఇదిగో' అని ఆశలో ఈదుకుపోతున్నాడు. క్రొత్తఅరుణోదయంతో అవతరించేడు. గంగులుప్రక్కను తన చిన్ననోటిని పెద్దదిగా చాచికొని జాలిగా ఆకలివేదనతో ముఖమే కన్నులుగా చూస్తూందా సన్నని ఆకులయల్లికబుంగ. బుడుతడు బుజ్జగించే తండ్రిలాగు గంగులు బుంగవైపు ప్రేమగా చూస్తున్నాడు. ఒక్కచేప దానిపొట్టలో వేస్తే చాలునన్న దైన్యపుసంతుష్టి బలవంతంగా తెచ్చుకుంటున్నాడు. ఆనాడుగాది!

పెద్దకడుపుగల యాచకులుకొందరు అర్భకులను చూపి యాచించి ఆపదార్థముకూడ తామే మ్రింగజూస్తారు. బుంగనిండితే తనపొట్ట నిండినట్టేగదా! తనపొట్టేఅన్నమాటేమిటి? 'రంగి' "నా రంగుల గాలిపటం-నా సింగారాల బొంగరం, చనువుగ నాసందిటిలో తపతపలాడే చవడ - చేపలువండితే రంగివండాలి. ఎక్కడనేర్చిందో? కోనాడ దాని పుట్టినిల్లు. వహ్వా సముద్రంలో ఎన్నిచేపలు వెండిముక్కల్లాగు తళతళా మెరుస్తూ. మోచేతిదాకా సముద్రంలో చేయిముంచుతే చాలునట చేప వ్రేళ్లలో చిక్కుపడుతుందట ఒక్కొక్కనాడు. దాని అన్న తెచ్చిన చేపలు రంగే వర్ణించాలి. అటాటి కుటుంబంలోనుండి వచ్చింది రంగి. నేనెప్పుడైనా బుంగెడుపరిగలు పట్టుకొని ఇంటికివెళ్లేనా? నేను ఉగాది."

చాపక్రింది నీరులాగు చేపమీది మనసు తెలియకుండా క్షణాలను దాటి పారుతుంది. చేపఅనగానే నమలుటకు పండ్లు, చవిగొనుటకు నాల్క, మ్రింగుటకు కంఠం ఒకసంచీలోని వస్తువుల్లాగు సంచలిస్తాయి కదిపితేచాలు.

రెండుజాములు దాటినదగ్గరనుండి అపరాహ్ణం సాయాహ్నంలాగే తోస్తూఉంటుంది పాటుపడేవానికి ఎంతట ప్రొద్దుపోతుంది? ఎంతట గూడుచేరుకొని నడుంచేరవేస్తాను? అనిచూస్తూ ప్రొద్దునడుపుతాడు పనివాడు.

గంగులు పాడుపడేవాడా? చేపలుపట్టడం పాటా? అదే అందులో విచిత్రం. కదలిక లేని శరీరవ్యాయామం. ఆవమరపులో అలసట. వానికీ శరీర మలస్తుంది. శాంతి అలజడి కలిగిస్తుంది. ప్రొద్దు పడమటికి వాలింది. వాలింది నిస్సంశయంగా. పక్కనున్న బుంగను బారెడుదాకా దాటిపోయింది గంగులు క్రీనీడ లెక్కమాటులే రువ్వివిసిరేడు. లెక్కమాటులే ఎఱమార్చేడు. ఆ జొన్నపుల్ల ధీమాగా ఒకసారయినా మునకపెట్టడానికి కొనమంచిందికాదు. అంగులో భ్రమ. అప్రాటికొనసేదో బరువుతోచింది ఒకటి రెండుసారులు. సలిలాసంగా, చాకచక్యంతో చప్పవలాగే డారువ్వ గుండెదడ దడలాడబోయి నిదానం పూనింది. గజ్జెగట్టి సంసిద్ధమయిన నర్తకికి కాలులోటుపోయినట్టు. ఏమీలేదు. ఎఱ చెక్కుచెదర లేదు. ఎఱకు పసలేదేమో! వానికన్నులలో లీలగా అశాంతి - జాగ్రత! సంచలనమే పనికిరాదు, అశాంతి బొత్తిగా పనికిరాదు! నేటివాడా రేపటివాడా గంగులు. చేపచేవ తెరుగనూ? పారుష్యంవిడిచి సారళ్యంలోకి సర్దుకుంది వనస్సు. ఆస క్రొత్తచిగురు పెట్టింది. ఆయెఱతీసి క్రొత్తఎఱ పెట్టేడు. రంగి, వట్టిబుంగ! ఈరెండూ ఒకయింట్లో ఎలాగుంటాయి? ముంగాలమెట్టిన కత్తిపీట ముంగిట వాల్చి నిట్టూరుస్తూ ఉంటుంది. ప్రొయ్యి రాజబెట్టి పొలిమేరదాకా దృష్టులుసాగింగి పెదవివడిపికొని ప్రొయ్యిలోని కొఱ్ఱాయులు దడుపుతుంది లోపలకుపోయి రంగి. చేపచేతపట్టుకొని నడుస్తూఉంటే నూడాలనే ఉంటుంది. ఆమె భారమయిన తుంట్లూ పడవ క్రిందులాటి నడుమూను-రువ్వకొసను చేపకాఅందం లేదు. రువ్వకీ ఒయ్యారం లేదు. ఆసతీవ ప్రేలాడిపోతూంది. అదిగో ఇదిగో అంటూంది ప్రొద్దు పడమటికొండను. తిరుగా చబుకు జళిపించి చూచి చతికిలపడ్డాడు గంగులు. వట్టిబుంగతో వట్టిచేతులతో నిరుపయోగంగా ఓఱబిగిసిపోయిన ఎఱతునుకలచిప్పతో, నీడసైతం తన్ను విడచిపోయే చుల్కనతో ఆమునుచీకటిగర్భం చించుకుంటూ మైలు, మైలున్నర- ఇప్పుడో యోజనదూరానకుపోయిన ఇంటికి పోవడనూ - చేతకాని చెమటచినుకుతో రంగి పాదధూళి తడియనివ్వడమా? ఆజ్ఞనలేని అలసట నిట్టూర్పుతో రంగిపూలవాసనల చెదరకొట్టడమా? ఆసతో రంగి చాచేస్తే ఆ అరుణారుణ హస్తపల్లవం మీద లేదని కఠినంగా తలయూచి ఉమియడమా? ఇందుకానేను? ఇందుకా ఈజలాశయం? ఇందుకా ఈ జలచరనిర్మాణం? ఈతనేర్చి చెరువులో మునకవెట్టి చేపల నేరికోవలసింది. ఎందుకిన్ని సాధనాలు, ఇన్ని ఉపకరణాలు, ఇంతకాలయాపన, ఇంతనిస్సహాయత? చీకటి కనుబులుముతూంది. చదురుచుట్టబెట్టి చంకను పెట్టుకొని బుంగ భుజానవేసికొని ఒకచేత బురికా, ఒక చేతరువ్వాతో చెరువుగట్టు పైభాగం ఎక్కేడు. నీడ బొమ్మలాగున్నాడు. ఇప్పుడు చీకటిలో పొదివికొని పోయినాడు నేడుగాదియా?

రాయి నున్నగాకడిగి తుడిచింది. రాజపెట్టిన పొయ్యిమంట తగ్గించింది. కాలవేసిన దాక తీసిదంగార్చి తిరుగా ప్రొయ్యెక్కిస్తోంది రంగి “రెయ్యలు పట్రాండి. నెయ్యితో వేచిపెడతాను. చవడలు పట్రాండి, దౌడలూరించే వంటచేస్తాను. పరిగలు తెండి, పొరుగువారి నోరూరిస్తాను.” ఇవే పదాలు రంగికి. తనకళాప్రజ్ఞ, పాకశాస్త్రప్రవీణత మాపాలి. నాడుగాది. క్రొత్త వంటకంతో మత్తుమందు చల్లినట్టు సంతుష్టి పరచాలి భర్తను. ఆకుముందుకూర్చోని, చటుకు చిటుకు చప్పుడుతో చవులూర గంగులు తింటూఉంటే రంగిహృదయం వీణమీటేది. తానురచించిన కావ్యం మూర్తీభవించి ప్రధానరసం పాఠకుల హృదయాలమీద చిలికినట్టుకుసేది. అదేమిటో అనుకునేది. తిలఅన్నదిఉంటే ఎట్టిపాగాలయినా చుట్టవచ్చునుగా.

నాడు ఉగాది! మాఅన్న! పెద్దన్న! సారంగి. వాడివ్రేళ్లే వలచిక్కులాగుంటాయి. వాడిమాపులే గాలపురువ్వల్లాగుంటాయి. ఇంతనేపాం? తప్పతట్టేడు చేపలు, ప్రొద్దుపోకముందూ నట్టింటదించేవాడు. వల బాగుచేసుకుంది కింకాబారెడు ప్రొద్దుంకిది. ఇదేమిటిది? మూడు సందెలుముడిపడ్డాయి.ముంటికోచేదేనాటగిలిందో లేదో? ఇంకగంగులింటికి వచ్చి చేపలులేవని వట్టిబుంగా, వాడిపోయినరువ్వా, తెల్లబోయినముఖంతో క్రీనీడలాగు పొది

గిట నిలబడినట్టే తోస్తూంది. ఆహా! అసన్నైను మసాలానూరి నోరూరి నిలచిపోయాను. చేపలు లేకపోతే, ఇది నిలవయిపోతుంది. ఉగాది శలవయిపోతుంది. రేపటికి పసనెరిపోతుంది. కూరచెయ్యాలి, కూడువండాలి. అప్పుడు కునుకుపట్టాలి. ఏవీ? చేపలేవీ? ఒక్కటుంటే బాగుండును నావంటసుజా చూపిస్తును. ఎప్పుడూలేదు. ప్రొయ్యి ఎంతబాగా మండుతూంది. ఆదాకలో తాలింపువేస్తేకమ్మనపూలతీగలాగు ఊరంతా పాకాలి. అయితే ఇవేళకు మరి చేపలు లేనట్టే ఈవట్టివంట నేనువండలేను. చేపలేకుండా కడియెత్తి కడుపునింపుకోని యెరుగను. నేడు ఉగాది. దిస్సపడి వీథిగుమ్మానవిలిచిందిరంగి. పొరుగున కూర 'చుంయి' వినబడ్డాది. దూరాననుండి తాలింపువాసన తగిలింది. కాలునిలిచిందికాదు రంగికి.




"వట్టిబుంగా, వాడిపోయినరువ్వా, తెల్లబోయిన......"

ఏపనినయినా వేగంచేదామని తహతహలాడిన కొలదీ ఆలస్యమవుతుంది. చీకటి చిక్కబడిపోయింది. ప్రొయ్యిపొగ|లింప్లకప్పులమీద చిరుమబ్బుల చిత్రాలు రచిస్తున్నాయి. చోక్కాకుకాలిన వాసన చుట్టపెట్టింది గ్రామమంతటా. అందరూ పొలములనుండీ, పనులనుండీ యిండ్లకు మరలేరు. గంగులురాలేదు. రాజిన రంగిపొయ్యిమసి ఆరిపోయింది. ఉగాది ముగిసిపోతూంది!

చిన్నముక్కలో, పెద్దముక్కలో తరిగి వెల్లుల్లి తాలింపువేసి ఏదేనాచేస్తాను. అసలేదీ! రంగి ఊహల రంగవల్లులు తీరుస్తూంది చెరుపుతూంది.

గంగులు గ్రామముఖం చూచ్చేడు. చీకటే బాగుంది. చిన్నతనం దాచుకోవచ్చును. ఇల్లు చేరువయినకొలదీ కాళ్లు వెనుకకుపడుతున్నాయి. ఇంటిలో దీపపువెలుగుంది. రంగికన్నులున్నాయి. ఆరెండూకలసి నాముఖాన నెత్తురు లాగేస్తాయి, నాగుండెను ద్రాక్షపండులాగు పిడిచేస్తాయి. నాహృదయాన్ని రెల్లువెన్నులాగూ చేస్తాయి. ఇక్కడే, ఈమట్టినీడనే నిలిచిపోతాను. అయ్యో నేడు ఉగాది!

"కళాప్రజ్ఞ! ఎక్కడరచించాలి? ఎక్కడచూపాలి? సరసులయెదుట! తినడానికి నాలుకుంటే సరా? వాలుగుండొద్దూ? దరిద్రుడను, నిరాశ, చేపలు కొనుటకు చేత చిల్లిగవ్వయినలేదు. ముక్కుమల్లయినలేను. సన్నిమీద సంభారపుముద్ద నీరుగారింది. ఆ వట్టిదాకచూస్తే నాకుచిన్నతనం ముమ్మరంగా కుమ్ముకొస్తూంది. ఉగాది ఊరిపొలి మేరకు ఊరకేపోతూంది. ఛీ. ఏమిసంసారం! పాడుముండా సంసారం. ఒంటిచేతి చప్పట్లు - శ్రుతిలేనిపాట - ప్రొయ్యిమీదిదాక చిటిల్లు మందిగాబోలూ! పోనీ శనివిరుగుడు - ఇంటనున్న దొకటేదాక పగులనీ - బ్రద్దలుకానీ - పో! పొల్లుదాకా! నీవెందుకు బోసినోటితో నన్నుసాధిస్తూ ఉగాదిరుములు ఊరిస్తావూ? పో పెంటగలసిపో" బళ్లుమని ఆవఃకు దానిని విసిరేసింది రంగి. ప్రాతతాటిచేదతో నీళ్లుతెచ్చి ప్రొయ్యిలో పోసేసింది.



"పోనీ శనివిరుగుడు - పో! పొల్లుదాకా! నీవెందుకు..."

సన్నిమీదసంభారం నేలకు కడిగేసింది. దీపమార్పేసి వీథితలుపు దభీమని చేరవేసి గొళ్ళెంపెట్టింది. తాళం త్రిప్పింది. అటూ యిటూ చూచి సుమ్మార్లు దిగేసింది.

ఆ మజ్జి-చీకటిలో అటుమటిస్తున్నాడు గంగులు. ఎందుకావట్టిరువ్వ, చేపలులేని బుంగ, చేవతప్పిపోయిన చాప! ఛీ! ఇవి పట్టివిపట్టుకొని ఇంటికి మరలడమా? ఏటిపాడుగునా వీనిని వాడడమా? ఓసీ పాడుముండా రువ్వా నీవెందుకూ నా చేతిలో చెట్టునపుట్టినట్టే నిలిచి పోయేవుకావు పో! చెట్టెక్కిపో! అని దాని నడుము రెండుగా విరచి అవలకు విసిరేశాడు. చేపలబుంగ చించేశాడు. ఎటులబటికి నేలనుబోరిలించి మట్టేశాడు. ఫెళ్లుమని చప్పుడయేట్టు ఉగాదిని పసులగొడుతు న్నాడా అనిపించింది.

"ఎవరది?"

చీకటి మాట్లాడుతూంది. రంగి నిలబడి పోయింది దిగులుతో.

'ఎవరా చీకట్లో చడి?'

గంగులా మెకంఠస్వరం పోల్చేను. ముడిగిపోయాడా చీకటిముడతలో.

రంగి ఏమీలేదనుకొని వెళ్లిపోతూంది.

గంగులు రంగీ అని జాలిగ పిలిచేను. రంగి త్రుళ్లిపడి నిలబడి వెనుకకు మరలి "గంగులూ" అంది. అంతవరకూ వారిహృదయాలు నిజమయిన ప్రేమతో సంచలించాయి. కలసికొన్న ఆనందం కడపెదలను తడితడిగా నిలచింది.

నారిలో, రంగి "అయ్యో! ఈతడెన్ని చేపలు తెచ్చేడో. ఎగురైనాడు. ఎలావుండీది. కోపంచేత అన్నీ నాశనంచేసి ఇల్లుదీసి పందిరవేసి వచ్చేను. నా ప్రేమ, నా విధేయత, నా పనితనం, ఇవన్నీ నీట కలిపేశాను. ఏందారి? ఉగాదిని దిగమ్రింగేశాను. జాముర్రాత్రి దాటిందిగాబోలు! ఇప్పుడీచేప లెలావండడం? ఎలాగు ఉగాది పాలించడం." రంగిమనసు పుట్టినింటికి మరలింది. పండుగ-చేపలయినా పంపలేదు కన్నవారు. నేరంచేసేను." ఈ ఊహలతో జంకేసిన అడుగులమీదగ తగడలాడుతూనో మరెలాగో నిలచిపోయింది రంగి.

గంగులు, ఏదో సాకుచెప్పి తప్పించుకొనక ఎంత పనిచేసేనూ! ఉగాదిని ఉత్తచేతులతో ప్రారంభించేను. ఉపకరణాలన్నీ నాశం చేసి ఊచలలాగు చేతులు వ్రేలాడవైచికొని ఉగాది నెగాదిగ చూచేను. రంగి నెలా చూచేది? హాస్యం చేస్తుంది, ఈసడిస్తుంది. అన్నకంటె నన్ను చులకగా చూస్తుంది. ఆమెకన్నులలో చేతకానివాడనయిపోయినాను. ఈమెముంగిటి వాలుసు నయిపోయినాను. "రంగీ! క్షమించు"మని అడిగేద్దునా? క్షమిస్తుందా? చేతకానివాడిరాటను చేటపెయ్యకూడా కట్టు త్రెంచుకో చూస్తుంది, అయ్యో! ఉగాది సహజంగా

పోయిందికాదు. సాఫీగా నడచిందికాదు. నాకూ రంగికీ రంగంలో ఆరంభిస్తోంది. సంవత్సరమంతా ఇలాగే దౌర్భాగ్యాలతో సాగించాలా? ఉపాయం! ఉపాయం! ఉగాది! ఉగాది!

రంగి:—అమ్మో ఎంతతొందరపడ్డాను! ఇంటి నేపూనిలబడి ఇప్పుడు బోరలాపడ్డాను. అమ్మో! ఇంతటి అభాసం ఈరోజే నే కలగాలా? శ్రీరాములులోనే హంసపదమా? చిక్కులతో వర్షారంభమా? ఇలా తొందరపడ్డానని చెప్పి బ్రతిమాలుదునా? వాలుగలాగు జిప్పిబిస్తాడు. చేపతత్వమెరుగని కాపురింటిపడుచు నంగాను.

వాని ఊహలలో వాడూ, ఆమె ఊహలో ఆమే అలా చిక్కుకొని - ఎంతోలేదు - బారెడుదూరంలో ముఖాముఖి నిలచేఉన్నారు. వారినాల్గుమాపులూ చీకటి కావలా, యీవలా కొట్లాడుతున్నాయి చోరబడడానికి.

రం — గంగులూ!

గంగు:—ఔను! నేనే! రంగీ నీవేనా? నాకు ప్రత్యక్షమయిన దేవతలాగున్నావు-ఎంతపనీ. ఇలారా! నాచేరువగావచ్చి నన్ను గట్టిగా కౌగిలించుకో!

రంగి చేపలు మలినమున్నట్లు చిన్నబోయింగి ఆగింది. మనస్సుమలినమున్నట్లు అలాగే బ్రామ్పడ్డాడు గంగులు.

రంగి—ఏమిటయింది?

గంగులు గద్దదిక సవరించుకొని లేని ధైర్యం తెచ్చుకొని, నసుగుడు వదలించి, పెదవులుతడిపికొని "రంగీ! బ్రతికి బయటబడ్డాను నీమంగళసూత్ర బలంవల్ల. వా డాజానుబాహువు! చేతపెద్దకత్తి జళిపించుచూ వచ్చేడు. (జల్లుమన్న శరీరంతో గంగులును కౌగలించుకొని) "ఇకనిక్కడె నిలువలేము! రా! ఇంటికి పోదా" మంది. ఆమె భయంతో వణకుతూంది. ఆతడు దేనిచేతనోగాని వణకుతున్నాడు.

ఇద్దరూ త్రోవలో వానదెబ్బతిన్న బాటసారులలాగు ఒకేగొడుగునీడను నడుస్తూన్న స్త్రీపురుషుల నంటిపెట్టుకొని నడుస్తూ వణకుతూ ఇల్లుచేరేరు.

రంగి సాహసించి కొనితలుపుతాళం తీయలేదు.

గంగులు అనుమానంగా అరుగుమీద కూలబడి, రంగి నెగాదిగ చూచి "రంగీ, నన్నునిందించి లేచిపోతున్నావా?" అన్నాడు.

రంగి- నేనా? లేచిపోవడమా! ఏమో-ముందుగా నీవు చెప్పు. నాకు తరువాతచెప్తాను.

రంగీ! నన్నాగురార్తిగ్గ హెచ్చరించుకొని బుంగ బుంగెడుచేపలు - ఎంతమంచిచేపలు, చవడలు-చేడిసెలు ఎన్ని! వెండిగినుకల్లాగు మిలమిలా చూచేకళ్ళతో తపతపాలాడే తోకలతో అమ్మో అమ్మో ఒకటా రెండా? ఎన్నిపట్టేను - ఎన్నిపట్టేను.

రంగి. సరే? ఏమయింది?

ఇంకేమయింది? నన్ను వెనకనుంచిన పట్టుకొని వాడు నా బుంగా రువ్వాడు. చదురా, బరికా అన్నీలాక్కొని పోయినాడు. చీకటి. ఒంటిగా తిని, ఏంచేయను? ఇప్పుడు కదానికొకటి హత్తనిగాను చెప్పేడు గంగులు. ఎదుటింటి దీపపు వెలుగులో గంగులు ముఖం చూచింది రంగి. వాని ముఖాన భయంకంటె దొంగతనమూ, జంకూ తొంగు చున్నాయి చూపులు వాకిటిగ్గి మొక్కుపోతున్నాయి.

నిబ్బరంగా నిలచి "అలాగా గంగులూ!" చిన్ననవ్వు నవ్విందేమో! గంగు లామెముఖం తేరిచూడలేక పోయాడు. అయితే నాకథ చెప్తాను విను.

"బారెడు ప్రొద్దుందనగానే చేపలబుట్ట వచ్చింది. మా అన్న సంపేడు, మా అమ్మ పంపింది. మాలచ్చిగాడు తెచ్చేడు. వండేను. ఆమసాలావాసన ఇల్లుపట్టుకుంది. ఇరుగుపొరుగులకు ప్రాకింది. మన వంటయింటి కిటికీలో ఏదో మూకినట్టు చప్పుడయింది. అటు చూచేను. నల్లని శరీరం మిలమిలా మెరుస్తూన్న కళ్ళు, మీసాల క్రౌర్యంతో ముఖం, అదీ నన్ను చురాచురా చూచింది. ఘుమగుమ గమా వాసనేసింది. వండిన పెద్దదా కొట్టుకొంది నాకు. నమ్మ! గంగులూ, నా కొళ్ళు జల్లుమంది. ఆ నల్లపిల్లి

ఒకశేమాకు దూకింది దాకఅంచుకి. ఉడుకుతూన్న కూరంతా ఊడ్చితినేసింది. దాక పగులగొట్టింది. దీప మార్పేసింది. అంధకార మలమేసింది. నాకెదురుగా నిప్పు కణాలు చూస్తూండా పిల్లి. అంధకారం! ఒంటికత్తైను. ఏం చెయ్యడం? దానివేపే అలాచూస్తూ వెనుకకు అడుగులుపెడుతూ ఎలాగో బయటపడి బ్రతికేను.

కన్నులు పెద్దవిగావిప్పి గంగులు నిజమేనా అని ఆమెను భయమువాయ బిగ్గగాగిలించుకున్నాడు.

క్రొత్తరకపు కౌగిలింతతో ఉగాది అయిందా దంపతులకు వారి హృదయాలెలాగున్నా. వారు చుట్టిన శ్రీరాములలో హంసపదం.






# కార్చిచ్చు

కవికొండల వెంకటరావు

ఊరికి కొసవచ్చే ఉత్తరదిక్కుండేటక్కె కొండ వుంది కొండమీదా కొండపంచా అడివి ఆ అడివిలోకి బళ్లు కట్టుకువెళ్లి, పెద్దపెద్ద పోటు కత్తుల్తో గొడ్డళ్లతో తెగనరికి బళ్లకెక్కించి వెదురూ, కంపా, వాసం, కలపా, పుల్లా, పుడకా, యిళ్లకు తెచ్చుకోవడమనే వేసంగి చర్యపేరు "అడివిపోలం వెళ్లిరావడ" మంటారు.

అడివిపోలానికి పయనమౌతున్నారూ అంటే ఆరోజు కలకలం కలవరం ఊరంతా వ్యాపించివున్నమాటే. వెళ్లేవాళ్లకు వెళ్లనివాళ్లంతా తిరగటి కురుగులకు పనికి వచ్చే దినుసునుంచి గానుగనోకలి కమిరే తుండుదాకా నాకు తెచ్చిపెట్టు నాకు తెచ్చిపెట్టు అని పురమాయించేవారే. బయలుదేరి పొయ్యేవాడికి ఎలావుంటుందీ. యుద్ధానికి సన్నద్ధుడై నడుస్తూన్నట్టుంటుంది, పెద్దపులి నోట్లో పడకుండా. పాముకాటు తినకుండా, చెట్టుపైని కూలకుండా, ముల్లు కాళ్లో విరక్కుండా, సురక్షితంగా, ఎలా వెళ్లినవాడు అలా రావడమనేది గొప్పమాట

సుడిసె, సుడిసెముందు సుద్దివెన్నెల, సుద్దివెన్నెల్లో కుంచం కైవారాని కొచ్చిన నల్లతుమ్మచెట్టు నీడ జాడ, నీడజాడనే ఆసాయంకాలం నారేసినబండి, బండి తొట్టి ఆచాయల అప్పుడే ఉలవలూ చిట్టూ తిన్న కొత్త గిత్తలూ, కొత్తగిత్తల మెడల్లో గంటలు కదుతూవున్న బండి ఆసామీ రుద్రయ్యా! రుద్రయ్యతో "ముంత ఇదిగో! ఆవకాయబుర్రా మంచినీళ్లా ఇవిగో!" అని అందిస్తూ నిలబడివున్న మాలచ్చుమమ్మ మాట.—ఆమాలచ్చుమమ్మమాట ఎక్కడమాఱుమోసిందీ? రెండేదిక్కుల మాఱుమోసింది. రుద్రయ్య చెవిలోను, తిన్నగా చూస్తే కార్చిచ్చున మండిపోతూ సగ్గాడుపులు వాళ్ల సుడిసె కంటా కొనుతూన్నట్టు దోపింపచేసే కొండకోనలోను మాఱుమోసింది.

మాలచ్చుమమ్మ కావులించుకుంది రుద్రయ్యమెడను- రుద్రయ్య బండికట్టుకు "తోడిబళ్ళు ముందుపోతున్నాయి పోవాలి పోవాలి" అంటూవుంటే ఆకావులింపులో రుద్రయ్యబోరకు మాలచ్చుమమ్మబోర హత్తుకుపోయి స్పర్శసుఖం అపురూపంగా గొలిపింది. ఎంచేతో తెలుసునా? వాని ముతకకండువా తలకు చుట్టుకున్నాడు. వానికున్న తుండుగుడ్డ చిన్నది మొలనే ఎగట్టుకున్న పంచివిడాఁనే చుట్టపెట్టుకున్నాడు. వాని వక్షస్థలం అతినగ్నంగావుంది ఇక మాలచ్చుమమ్మ విషయం ఆలోచించవలెవస్తే దానిమెళ్లో తాళితాడుకూడా అక్కఱలేదు వాళ్ళు- ఆ తెగవాళ్లల్లో ఆడవాళ్లు రవికే తొడుగరు. కోకకట్టుకు కొంగు చాటేసుకున్నా ఆనిమిషమప్పుడు ఆకౌగిలింతలో జారిపోయింది చటాల్న మాలచ్చుమమ్మ ఉరోజాలయొక్క ఉన్నతమైనటువంటివీన్నీ, ఉన్ముఖములైనటువంటివీన్నీ మొనలనుండి అలా అలా ఓ పెడకు నేలకు.

అయ్యో! రుద్రయ్యా!" అని కుమిలికుమిలి కూర్చుని పోయింది.

ఎప్పుడూ బండీవచ్చినజాడనే ఆగడియకు ఎవరోమనిషి మూరాస్నేచుక్కవెలుగులో తెల్లనిపంచి కప్పుకుని వస్తూవున్నట్టయింది. "ఎవరువారు?" అంది మాలచ్చమమ్మ. "నేనే" అన్నాడు రుద్రయ్య. "నారుద్రయ్యా! నారుద్రయ్యా!" అని ఎగూపిర్ని గట్టిగా కౌగలించుకుంది, రుద్రయ్య ఏంమాట్లాడుతాడు? దానిసరియితే జిగిబిగిపరిరంభణంలో నొవ్వ చిక్కుకొని ఏంమాటాడుతాడు? "బతికున్నావా?" అంది తానే తిగూపిర్నిసళ్ళిచ్చి. "ఏం చచ్చిపోయానని ఎవరుచెప్పారు?" అన్నాడు రుద్రయ్య. "ఊరంతా పొక్కిపోయేనే వాయమాట! నీకు వెయ్యేళ్ళుఆయుస్సుండది రుద్రయ్యా!" అంది మాలచ్చమమ్మ. "ఎక్కడికో పయాణమాతూవున్నట్టున్నావు?" అన్నాడు రుద్రయ్య. "నీకోసమే, అడివిపాలెం. నీవు పోయేవనంతోనే నీఎముకలన్నా నెలికి ఈబండిమీదేసుకొచ్చి యిక్కడ దహనపఱచి అందులోపడి మృతిచెంది పోవాలని సంకల్పించుకున్నా." నంది మాలచ్చమమ్మ. రుద్రయ్యఅన్నాడు "నిజంగా సచ్చుంటే అడివిపాలెంలో ఎముకలూగిముకలూ మిగులుస్తాయి కోతులూ, ఎల్గొడ్లూను? చెట్లెక్కి చింతకాయ వాయించుకుంటూ కార్చిచ్చులో ఈపాటికే పారేసివుండును" అన్నాడు రుద్రయ్య. అలాంటి పరిస్థితిలో ప్రేమ ఎలా చూపించడం అనే ఆలోచనలోపడ్డట్టూరుకుంది మాలచ్చమమ్మ.

ఈ వీళ్లు అనకొన్న కబుర్లమీది గాలిపూనలు తెల్లారకుండానే ఊరంతా కమ్ముకు పోయినయి. "రుద్రయ్య చావలేదంట్రా! రుద్రయ్య ఇంటికొచ్చేట్ట" అని అనుకుంటూ ఊరంతా సుమ్మచెట్టుకింపకు మూగారు. రాత్రల్లాఏడ్చిన ముసలమ్మ "నాకొడుకుసంగతి ఏంటిబాబా? రుద్రయ్యా! ఆడురాలేదేం ఇంటికి?" అని అడుగుతూచేరింది ఆస్థలానికి. ఎవళ్లూ ముఖాలన్నా కడుక్కోలేదు. రుద్రయ్యకూర్చుని మీసాలుదువ్వకొంటూ చెప్పేడు.

"మిట్టమధ్యాహ్నంరెండుజాములయ్యేసరికి నిన్నటి పొద్దుపోతూకొండెక్కవెళుతున్నాం—కొండమీద కార్చిచ్చులు ఎండకాంతితోఏకమై నకమొకాలవేడితప్పమరోటిఏం లేకపోయింది. కాకికూడా కావుఅనడం మానేసింది. ఆకార్చిచ్చుతప్పించుక అవతలపడి చలికొండఎక్కితేనేగాని కొట్టడానికనువైనఅడివిమృగమొక్కడాకానరాలేదు. ఏలాగురాదేముడా! వండుకున్నకూళ్లు, నీళ్ళబుర్రలు గొడ్డళ్లతోను, పోటుకత్తులతోను అవలకు తీసుకుపోవడం సాధ్యంకాదనకోనికూటిముంతలు, నీటిబుర్రలు యీతలేదనువ దను చింతచెట్లకు వ్రేలాడగట్టి బళ్ళనూ, ఎడ్లనూ అక్కడేవుంచి, గొడ్డళ్లూపోటుకత్తులూ బుజాలేసుకుని దారితెన్నులువెలుక్కుంటూ పోబోయేము. ఎటుచూచినా దవానలమే. బాబుల్లారా అమ్మల్లారా! ఎటుచూచినా దవానలమే. చలికొండకు తోవే కానకపోయాం. పొద్దల్లావాలేదాకా తోవకోసం వెమకలాడుతూనేవున్నాం. కానకపోయాం. మేంవెళ్లిన నలుగురైగురుగురుం మళ్లుమొగాలట్టి యిళ్ళకు పోతే మేలుగ అనుకున్నాం. అనుకో! మళ్లు మొగాలట్టాం. మళ్లు మొగలట్టి బళ్లున్నకాడకు వచ్చేతలికి మానాలుకలు తడారిపోయి, మానోళ్లు పిడచకట్టుకుపోయి, నీళ్లెక్కడర్రా! కూళ్లమాట దేవుడెఱుగు అన్నట్టుగా ఉండిపోయినా.

చింతచెట్లకేసి చూచుకుంటే, కోతులు కూళ్లమూటలు విప్పుకొని కూళ్లుతినేసి గడ్డపెలికలుకింపపారేశన్ని ఆనపకాయబుర్రల్లో నీళ్లుతాగేసేసిబుర్రలుక్రిందకు గిరాటేశి చితకకొట్టేన్ని మానోళ్లల్లో కరకాయగొట్టి మమ్మల్ని వేధించి పారేశాయి. నాతో వచ్చిన నలుగురూ హాకీమని పడగొట్టి ప్రాణాలొదిలేశారు. నేనూ చచ్చిపోయినాను." అన్నాడు.

ముసిలమ్మ యేడుపు ప్రారంభించింది అంతలోనే, "ముండాకోతులు నీకెక్కడదాపరించినాయిరా కొడకా!" అంటూ. మాలచ్చమమ్మ "నేనూ చచ్చిపోయినాను అంటున్నాడు. "రుద్రయ్యా? కాక రుద్రయ్య దయ్యమా?" అని మిఱ్ఱుమిఱ్ఱు చూడసాగింది. విసేజనం సుంపు "సెప్పు సాంతంగా కథ సొప్పు" అంటున్నారేకాని చెప్పే కథలోని అవకతవకనొక్కడు ఆకలింపు



" ముంత ఇదిగో ఆనపకాయబుర్రా మంచినీళ్లు ఇదిగో. "



"భద్రయ్య కూచుని మీసాలు దువ్వుకొంటూ చెప్పేడు."

లేదు వాళ్లకు. రుద్రయ్య మాయమైపోయినాడు. అంతా చూస్తూ వుండగానే మాలచ్చుమమ్మ గొల్లుమంది, "ఆరి నా రుద్రయ్యా, నా గొంతుక నొక్కేసి నన్ను చంపేస్తున్నాడు" అంటూ.

"కార్చిచ్చుకేసి చూడకు మాలచ్చుమమ్మా! అడివి పొలంమాట తలపెట్టకు మాలచ్చుమమ్మా!" అని ఓదార్చేరు కొందరు. కొందరు బెదరుడిపేరు. "కార్చిచ్చు తలపెట్టకపోతే మటిదేన్ని తలపెట్టనల్లో అడివిపొలం పోకపోతే మరెక్కడికి నేను పోతానల్లో!" అనిముసిలమ్మకంటె ఎక్కువదీర్ఘాలుతీయసాగింది. "మెఱుపులూ మేఘాలూ చూడు" అన్నాడు ఒకడు చల్లని వీపు మీదచరచి. "మెఱుపులు నారుద్రయ్యఎముకలు కావటరా! మేఘాలు నారుద్రయ్యవొంటిఛాయ కావటర్రా నేనుసూడలేనల్లో!" అని బొబ్బబెత్తసాగింది. "సీపాలోకి ఎక్కించి పంపించేస్తాం రుద్రయ్యా" అని మాలచ్చుమమ్మను పేపబెత్తం పుచ్చుకు కొట్టాడుమఱొకడు. ఒకత్తె మాలచ్చుమమ్మకు విడిపోతూవున్న జుత్తుముడేసి "తల్లీ! యింట్లోకిరా! చల్లంగ తొంగుందువుండు కాస్సేపు" అని లోపలకు తీసుకొనివెళ్లింది.

ఆతరువాత కొన్నాళ్లదాకా మాలచ్చుమమ్మ మామూలుమనిషిలాగే వుంది. తొలకరించింది. పచ్చగడ్డి మొలిచింది. చెరువులునిండినయి.

తొలకరించగానే గిత్తల్ని, బండినీ అమ్మేసి మాలచ్చుమమ్మ ఎక్కడకోపోయింది. కాని రుద్రయ్యను తప్ప మరెవణ్ణీ వుంచుకోలేదనేవాడుక. మరెవరైనా దరికొస్తే రుద్రయ్యకార్చిచ్చులా ఎదురుంటాడనీవట ఏవూళ్లో ఎవరడిగినా.

"పెళ్ళిచేసుకుంటే దయ్యమై వెంటాడించకపోయ్యేవాడేమో" అని అనుకునేవారు అంతా. అదిమాత్రం "ఇంత పేమంట్రా ఇంకా నేనంటే"నని ఓమాటు గాలిని కావిలించుకున్నట్టు పైవాళ్ళకు కనబడుతూ వుండేది వెఱ్ఱిగా.

---



# ఆతడెవడు?

By

తాపీ. ధర్మారావు గారు.

అల్ల యాత డెవ్వ డామిట్ట నిత్రోవ
కానవచ్చు సుంత కదలకుండ
ఆకసమున కెవరొ అచ్చోట నంటించి
ఉంచు బొమ్మబోలె ఉన్నవాడు?

ఎత్తినట్టిపాద మెత్తినట్లేఉండు
గాని ముందుపడుట కానరాదు;
వెనుకపట్టిఉన్న పిడికిలి విడకుండ
అటులె ఉన్న దెవ్వ డల్లతండు?

నడచిపోవుచుండ నడిత్రోవ నొకశక్తి
అతని కొయ్యజేసి అట్టునిట్టు
ఒరగకుండ పదిలపరిచి అచ్చటెఉంచి
నట్లు కానవచ్చు, నాత డెవడు?

ఒడలి ఎముకలన్ని పొడుచుకొనుచువచ్చె,
తొడుగుకొన్న పేదదుస్తు లవిగొ
చిరిగినట్లుగాక, చిత్ర మాయావోట్ల
అరిగిపోయియున్న, వత డెవండు?

రెప్పవేయ డొకట, విప్పడు పెదవుల,
ఊపిరాడుచున్నదో అదేమొ!
కాని చూపు-జీవకళలతో నిండారి-
ఎగురు నాకసమున, ఇత డెవండు?

చిగురు పిల్లవాని పెద్దవా డదరక
చూచునట్లు సూర్యు చూచుచుండు;
అంతెకాదు జగములన్ని ఆచూపులో
ఇమిడిపోవుచున్న, వీత డెవడు?

జగములన్ని మించి, జగదీశ్వరుని చూచి,
తా ముఖాముఖి యయి తప్పొ ఒప్పొ
మంతనమున ఏదొ మాటాడుచున్నట్టి
ఏపుచూపు, ఎవ్వ డీల్లితండు?

చేరవచ్చి-చూచి-దారిపోయెడు మన
దిక్కునైన చూపు త్రిప్ప; డచట
నిలిచి-నిద్రపోయి-కలగాంచు చున్నట్లు
అన్యమెరుగకుండు, అత డెవండు.

"దారి కడ్డులెమ్ము-పొమ్ము ప్రక్కకు-మొద్దు
ఫాజి" అనెడు బండివాని తిట్లు
బండరాతిమీదపడు సూదు లయ్యె, తా
నతని కనడు-తొలగ, డాత డెవడు?

* * *

"భావియో భూతమో కాని వదలు-చాలు,
వర్తమానము చూడు, నీబాటనింక
కాలుసాగించు, బారాది కలదు ముందు"
అనుచు కాలము పలుకును, విను మహాత్మ.

# బ్రతుకు తెరువు

## వడ్లమన్నాటి కుటుంబరావు

౭

### యజమానులు

అనగాఅనగా ఒకరాజు. ఆరాజు తనమంత్రితోను, యితర పరివారసన్నాహంతోను ఒకనాడు వేటకు బయలుదేరాడు. కొంతదూరం వెళ్లి ఒకచెట్టు క్రింద మార్గాయాసం తీర్చుకునేసమయంలో యెక్కడనుంచో "ఓయిరాజా, నీవు వేటకుకాబోలు వెళ్లుతున్నావు. ముందుగ నీవు నాతో పోట్లాడి నన్ను గెలు. నీపరాక్రమ మేమిటో చూస్తా" నంటూ ఒకశబ్దం వినవచ్చింది. ఈమాటలకు రాజు తలెత్తి అన్నిపక్కలా పరికించిచూచాడు. ఏమీ కనపడలా. చెట్టుపైకి చూశాడు ఒకపిచ్చుకమాత్రం అక్కడ కనపడింది. చుట్టుప్రక్కల యెవ్వరూ లేరే యెక్కడిదీశబ్దం అనుకుంటూ యోచనచేస్తుంటే "యేమి అలా యోచనచేస్తావు? నీవు ఉత్త మాటలగడ్డేనా? నీపరాక్రమమింతటిదేనా" అని ఆపిచ్చిక హెచ్చరించింది. ఇదేదో ఆశ్చర్యంగానే వుందనుకుంటూ మంత్రిని పిలిచి జరిగినదంతా వివరించి చెప్పాడు. మంత్రి "దీని సంగతి నేను చూచుకుంటాను. ప్రభూ! తాము వేటకు దయచేయండి, యీపక్షిసంగతేమిటో విచారిస్తాను" అని ధైర్యం చెప్పినమీదట రాజు వేటకై ముందుకుసాగాడు. కొంతసేపైన పిమ్మట ఆపిచ్చుక యెక్కడికో యెగిరిపోయింది. మంత్రి నెమ్మదిగా చెట్టుఎక్కి పక్షికట్టుకున్న గూడునంతా కలయచూచి "అన్నా! దీన్ని చూచుకనా యీపిచ్చుక కింత అహంకారం కండకావరమూను" అనుకుంటూ అందు దొరికిన ఒకవస్తువును సంగ్రహించుకుని క్రిందకు దిగాడు. తిరిగితిరిగి ఆపిచ్చుకగూడ కొంతసేపటికి గూడు చేరుకుంది. సాయంకాలం సమీపించటంచేత రాజుగూడ వేటనుంచి తిరిగివచ్చి మంత్రిని సమీపించి సమాచార మేమిటని ప్రశ్నించాడు. "ప్రభూ! మరేమి వద్దు. పోట్లాటకు రమ్మనండి పక్షిని" అన్నాడు అలాగే రాజు పిచ్చుకను హెచ్చరించాడు. "నేను యుద్ధంచేసేపాటిదాననా, నాలో అట్టిశక్తి యేమీ లేదు" అంటూ పిచ్చుక చచ్చుపెద్దమ్మముఖం వేసింది. దీనిసంగతి యేమిటో చెప్పవలసినదిగా రాజు మంత్రిని అడిగితే "దానికంత కండకావరమూ దీన్ని చూచుకుని" అంటూ తను గూడునుంచి సంగ్రహించుకొని వచ్చిన వస్తువును రాజుకు అందిచ్చాడు. ఇంతా చూస్తే అది రెండణాలవెండిబిళ్ళ. దీన్ని చూచుకునే ఆపక్షికి అంత అహంకారము, అంతఘీంకారం, అంతఉన్మత్తతాను.

కొంతధనముగలిగిన యాతడే వ్యాపారసంస్థ కధిపతి, యజమానిగనుండుట సహజమైయున్నది. వాణిజ్యము, దానితత్వము, తనవ్యాపారమును సక్రమముగ నడపుకొనుట కవసరమగు కొన్ని యితరవ్యాపార విషయములు ముందుగ గ్రహించి యజమానియైనవాని కెంత తాబేదారీతనము కొంతవరకు సుముఖముగ నుండును వ్యాపారతత్వ మెట్టిదో ముందుగ గ్రహింప నవకాశము లేకున్నను వ్యాపారము చేతికి చిక్కినప్పుడైన దానిని గూర్చి విచారింపబూనినవాని కెంత నాకరీ మూఢునికి సేవచేయుటవలె బహుదుర్ఘటమని పించును.

యజమాని తానెంత నిరక్షరుడైనను తాబేదారులను దిద్దజూచును. అప్పటికైన తనకుగల అనుభవము తెలివితేటలలేమినైన లెక్కించుకుని సిగ్గుపడడు. తన సంస్థయందు పనిచేయుచున్నవార లెంత అనుభవము గలవారైనను, ఎంత ప్రజ్ఞావంతులైనను వీరిమాట, వీరి సలహాలన్న యజమానికి గిట్టదు. వ్యాపార మెట్టిదైన కానిండు. అట్టిసంస్థయొక్క యజమాని వెర్రివో, మొర్రివో కొన్నియూహాలు కలిగియుండును. అవే చాల విలువైనవని, ప్రయోజనమైనవని తలంచుచుండును.

ఒకవ్యాపారమునకు యజమానికానున్న యాతడు కొంతకాల మెచ్చటనేని తాబేదారీచేయు టుత్తమము. తాబేదారీతనమునందు గల కష్టము అనుభవజ్ఞునకే తెలియును. అట్టి అనుభవమును పొందిన యజమాని చెంత సేవచేయుటే సౌఖ్యప్రదము. ఎద్దుపుండు కాకికి ముద్దెట్లగును? అట్లే నౌకర్లబాధ యజమాను లెట్లు గ్రహింపగలుగుదురు ?

ప్రతియజమానియు తన తాబేదారులవల్ల తన వ్యాపార మభివృద్ధిచెందుచున్నదా, లేదా యని లెక్కించుకొనుచుండుట సహజము. తాబేదారులును తమ కేర్పడిన అధికశ్రమ తగ్గి, జీతము లెప్పుడు హెచ్చుకాబడునా యని ఆశించుచుండుట గూడ సహజము. ఒకగుమాస్తా చురుకుతనమువల్ల నెంతత్వరలో తనపనిని పూర్తిచేసికొన్నను ఆనాటి కిక స్వస్తి చెప్పుటకు యేయజమానియు ఒప్పడు. ఆగుమాస్తాకు నిర్ణయింపబడ్డ కాలపరిమితి యంతయూ తనపనిచేయుట యందే వినియోగింప బడవలెననీ, ఒకవేళ ఆగుమాస్తా తనపని నొకనాడు శీఘ్రముగ ముగించుకున్నను ముందు నాటి పనినో, మరేదో వేరేపనినో యజమాని నియోగించునే కాని యూరక వదలడు. కార్యాలయమున చేరినది మొదలు యెంతఅణకువతో మెలగుచున్న నౌకరైనను పైసందర్భములపట్ల నించుక తిరుగుబాటును సూచించిన ఆనాటితో నీయజమానికిని నీనౌకరుకును తెగతెంపులగును. ఇంతకు వెనుక యొనర్చిన సేవయైన పరిగణింపబడక బూడిదపాసిన పన్నీరగును. అభివృద్ధికి రాతగిన యువకు లెందరో ఇట్టిపరిస్థితులందు ఓరిమిలేక సంచరించిన కారణమున వారి జీవితములు భగ్నజీవితములుగ నున్నవనుటకు ప్రత్యక్షనిదర్శనము లెన్నియో చూపవచ్చును.

యజమాని దేని నియోజించినను నౌకరు చేయుటకు సిద్ధపడవలెను. 'అది యిట్లు కాదు అట్లు' అని చెప్పుటకు యజమాని అంగీకరింపడు. యజమాని నియమించు కార్యములకు హేతుక్రమములు అతనికే తెలియును. ఆతని హృదయకుహరమునందు గలయట్టి అమూల్యమగు నూహల బయలుపెట్టవలసినదిగ నౌకరు కోరు టుచితము గాదు. నౌకరు యెన్నడును యజమాని చెప్పుచేతల విమర్శింపరాదు.

నౌకరునకు తనయజమానియందు పూర్తియగు విశ్వాస ముండు టవసరము. యజమానిగూడ తననౌకరు నందంతవిశ్వాసముంచిననేకాని కార్యములు సక్రమముగ, లాభప్రదముగ నుండవు. పరస్పర విశ్వాసము లేనిచోట్ల పొరపులు, కష్టనష్టములు యేర్పడును.

యజమాని నియమించు నొకానొకపని అవలక్షణమైనదనీ, అం దేమియు లాభము లేకపోగా యిట్టి నష్టము సంభవించునని తాబేదారు బాగుగ నెరుగగలిగినచో నద్దానిని నెరవేర్పకముందు దానిలోని పొరపుల హృదయపూర్వకముగ విమర్శనబుద్ధితో నెరిగి వచ్చి యజమానికి విన్నవించి వానియిష్టముపైని ఆకార్యమును కొనసాగించు టుత్తమము. "అత్తగారి పైట తొలగినదన్న విషయము కోడలు చెప్పకున్నను తంటాయే, చెప్పిననూ తంటాయే" అను సామాన్యమైన సామెత మనకు బాగుగ తెలియును. అట్లే యజమాని, తాబేదారుల సంబంధముగూడ. ముందుగ చెప్పక పనిచేసినచో ప్రత్యక్షముగ కనుపడుచున్న తప్పు నెరిగియూ నెట్లు చేసితివనియు, ముందుగ చెప్పిన "నేచెప్పినది ముందుచేసి మరీ మాటలాడు" మనియు తాబేదారును దండించుట మాత్రమే గాక తన తెలివి తక్కువను కప్పిపుచ్చుకొనుటకు 'ఒక్కడూ పనికిరాడు, అందరు పనికిమాలినవారే, అన్నిటికి నేనొక్కడను చావాలి' అని విలపించును.

మానవమాత్రుడుగ జన్మించిన ప్రతివానికి భగవంతుడు ప్రపంచజ్ఞాన మలవరచేసికొనుటకు శక్తి నొసగియున్నాడు. ఆ జ్ఞానము నుపయోగపరుపని మానవుడు పట్టియంత్రమువంటివాడు. అట్టివానికి ఎట్టి గు బొందును లుండజాలవు. ప్రపంచజ్ఞానము, వివేచనాశక్తి గల మానవుడు వృద్ధిబొందగలడు.

యజమాని తరువాత సహజముగ హెడ్‌గుమాస్తాలను వారు ప్రతివాణిజ్యసంస్థయందుందురు. వీరు యజమానికి ప్రతినిధులవంటివారు. యజమానులతోటి

సమానగౌరవమునకర్హులు. యజమానికి ప్రతినిధియగుట దేహములు వేరైనను వారిరువుర ఆజ్ఞలను తాబేదారులు గౌరవింపవలసియుండును.

యజమానికి ప్రత్యామ్నాయముగ వ్యవహరించుచున్న హెడ్‌గుమాస్తాపైని తాబేదారు సవాళ్లువేయుట, వానిని చిన్నబుచ్చజూచుట మొదలగునవి చాల చెరుపు. ఇట్టిచేష్టలు ప్రతినిధికి చెందక ఆతని స్థానమున నియమించిన యజమానికే చెందునని గుర్తెరుగవలెను. హెడ్‌గుమాస్తాను పనినుండి తొలగింపవలెనన్న యజమానియే ఆపని యొనర్పవలెను. తదితరులవల్ల నాపని కాజాలదు. కాబట్టి క్రిందివా రెంత మొత్తుకున్నను ప్రయోజనము లేకపోగా చాలకష్టములపాలగుదురు.

హెడ్‌గుమాస్తా దొంగతనము చేయువాడైనను, లంచగొండియైనను ఈవిషయములు తాబేదారు యజమాని కెరుకపరచవచ్చును. కాని యిట్టివి బయలుపెట్టుటయందు బహుజాగరూకత యవసరము. ప్రత్యక్షనిదర్శనములు మనకు లభించి యుండినప్పుడే అట్టి పనికి బూనవలెను. అందును యోచనచేయవలసిన విశేషాంశము లెన్నియో గలవు. ముఖ్యముగ యజమానియొక్క ప్రకృతిని, యజమానికి, ప్రతినిధికి గల సంబంధము నెరిగియుండవలెను. ప్రతినిధిపైని మోపబడు నేరములు స్థిరపరచుటకు సేకరించు నిదర్శనములు బలముగలవై యుండవలెను. అవెల్ల యజమానిచెంత పెట్టబడు సందర్భమున వాటి కెట్టియాక్షేపణలు రాకుండునట్లు స్థిరతరమై యుండవలెను. సమయాసమయములు, ఉచితానుచితములు యుక్తిగలిగి బయలుపరుచవలెను. నేరారోపణలు చేసినంతనే నౌకరును యజమాని మెచ్చి దుశ్శాలువలు గప్పునని తలచరాదు. మనుష్యప్రకృతు లనేకవిధములు. పైపేరాలలో నుదాహరింపబడినట్లు ధనికులైన యజమానుల ప్రకృతులు, యూహాలు మరీ విపరీతముగ నుండును. ఒకయజమాని అట్టి నేరారోపణలను చెవియొగ్గి వినును. మరియొక డిట్టి నిందల వినుట కిచ్చగింపడు. ఇంకొకడు తాబేదారుల బుజ్జగించి తృణమో పణమో ఆశచూపి తనప్రతినిధియొక్క లోటుపాటుల తెలిసికొన ప్రయత్నించును. మరొకడు తనస్థానే యెల్లకార్యముల సర్వహించుచున్న ప్రతినిధిని ఒకతాబేదారు నేరమారోపించినంతమాత్రమున నాతనితొలగింప నిష్టపడక మరికొంతకాలము పరీక్షింపనెంచును. ఇంకొకడు నేరగానికే వానినేరమును తెలియజేసి బయలుపెట్టినవానిని గూడ బయటపెట్టి వారిరువురకు జరుగు వింతవాదమును, దెబ్బలాటను చూచుచు ఆనందించుచుండును. తాబేదారున కీ నౌకరీ చిక్కినది హెడ్‌గుమాస్తావలన కాదు. యజమానిఆదరణచే లభ్యపడినదే. అయినను వారిరువురకు గలజోస్తీ, అన్యోన్యత తాబేదారు యజమానుల నడుమ నుండు సంబంధమువంటిది గాదు. యజమానికి చేరువలో, అందుబాటులో, దృష్టిలో నుండునది ప్రతినిధిగాని, తాబేదారుగాదు. యజమానిని దర్శించుటకు, ఆతనితో ప్రసంగించుటకు అనేకావకాశములు తాబేదారులకు లభ్యపడవు.

తాబేదారును గూర్చి, అనగా నాతని పనితనము, అణకువ మొదలగువానిని గూర్చి యజమాని తెలిసికోదలచిన ముమ్ముందుగా నాతడు తనస్థానే వ్యవహరించుచున్న హెడ్‌గుమాస్తా నడుగును. తాబేదారు హెడ్‌గుమాస్తాకు వ్యతిరేకుడైనచో తాబేదారు జీవితము భగ్నమగును.

అసూయ, నిందారోపణ, చిలిపిచేష్టలు ఎన్నడును జయపీఠికి సోపానములు గాజాలవు. తాబేదారు కూడ కొంతకాలమున కాసంస్థకే హెడ్‌క్లార్కు అగు సందర్భ మేర్పడినప్పుడు తనకును తన క్రింద సేవచేయువారికిని అన్యోన్యత మృగ్యమై యేక్షణమున కాక్షణము ఆటకట్టునట్లు తోచును. తాబేదారుగ నున్నకాలములో పదుగురకు చాకిరీచేయుటయం దెంతకష్టముగలదో అధికారియై పదిమందిదగ్గర సేవను గ్రహించుటగూడ అంతేకష్టమైనదని అప్పుడు తెలిసికొనగలుగును. ఒక సంస్థయందు పనిచేయువారినడుమ సహనము, శీలము, కట్టుబాటు, కలయిక, సహకారముండిననేగాని ఆసంస్థ జయప్రదముగ నుండదు. ఇవి మృగ్యమైనచోట అసూయ, చాడీకోరుతనము, దొంగతనము, అపనిందలు ప్రబలి

సంస్థకే మోసమువాటిల్లి వీరందరకుగూడ అనర్థకములు తటస్థించును.

౮

## తాబేదారులు

### ఓరిమి, దాని అవసరము

ఒకేసంస్థయందు పలువురు తాబేదారు లుండుట యెల్లరెరింగిన విషయమే. ఒకేసంస్థయందు యిరువురు యువకులకు ఒకేసారి నౌకరీలభించుటగూడ సహజమే. అం దొకనికి మాత్రమే కొంతకాలమైనపిదప యజమాని జీతము హెచ్చించు ననుకొనుడు. ఈతనితోనే ప్రవేశపెట్టబడిన రెండవయాతడు కినుకచెంది పరాభవింపబడిన ట్లెంచుకొనగూడదు. విమర్శించి చూచినచో రెండవయాతనికంటె మొదటివానిచెంత వేతనాభివృద్ధిని దెచ్చు అధికోపయోగలక్షణము లేవియో నుండుట యజమాని గ్రహించియే యట్లొనర్చినట్లూహించి నతడు గూడ నట్టి అధికోపయోగలక్షణముల నలవడజేసికొనవలెను. అంతియే గాని తొందరపడి తన కన్యాయము జరిగినట్లు, తనకంటె ప్రజ్ఞముడే సుంత హెచ్చులక్షణములు గలవాడనీ, ఆతనితోపాటు తనకును వెంటనే వేతనము నభివృద్ధిపరచనియెడల నౌకరీకి రాజీనామానిచ్చునట్లును మొదలగుసవాళ్లు యజమానిచెంత వేయుట అనుచితమేగాక ఓర్వలేమిని తెలియజేయును. ఇదెల్ల నిట్లుండ మరికొంతకాలమునకు ఖాళీయగు హెచ్చుజీతమును దెచ్చు వేరొక గుమాస్తాపని నీరెండవ యువకుని పరము చేయ యజమాని యుద్దేశించి ప్రస్తుత మిట్లొనర్చిన నను నొనర్చవచ్చును. ఎటులైనను ఓరిమితో నుండుట యుచితమేగాని అవసరపడుట యెంతయు చెరుపు.

యజమాని దుష్టుడే న్యాయాన్యాయ విచక్షణ లేని మూఢుడైనచో గూడ యువకుడు తొందరపడి రాజీనామా నియ్యజనదు. 'అరటియాకు ముల్లుమీద పడినను, ముల్లే అరటియాకుమీదపడినను ఆకుకే చెరుపుగాని ముల్లు కేవిధముగు ప్రమాదము నుండదు' అట్లే యువకుడు గూడ ముల్లువంటివాడైన యజమానితో బహుజాగ్రత్తగ నుండవలెను. యజమానికి కోపమువచ్చి పొమ్మని కసరినను, తనకే భరింపరాని తాపము జనించినను కార్యాలయము విడువవలసినవాడును, తిరిగి యింకొక నౌకరీకొరకు అష్టకష్టములు పడవలసినవాడును యువకుడే. వేతనాభివృద్ధి లేకపోవుట అవమానము కాజాలదు. ఎంతకాలమున్నను ఆదరములేక, ఎగుడు బొదుగులు లేక, వ్యక్తిత్వ ప్రకటనమున కవకాశము చిక్కకుండు ప్రదేశముల నౌకరీచేయు యువకుడు భావ్యభివృద్ధి నభిలషించి రాజీనామా నియ్యవచ్చును న్యాయవర్తనము, అణకువ, ఓరిమి, తృప్తి గలిగి, శరీరకష్టమునకు వెనుకాడని యువకునకు యీకార్యాలయమే కాదు యే కార్యాలయమైన నొక్కటే.

## దుస్తులు

కార్యాలయమునందు నౌకరీలో ప్రవేశింపబోవు నప్పుడు దుస్తులవిషయమై యువకున కంతశ్రద్ధ తెలియక పోవచ్చును. కాలము గడచిన కొలది చినిగినవి, మురికివి, దుర్గంధపూరితమైనవి ధరించుట కార్యాలయోద్యోగులకు కంటకముగ తోచునని తానే గ్రహించును. ఒక్కొక వ్యక్తికి కొక్కొకతీరుగుస్తు లాకర్షణీయముగ నుండును. యువకుడు పలువురను పరీక్షించి తానేమాదిరిదుస్తుల ధరించిన ఆకర్షణీయముగ నుండగలడో నిర్ణయించి ఆపద్ధతి ననుసరించు టుత్తమము. వేరొకరి ననుకరించుట మంచిదికాకున్నను తానుగూడ ఆకర్షణీయముగ నుండుట కెవ్వడు అడ్డురాజాలడు గాన స్వల్పములగు మార్పులతో అట్లొనర్పవచ్చును. తళతళమెరసెడివి, కండ్లుచెదరగొట్టు రంగులతోగూడిన దుస్తులు ధరింపజనదు. కత్తిరింపులలోనే ఎంతోగుడ్డ నష్టమై యుండునట్లు తోపజేయు కోట్లు మొదలైనవి ధరించుట యువకుని గుబారాను సూచించును. పరిశుభ్రత యొక్కటే ముఖ్యముగాని వెలగలవాటిని ధరించుట గాదు ప్రధానము. కంటబడిన గుడ్డనెల్ల కొనినను, పుష్కలముగ దుస్తులుండియు తరుచు కొనినను యువకునకు పైకముయొక్క విలువ తెలియదేమో యని తోప

జేయును. సూక్ష్మములో మోక్షమనుదానిని యువకుడు మరువకూడదు. తక్కువవ్యయముతో ఆకర్షవంతముగ నుండు మంచిదుస్తులను నిర్మలముగ ధరించుటే యిందు గ్రహింపబడినది.

యువకు డింకను పెద్దపెరిగి, వేతన మభివృద్ధియై, అంచెలమీద పైపదవులకు చేరుకొనుచున్నప్పుడు దుస్తుల యందు చూపవలసిన శ్రద్ధ, వాటికొరకగు వ్యయము జాస్తియగును. తన కార్యాలయమునందున్నవారెల్లరు తమ హోదాలతీరు ననుసరించి దుస్తుల ధరింపవలెనని యజమాని కోరును. పలువురు యజమానులు అసహ్యముగ నుండుట చాలమంది యెరుగుదురు. అయినను తనవారెల్ల పరిశుభ్రముగ నుండవలెనని కోరుదు వా రాకర్షణీయముగ నుండుటే తన కానందమని, తృప్తియని తలంతురు.

నూట్లుతొడుగుట కలవాటుపడిన యువకులు కొంద రుందురు. ఎప్పటికప్పుడు నవనాగరిక శిఖామణులవలె నగుపడదలచినవారు సూట్లవిషయమై చాల జాగ్రత్తగ నుండవలెను. ఈ సూట్లలో నేడున్న పద్ధతి రేపుండదు. రేపటిది ఎల్లుండికే మార్పుచెందవచ్చును. నేడున్నగుడ్డ రేపుదొరకదు. రేపున్నది మరికొన్నెలదినములకు తిరిగి మారిపోవచ్చును. ఈక్రొత్తమార్పులు రేకెత్తుచున్నపుడెల్ల పాతమాదిరులు ఆకర్షణీయముగ నుండవు. కాన యెప్పటికప్పుడు క్రొత్తమార్పులతో వెలువడుచుండువాటిని కుట్టించుకొను నవకాశముండునటుల పాతవాటిని తక్కువసంఖ్యల నుంచుకోవలెనే గాని అధిక సంఖ్యగ సేకరించుకొనరాదు. లాగువేసికొనుపట్ల దాని మడతలు నలగరాదు. నలగకుండ నుంచగల కొన్ని మరలు గలవు. మరలు కాకున్న సులభోపాయము యువకుడు పండుకొను ప్రక్క. రాత్రిపరుండబోవు సమయమందు అలాగును మడతలయొద్ద జాగ్రత్తగ మడచి పడకక్రింద పరచిన తా నా పడకమీదనుంచి ఉదయము నిద్రలేచుసరికి అలాగు పైమరలనుండి తీసి నట్లే యుండును. పంచకట్టెడువారి కీబాధ యుండదు.

౧౦

## వశీకరణశక్తి

వ్యాపారమున కత్యావశ్యకమైన యీవశీకరణశక్తి మన్మథకళయందువలె మందులచేతను, మంత్రముల చేతను సంపాదింపగలిగినది గాదు. వ్యాపారతత్వ మెరిగి వ్యాపారముయొక్క మూలసూత్రము నవగాహన మొనర్చుకొనినవారు వాణిజ్యమునందు వశీకరణశక్తి కెంతటి ప్రాముఖ్యముగలదో గ్రహింపగలరు.

వాణిజ్యము కత్తిసాము వంటిది. సర్పముతో చెరలాటవంటిది. వాణిజ్యమున నొక్కడు మాత్రమే గెలిచికొనుటకు సాధ్యము గాదు. అనుక్షణము వివిధప్రకృతులతో గూడిన మనుష్యులతో బరిగోని కురుకవలసియుండును. ఎదురుగ నిలువబడియున్న ప్రత్యర్థిని లోబరుచుకొనగలిగినయాతడే జయశీలుడు. కత్తిసాము యుద్ధముపట్ల శరీరబలము, మనోదార్ఢ్యము, మొరటుతనము, నేర్పు అవసరము. వాణిజ్యమునందు వశీకరణశక్తి యన్న వినయము, శీలము, న్యాయము, యుక్తి, వాక్కు ఇందు శాంతిస్వరూపమే ప్రధానము. వ్యాపార సంస్థయందు ప్రవేశించిన యువకుడు ఈ వశీకరణశక్తిని సాధించి అలవడ జేసికొనవలెను. ఇయ్యది గ్రంథపరిచయమున నేర్వదగినది గావు. లలితకళవంటిది.

ఒక వాణిజ్యసంస్థకు పలువురు మనుష్యులు వచ్చుచు పోవుచుందురు. వారెల్లరు వివిధప్రకృతులు గలిగియుందురు. వచ్చినవారే తిరిగితిరిగి వచ్చుచుందురు. ఈ వచ్చిపోవువారి నందరను పరామర్శించుచు, వారు వారు కోరినదాని నందించి విక్రయించుచు, వారు ప్రశ్నించెడు కుంటిగ్రుడ్డి ప్రశ్నలకు తగిన సమాధానముల నిచ్చు కార్యములకు సంబంధించిన శాఖయందు యువకునకు నౌకరీ లభ్యపడినదని యెంచుదము. వీరందర సంతోషపరచి వారి వారికి కావలసియుండు సామగ్రికంటె హెచ్చుసామగ్రి నంటకట్టగలుగు, వారువారు వేయు కుంటిగ్రుడ్డి ప్రశ్నలకు విసుగుచెందక మందహాసవదనముతో జవాబుల నొసంగి తృప్తిపరచి లోబరచుకొని యేదో యొకవస్తువి శేషము నట్టివారి కంటగట్టగలుగు శక్తిగల యువకుడే యథార్థమైన నేర్పరి (Salesman). ఇట్టి యువకునకు అభివృద్ధి తప్పదు.

పాపుకు వచ్చెడు పలువురలో కోపదారులు, చీటికిమాటికి చీకాకుపడువారు, ఒకపట్టున విశ్వసింపక

ప్రపంచము శుద్ధమోసమైన దను స్థిరమగుసూహగల వా రెందరో ఉందురు. ఇట్టి వీరినందరకును నచ్చచెప్పి లోబరచుకొని యిసుకనుండి తైలమును దీసినట్లు డబ్బును గుంజువాతడే సమర్థుడగు Salesman.

పలుప్రకృతులు గల యిట్టివారిని లోజేసికొను శక్తి నలవరచుకొనుటకు యువకుడు తనస్వత్వము నటులుంచి వివిధవస్తత్వముల పరిశీలింపవలెను. తన కొకానొక విషయమునం దెక్కుడు నమ్మిక యుండవచ్చును. అంతమాత్రమున నావిషయము నందే తనమనస్సుంచి ప్రసంగించుచుండిన నెదుటివాడు విసువుచెంది ఆతనికి సరిపడునది లభింపక చేజారిపో యినవాడగును. యువకు డెప్పుడును ఎదుటివాని మన స్సెరిగి వాని జాడనే పోవలెను. ఆతడు పోవుదారి తప్పుగనున్నచో ఆతప్పు నాతనికి వినయవిధేయతతో తెలిపి ఆతని మనస్సును త్రిప్పి పిమ్మట యువకుడు తాను నమ్మినదానినిగూర్చి వాని కెక్కించి లోబరచు కొనవలెను. లోబడని బిరుసువాడైనచో యువకు డాతనిదారినే అనుసరించవలెను.

ఒక డొక షాపునకు బోయి ఫౌంటెన్ పెన్ కొనదలచినా డనుకొందము. ఆషాపువాడు (ఎ) అను కలమును జర్మనీనుండి సరాసరి రప్పించును. ఈకల మమ్మగలిగిన హెచ్చయినలాభము మిగులును. వచ్చి నాతడు (బి) అను స్వల్పమూల్యముగల కలమును కొన దలపెట్టును. (బి) కల మమ్మినచో హెచ్చు లాభము రాదు కాని వచ్చినాతడు దీనినే తీయదలచి నాడు ఆషాపు Salesman ఈ ఘట్టమునందు తన చాకచక్యము వల్ల (బి) అను కల మమ్ముడుపోకుండ (ఎ) అను కల మమ్ముడుపోవునట్లు చూచుటకు (ఎ) (బి) కలముల కిప్పటి తారతమ్యమును (బి) లోకంటె (ఎ) లో హెచ్చు ఉపయోగములు కలవనీ, (బి) లో ముందు ముందు చాలకష్టములు వచ్చునని (ఎ) లో అట్టివేవియు తటస్థపడవనీ, ధర యించుక హెచ్చు అయినను (ఎ) ను కొనుటే ఉత్తమోత్తమమనీ చెప్పి వానిచేత (ఎ) ను కొనిపింపగలిగినయాతడు ప్రజ్ఞావంతుడగు Salesman ఈ లావాదేవీలో ఎదుటివాని మనస్సు నొవ్వకముం దిట్టివే యే వస్తువులను కావలసినను అదేషాపుకు వచ్చునంతటి ఆదరాతిశయముల ప్రకటించు యువకుడు తప్పక గడతేరగలడు.

నేర్పులేని యువకుడు సంస్థకు కంటకముగ తోచును. ఆతనియందు ఓరిమి యుండదు. చాల నిక్కచ్చిమనిషి యని తా ననుకొని సంతోషించునే గాని తదితరులకు ప్రాయిల్లోని కట్టెవంటివాడు. ఇట్టి యువకుని జీవితము దినదిన గండముగ నుండుం కెలాటి యూక్షేపము నుండదు. అభివృద్ధికి రాదలచిన యువకుడు ఓరిమి, నేర్పు, వశీకరణశక్తిని సాధన మూల మున అలవడజేసికొనవలెను.

---



శివభక్తి మాహాత్మ్యమున సుందరాఖ్యానమున నొకరంగము

(శ్రీ కాశీనాథరావుగారి తంజాపుర ప్రాచీనచిత్రసంగ్రహమునుండి)

# నానాదేశ స్త్రీలు

ఆపస్తంబ

## మలనేషియా

లోకమున నొకరి తీరున నొకరుండరు. ప్రతివిషయమునందును భేదమే కాన్పించును. నిజమగు సామ్యమరుదు. ఒక తల్లిబిడ్డలలోఁగూడ నొకరిని బోలి యొకరుండకపోవుటవలెనే ప్రపంచమున వేర్వేరుప్రదేశములందలి జనులు ఒకరినిబోలి మఱియొకరుండజాలరు. వారివేషములందేమి, భాషలందేమి, ఆచారములందేమి, వ్యవహారములందేమి యపరిమిత భేదము కాన్పించుచుండును. ఇది స్వభావము. అట్లయినను జనులొకరినొకరు నాగరికులు అనాగరికులని విభజనము కల్పించుకొని పరిహసించుచుందురు. అట్టి అపహాసము సహేతుకముగాని, నిర్హేతుకముగాని యుండవచ్చును. జనుడు కూడ నొక జంతుప్రాయుడైనను జంతువునకన్న నింగితజ్ఞానము కలవాడైనందున సదసద్వివేకము కలవాడై యున్నాడు. ఇంగితజ్ఞానము కలిగియు కేవలము జంతుతుల్య ప్రవర్తనము కలవాడైనయెడల ననాగరికుడనిపించుకొనును. ప్రపంచమున జనులు తమవలెనితరులుండనంతమాత్రముననే పెరవారు అనాగరికులనియు, తాము నవనాగరికుల మనియు విర్రవీగుట సహజముగా నున్నది. అట్లగుటంబట్టి నాగరకతానాగరికతలకు పరిమితి నిర్ణయించుట కవకాశము లేకున్నది. ఎవరికి వారు నాగరికులు, పెరవారనాగరికులు. ఎవరిపిచ్చి వారికానందము. ఇటలీవారు అబిస్సీనియాలో గావించు శిశు స్త్రీ హత్యాది దుండగములు నాగరికతను ఆదేశమున నెలకొల్పుటకని చాటించుటయు, ఈదుండగముల నంతమొందించుటకును, స్వప్రాణ రక్షణమాత్రమే యుద్దేశముగను పోరాడు అబిసీనియనులు అనాగరికులని వ్యవహరింపబడుటయు నిందుకు నిదర్శనములు.

ఏది యెట్లున్నను, జనులు ఒకరినొకరు తెలిసికొని యుండుట లోకజ్ఞానమగును. ప్రపంచమునందలి జనులు దేశములనుబట్టియు, రూపములనుబట్టియు, వేషభాషలనుబట్టియు వేలకొలది తెగలుగా విభజింపబడియున్నారు. వీరిలో ననేకులు నవీననాగరిక దేశములకు దూరస్థులై ఇంచుమించు జంతుసమాన జీవనులై యున్నారు. అట్టివారినిగురించి తెలిసికొనుట వింతగనుండకపోదు. ప్రస్తుత మీ వ్యాసమున మలనేషియాయను ద్వీపసముదాయమునందు నానాదీవుల జనులనుగుఱించి, అందున స్త్రీలనుగురించి కొంత వ్రాయబడియున్నది.

పసిఫిక్ మహాసముద్రమున, భూమధ్యరేఖకు దక్షిణముగా ఆస్ట్రేలియా ఖండమునకు ఉత్తర పశ్చిమముల నుండి అమెరికా ఖండ పశ్చిమభాగమువఱకును ననేక వేల దీవులు కలవు. ఈదీవులలో కొన్ని జనస్థాన యోగ్యములుగనుండి జనసమ్మర్దముగలవిగను, కొన్ని అగ్నిపర్వతములతోఁగూడి వాసయోగ్యములు కాకను, కొన్ని పవ



చిత్రము ౧

'న్యూహిబ్రడీసు'లోని కుటుంబము, స్త్రీకి మీఁజేతులపై దద్దులు కలవు.

డపు దీవులుగను నున్నవి. ఈసమస్త ద్వీపసమూహమును అందలి జనుల వేష, భాష, ఆచార వ్యవహారములను

బట్టియు మూడు ప్రధాన భాగములుగా విభజింపదగినవై యున్నవి. అవి (౧) మలనేషియా, (౨) పాలినేషియా (3) మైక్రోనేషియా అనునవి.

## మలనేషియా

మలనేషియా ద్వీపసముదాయము వాయవ్యమున న్యూగినియా మొదలు ఆగ్నేయమున ఫిజీదీవులవఱకు గలదు. న్యూగినియా ఫిజీ కాక (౧) అడ్మిరాల్టి దీవులు (Admiralty Islands) (౨) బిస్మార్కు (Bismark Archipelgo) ద్వీపసమూహము (3) సాలమన్ (Solomon Islands) దీవులు, (౪) శాంటా క్రజ్ (Santa cruz) దీవులు (౫) బ్యాంక్సు అండ్ టారిస్ (Banks and Terres Islands) దీవులు. (౬) న్యూహిబ్రడీస్ (New Hebrides Islands) దీవులు (౭) న్యూకెలడోనియా అండ్ లాయల్టీ (New Caladonia and the Loyalty Islands) దీవులు అను ఏడు ద్వీపసమూహములు చేరియున్నవి. ఇందలి జనులు అవయవ నిర్మాణవిధానమున (Ethnological chaecteristics) ను, ఆచారవ్యవహారములందును ఇంచుమించు సామాన్యలక్షణములను కలిగియున్నారు. వీరియందు పెదల్పులేక, పొడవైనతలయు, కురచనై పైకి కొంచెమువంగియుండు ముక్కులు ముఖ్యలక్షణములు. శరీరచ్ఛాయ ఎఱ్ఱనై ఇనుపత్రుప్పుఛాయను బోలియుండును. శిరోజములు నల్లనివై సుడులుతిరిగి కురుచనైనవి. ఈ లక్షణములందు మలనేషియాద్వీపము లన్నింటియందుగల జనులు సామ్యముగలిగియుండియు అందలి వేర్వేరు ద్వీపసమూహములలోనివారు కొన్నియితర విషయములందు భేదపడియున్నారు.

సముద్రయానమునందు నైపుణ్యము చాలనందునను, క్రూరస్వభావమువలన నేర్పడు జగడాలమారితనమువల్లనున్ను ఈదీవులవారు పరస్పరము రాకపోకలను వృద్ధిచేసికొను నవకాశము కలుగకున్నది. ఒకవేళ నొకదీవివారు ప్రమాదవశమున మఱియొక దీవికి చేరుట తటస్థించెనేని ఇరుదీవులవారికి కయ్యమే సంభవించును గాని అతిథిసత్కార భావములేదు. ఒక్కొక్క మారు, నూతనాగతుకులందఱును చంపబడుటయు కలదు. వీరిలో కొన్ని దీవులవారు నరమాంసభక్షకు లగుటవలన నూతనాగంతుకులు ఆహారార్థముగగూడ చంపబడుట కలదు.



చిత్రము ౨
పూసల మొలకట్టెని కట్టుకొన్న బాలిక

ప్రస్తుతకాలమున ప్రయాణవసతులు వృద్ధియయినందున ఈదీవులన్నియు నాగరికుల సహవాసమును పొందగలిగి క్రమక్రమముగా తమ పూర్వాచారములలో గర్హ్యములగువానిని పోనాడుకొనగలుగుచున్నారు ఈ యనుకూలపరిస్థితులు తీరవాసులకేగాని ద్వీపాంతర్భాగవాసులకు కలుగుటలేనందున వారింకను పూర్వపుపద్ధతులలోనే యున్నారు.

తొలుదొలుత ఐరోపీయ శ్వేతజాతుల ప్రయాణికులు ఈద్వీపములను జేరినపుడు వీరిని పిశాచములనియు, భూతములనియు భావించి ద్వీపవాసులు దాగుకొనుచుండువారు. ఇందు స్త్రీలు ఈపిశాచములకంట్ల బడరాదని మిక్కిలి జాగరూకులయి కొన్నిదినముల పర్యంతము

బయటికి రాకుందురు. భయము తీరినతర్వాత కొంతకాలమునకుగాని స్త్రీలనుగాని, బిడ్డలనుగాని చూచు నవకాశము కలుగుటలేదు.

ఒకానొకదీవియందు పురుషు లగుపడరు. ఎచ్చటచూచినను స్త్రీలే యన్నిపనులను జేయుచుందురు. కొన్నిదీవులలో పురుషులు స్త్రీలకన్న నెక్కుడు ఆభరణముల ధరింతురు. వారి స్త్రీలకు ఆభరణములే యుండవు. బాలికలుమాత్రము మెడనొక దండనుగాని, కాలియందొక పట్టెనుగాని, సంచెకడియమునుగాని ధరించవచ్చును. వయసుచెల్లిన స్త్రీలు ఆభరణములను ధరించరాదు. వారితలలు బోడులుచేయబడి పూలనుగూడ ధరించుకొన నవకాశముండదు.

## పచ్చలు పొడుచుకొనుట

స్త్రీలకు ఆభరణముల ప్రత్యామ్నాయము పచ్చలు పొడుచుకొనుట. వారికి కట్టువస్త్రములుగూడ లేనందున, మనము వస్త్రములపై వేయు అద్దకపు చిత్రములవలె వారు తమ శరీరములపై పచ్చలు పొడుచుకొని దూరమునుండి చూచుటకు వస్త్రమే ధరించియున్నారనునట్లు కానబడుదురు.

అన్ని దీవులలోని స్త్రీలకును నిది ముఖ్యమగు నాచారము. మలనేషియా దీవుల స్త్రీలు తమ శరీరములను మూడువిధములుగా నలంకరించుకొందురు. ౧. రంగు పదార్థములను చర్మములోనికి ఎక్కించుట, ౨ వాతలు వేసికొనుటవలన చర్మము బుడుపులుగా నుబ్బియుండునట్లు చేయుట, 3. పుండ్లు చేయు మూలికలతో పుండ్లను చేసికొనుట.

అడ్మిరాల్టి దీవుల (Admiralty Islands) లోని స్త్రీలు వాడియగు నాయుధముతో కోతలువేసికొని ఆగాయములలోనికి నల్లని యొక రంగుపదార్థమును రుద్దుకొందురు. ఈకోతలు ముఖమున వలయములుగను, రొమ్మున మూలవాటముగను నుండును. మలనేషియా జాతులవారు నల్లనివారయినందున ఈపచ్చగుర్తులు ప్రకాశముగా దెలియజాలవు. స్త్రీలే పచ్చపొడుచు విద్య నేర్చియుందురు. పచ్చపొడుచుకొనుట చాల బాధాకరమైనందున నొక్కొక్క కాలమున కొంచెము కొంచెముగా మాత్రమే పచ్చపొడుచుకొనుట సాధ్యము కాగలదు. వివాహకాలమునాటికి యలంకరణము పూర్తియయి యుండవలయును కాన బాలికలకు చిన్ననాటనుండియే పచ్చలు పొడుచుట ప్రారంభమగును. ఒక్కొక్క కాలమునను బాధ మిక్కిలి దుర్భరమగువరకును పచ్చలు పొడుచుకొందురు. ఈబాధ మాయువరకును కొంతకాల మూరకుందురు. తర్వాత మరల నారంభింతురు. ఒక పెద్దరూపమును చిత్రించుకొనవలెనన్న దానికి యనేకనెలలు పట్టుటకలదు. కొన్ని దీవులలో ప్రథమ శిశుజననమైనతర్వాతనే పచ్చలు పొడుచుకొనుట ప్రారంభింతురు. నోటికి ఇరుప్రక్కల పచ్చలుండిన నాస్త్రీ సంతానవతియని సూచించును. కొందఱు వార్ధక్యమును మరుగుపరచుకొనుటకు శరీరమంతయు పచ్చలతో నలంకరించుకొందురు. ఫిజియన్ హేడ్స్ (Fijian hades) దీవులలో స్త్రీ పచ్చపొడుచుకొననియెడల నితరస్త్రీలు ఆమెనువేటాడి తఱిమి బాధించుటగాని, చంపి దేవతలకు బలిగా నిచ్చుటగాని సంభవించును.

రెండవవిధమగు వాతలు వేసికొను పద్ధతి వలన నల్లని రంగుగల శరీరముపై అలంకరణ రూపములు ప్రకాశములుగా తెలియును. (చిత్రము ౧ చూడుడు.) గొడాల్కనారు (Guadalcanar) నందు స్త్రీలు ముఖమునందు వలయరూపములను గుర్తించుకొందురు. ఎరొమాంగా (Eromanga new hebrides) లో పరస్పరము చెక్కిళ్ళమీదను, చుబుకములమీదను ఆకులు, పూవులు వీనిరూపములను గుర్తించుకొందురు. 'టన్నా' (Tanna) లో రూపనిర్ణయము లేక భుజములందును, తొడలయందును పెద్దపెద్ద మచ్చలను చేసికొందురు. న్యూ కెలడోనియా (New caledonia) లో బుడుపులు చేసికొను పద్ధతి మిక్కిలి బాధాకరమైనది. చర్మమునందు చిన్నరంధ్రముచేసి దానియందు ఎండుపుడకను నిలువబెట్టి దానిని కాల్చుదురు. పుడక కాలుచుపోయి చర్మమును కాల్చును. ఇట్లు కొన్నివేల కాలుడు బొబ్బ

లను చేసికొందురు. వీరిలో మనలోవలెనే చెవులు, ముక్కు పొడుచుట కలదు. చిన్నతనముననే బాలికలకు చెవులుపొడిచి ఆరంధ్రమున మొదట నొక సన్నని పుడకను పెట్టుదురు. క్రమక్రమముగా లావైన కొయ్యముక్కలను పెట్టుచు ఆరంధ్రమును పెద్దదిచేయుచు భుజము పర్యంతము జారునట్లు చేయుదురు. మనదేశమున తిరునెల్వేలి జిల్లాలో కొందఱిలో నీయాచారము కలదు. ఈ స్త్రీల చెవులను చూచినయెడల క్రొత్తకెలడోనియా స్త్రీలనాగరికులా, తిరునెల్వేలి స్త్రీలనాగరికులాయను సంశయమును తీర్చవలసియుండును. (ఎవరిపిచ్చి వారి కానందము) ముక్కు రంధ్రములలో పక్షుల కాలిగోళ్ళనుగాని, జంతువుల కోఱలనుగాని పెట్టుకొందురు.

## తలయొక్క ఆకారమును మార్చుట

న్యూకెలడోనియాలో శిశువు జనించినవెంటనే దాని తలను వ్రేళ్ళతో నదిమి వేడినీళ్ళలో ముంచియుంచుదురు. ఒకజాతివారిలో నొసలు పల్లమగునటుల తలను అదుముదురు. మఱియొకజాతివారిలో తలను మెడవలె సన్నమగునట్లు చేయుదురు. బాలునిముఖము ఇట్లు సన్నముగను, పొడవుగను చేయబడినయెడల నది యుద్ధవీరునికి చిహ్నమని వారి యభిప్రాయము. బాలికలకు ముఖము గుండ్రమగునట్లు చుబుకముపై కదుమబడుచున్నది.

'మలెకులా' (Malekula) దీవి యందు శిశువు తల చుట్టును పట్ట నొకదానిని అనేకమారులు చుట్టి ౧౨ మొదలు ౧౫ సంవత్సరములవఱకు కట్లను విప్పరు. ఇందువలన ప్రాణభయము లేకున్నను, మెదడు వ్యాధి సంభవించుట కలదు. తల్లి తనబిడ్డతల యెంత యదుమబడియుండిన నంత సంతసించును. చక్కగా నదుమబడని శిరములేని బాలికకు గొప్పవాని భార్యయగు నదృష్టము లేదని వారు తలంతురు. అనేకదీవులయందు పోకలు, తమలపాకులు, మిరియపాకులు, సున్నము వీటిని నమిలి దంతములు నల్లనగునట్లు చేసికొందురు. ఇట్టిది యాచారముగా కాకపోయినను అభ్యాసముగా మనదేశమునను కలదు. ఆదీవులయందు ఎవరికేని తెల్లని శుభ్రమైన కుక్కపండ్లు గలవారని పరిహసింపబడుదురు.

పూవు దండలను తలకును, నడుమునకును, భుజములకును చుట్టుకొనుట పురుషుల కలంకారము. ఇతర దేశములందు పుష్పధారణము సుగంధ ద్రవ్యముల నుపయోగించుట మొదలగునవి ముఖ్యముగా స్త్రీలకుచెందిననైయుండ నీదీవులలో నీద్రవ్యములు పురుషులకు ముఖ్యములు.



చిత్రము 3
ఫిజీ ద్వీపస్త్రీలిద్దరు స్వదేశదుస్తులతో విదేశదుస్తులను చేర్చి కట్టుకొందురు.

## స్త్రీల యాభరణములు

మెడకు గొలుసులు, నడుముకు పట్టెలు, తలకు పట్టీలు, దుస్వెనలు, సందెం కడియములు, గాజులు, కడియములు, అందెలు, ముక్కుపుడకలు, చెవులపోగులు ఇవన్నియు ఈదీవుల స్త్రీల యాభరణములై యున్నవి. ఇవి కొయ్య, వెదురు, ఆకులు, కాయలు, టెంకలు, నారలు, గడ్డిపోచలు, ఎముకలు, గోళ్లు, దంతములు, పండ్లు, తాబేటిచిప్పలు, ఉన్ని, వెండ్రుకలు, ఈకెలు, తోకలు మొదలగువాటితో చేయబడుచున్నవి. అడవి

పందియొక్క క్రిందికోఱలను తీసివేసినయెడల వాటికి నేరుగా క్రిందనుండు కోఱలు, అడ్డములేక పెరిగి వంపుగా ఉంగరమువలె నగును. వీటిని చాలా విలువగల యాభరణములుగా గణింతురు. పురుషులుగూడ వీటిని ముఖ్యముగా జూతురు.

న్యూబ్రిటన్ (New Britain) లోని వారికి మనుష్యుల రొమ్మెముకలు ముఖ్యమయిన యాభరణములు. కస్కస్ మృగముయొక్క పండ్లతో కట్టబడిన దండలు చాల ముఖ్యములు. ఒక దండయందు వేయి పండ్లుండును. ఇట్టి దండ ధనికులకు మాత్రమే సాధ్యమగు నాభరణము. తాబేటిచిప్పలతో పూసలనుచేసి దండలుగా గూర్చుకొందురు. చిప్పలను ముక్కలుగా పగులగొట్టి వాటియందు రంధ్రములను చేసి ఒకనారయందుగూర్చి యన్నిటిని ఒకేమారు నేలకు రాచుట వలన పూసలు గుండ్రముగా నగును.

షార్టులాండ్ దీవుల (Short land Islands) స్త్రీలు ఈ పూసలతో మొలపట్టీలనుగూడ అల్లుకొని వాటిని నృత్యకాలమున ధరింతురు. (చి. ౨) శాన్ క్రిస్టోవల్ (San Cristoval) లోని స్త్రీలు చేయుపూసలు ౧/౧౬" వ్యాసముగలిగి ఒక యంగుళమునకు ౨౦ పూసలు పట్టదగినంత చిన్నవై యున్నవి. వీటిని ఆభరణములుగా నుపయోగించుటమాత్రమేకాక దీర్ఘకాల ప్రయాసవలన చేయబడినవగుటవలన ధనముగాగూడ నుపయోగించుకొందురు. అడ్మిరాల్టీ దీవులలో స్త్రీలు చేయు పూసలు ఒక్కొక్కదానికి నెలలపర్యంతము ప్రయాసపడవలసియున్నది అందువలన వీటితో జేసినదండలు వంశానుక్రమముగ వచ్చుచుండును. ఈదీవులలో Flying foxes అను గబ్బిలముల చెవులక్రింది వెండ్రుకలతో పడికిన దారములను అమూల్యములుగా గణింతురు. ఒకదారమునందు ఒక తెల్లని గవ్వనుకట్టి పురుషులుమాత్రము ధరింతురు. స్త్రీలు దీని ధరింపరాదు. కాని సకృత్తుగా కొన్నియుత్సవ సమయములందుమాత్రము అధిపతులనువారి కుమార్తెలు ధరించవచ్చును.

ఉడుపులు :—అనాగరికులగు నీ దీవుల జనుల యుడుపులు వారి మతాచారములబట్టియు, మూఢవిశ్వాసములబట్టియు వేర్వేరు విధములనుండును. సాధారణముగా పురుషులు దిగంబరులుగా నుందురు. స్త్రీలుమాత్రము కొంతశరీరాచ్ఛాదన కలిగియుందురు. బిస్మార్కు దీవులు, బ్యాంకు దీవులు, సాలమన్ దీవులలోని స్త్రీలుగూడ దిగంబరులై యుందురు. న్యూకెలడోనియాలో కొంతమందిమాత్రము మొలత్రాడును, దానికి ఒకకాసువెడల్పు చినిగిన గుడ్డను కట్టుకొందురు. ఎరోమంగన్ (Eromangan) స్త్రీ నడుము మొదలు పాదములవఱకు అంగీని ధరించును. నిటెండి (Nitendi) లో స్త్రీలు ఆపాదమస్తకము చాపలతో కప్పికొందురు. అంకొరైటు (Anchorite Isles) దీవులలో స్త్రీలు పసుపుఆకులతోచేసిన రెండు చాపలను ఒకదానిముందునుండి వెనుకకును, రెండవదాని వెనుకనుండి ముందునకును చుట్టుకొని వాటిపైన నొకపట్టితో కట్టుకొందురు. న్యూఐర్లాండు దీవుల స్త్రీలు నడుము చుట్టు నొక నారనుచుట్టి ఒకచుంటిపైన దానిని ముడిచి ఆనారలో ముందును వెనుకను ఆకులగుత్తినైనను, నారకుచ్చునైనను దోపుకొందురు.

ఒకస్త్రీ తన దీవినుండి సమీపమున మఱొకదీవికి పోవలసినపుడు ఈయుడుపును దీసివైచి, ఈదుకొని పోయి యాదీవిని చేరినంతనే అచ్చటదొరకు నారతోను, ఆకులతోను మరల నొకక్రొత్తయుడుపును చేసికొనును. ఆకులకు ఎఱ్ఱని వర్ణమును పూసికొని ధరింతురు. ఈయుడుపులు కొన్నిచోట్ల పూజనీయములుగా నెంచబడుట వలన విదేశీయులెవరైన మాదిరికిగాను కోరి ఎంతధన మిచ్చినను లభించదు. ఒకవేళ లభించిన ఇచ్చినవారికిని కొన్నవారికిని ప్రాణాపాయకర మగును. అనగా నితరులకు దెలిసిన వారిని బ్రతుకనీయరు. ఇప్పుడిప్పుడు నాగరకుల రాకపోకలవలన కొంతవఱకు తమ పూర్వాచారానుగుణమగు దుస్తులను విడనాడుటయు, విదేశదుస్తులను ధరించుటయు సంభవించుచున్నది.

ఫిజీస్త్రీ లిద్దరు తమ స్వదేశదుస్తులతోగూడ విదేశదుస్తులనుగూడ ధరించియుండుట చిత్రమునందు చూడగలను.

కొన్నిచోట్ల చెట్టుపట్టను వెడల్పుగా కొట్టి దానిని వస్త్రముగా నుపయోగింతురు. ఇట్టివస్త్రములను చేయుట స్త్రీలపని. (చి. ౮) పాలమస్ దీవులలో కాగితపు మల్బరీచెట్టుపట్టను నీళ్ళలో నానబెట్టి కావలసిన పరిమాణమునకు సన్నముగ సాగగొట్టి గుడ్డలుగా వాడుదురు న్యూ హెబ్రిడీసుదీవులలో నీపట్టల వ్యాపారము మెండు. వాణికోరో దీవిలో చీల్చిన వెదురుతునకలతో పట్టగానల్లి దానిపై పట్టను కట్టి నడుముస కట్టుకొందురు. న్యూ కెలడోనియాలో నొకరకపు మొక్కను నమలి యుమ్మినయెడల ఉదారంగుగల యుమ్మివచ్చును. దీనిని గుడ్డలకు చాయగా నుపయోగింతురు. వివాహితలు ఇట్టి చాయ వేయబడిన పట్టలను కట్టుకొందురు. నిటెండీ దీవిలో మగ్గములుగూడ కలవు. మిషనరీల వ్యాపకము గలచోట్ల నవీననారపట్ట లెక్కువ వాడుకలోనికి వచ్చుచున్నవి.

ఒంటిగా జనించిన స్త్రీశిశువుయొక్క జీవము సందేహాస్పదము. కొన్నిచోట్ల శిశువులను పెంచుట కష్టమని పుట్టగనే వారిని చంపుటగలదు. అట్టిచోట్ల వారు ఎదిగినబిడ్డలను ఇతరదేశములనుండి తెచ్చి పెంచుకొందురు 'టుకోపియా' అనుదీవి చాలచిన్నది. అందు జనించిన పురుషశిశువులలో ఒకటిరెంటిని మాత్రము తప్ప తక్కినవాటిని చంపుట యాచారము జనసంఖ్య వృద్ధియయిన నాద్వీపము చాలదని వారిట్లు చేయుదురు. అయినను ఇచ్చట స్త్రీ శిశువుల కేయపాయమును లేదు ఇచ్చట స్త్రీల సంఖ్య పురుషులసంఖ్యకన్న మూడింతలు. బ్యాంకుదీవులలో స్త్రీలకు ప్రాముఖ్యము మెండు స్త్రీమూలమున వివాహసమయమున ధనమువచ్చుటవలనను, ఆమెయే వంశకర్తగా గణింపబడుటవలనను స్త్రీ శిశువును శ్రద్ధతో జూతురు.



చిత్రము ౮ చెట్టుపట్టను సన్నని గుడ్డవలె సాగగొట్టుట.

ఈద్వీపములలో శిశువులను వ్యాపారవస్తువులుగా గూడ నుపయోగింతురు. ఒకరికి తుపాకి మొదలగు అపురూప వస్తువు కావలెనన్న తమ బిడ్డలనైన నిచ్చి దానిని కొందురు. ఇట్లుండియు తమకు భారముకారని తోచి మిగుల్చుకొనిన బిడ్డలయందు ప్రేమపాశము ఎక్కువగా నుండునేగాని తక్కువకానేరదు.

## శిశుజననము, బాల్యము

కొన్నిదీవులలో స్త్రీశిశువు జనించినయెడల దానిని బ్రతుకనిచ్చుటయా, కాదా యనునది మొదటిసమస్య. అమడలుగా గలిగిన స్త్రీశిశువులలో నొకదానినిగాని, రెండింటినిగాని సముద్రములో ద్రోయుటయో, పూడ్చుటయో సంభవించును. కొన్నిదీవులలో అమడలు అనర్థదాయకములని భావింతురు. బ్యాంకుదీవులలో అమడల జననము మిక్కిలి యదృష్టసూచకమని నమ్మకము. అమడలను గన్నతల్లి మిక్కిలి యదృష్టవంతురాలనని మురియును. న్యూహెబ్రిడీసులో నొక స్త్రీ సంతానాపేక్షతో నేదయిన పుణ్యక్షేత్రమునకు పోయి ఆమెకు అమడలు కలిగిన నెంతో గొప్పగా భావించును.

మలనేషియాదీవు లన్నిటియందును పురుష శిశు జననకాలమున సాధారణముగా ఉత్సవము లెక్కువగా జరుగును. న్యూహెబ్రిడీసదీవులలో పురుష శిశు జననమాది పదునొకండవరోజున శిశువు తండ్రి సముద్రమునకుపోయి యాశిశువునకు చెందిన వస్తువులను కడిగికొని వచ్చునపుడు వాడు మంచి విలుకాడు కావలెనను కోరి

కతో చిన్నబొమ్మలిండ్లను దారిపొడుగునను చల్లుచు వచ్చును. స్త్రీ శిశువైనయెడల చక్కగ పరిశ్రమచేయ గలదనుటకు చెట్ల నారలను చల్లుచువచ్చును. బిడ్డలు పసితనముననే తమ పనులను తామే తీర్చుకొనుటకు నేర్పుదురు. తమ యాహారమునకు కావలసిన పైరులను వారే పైరుచేసికొందురు. తల్లులు కుమార్తెలకు దినసరి గృహకృత్యములను చేసికొనుట నేర్పెదరు.

మీదుగా కట్టుకొనియుందురు. ధనికులలో నట్టిబాలికలు ౮ వ సంవత్సరమునుండి బోనులలో నుంచబడుదురు. అనేక బాలికలు ఒకేయావరణమందు ఒకే యింటిలో వేర్వేరుబోనులలో నుంచబడియుందురు. బోను కోణాకృతిగలిగి౧౦-౧౨అడుగులచుట్టుకొలతయు, నాలుగడుగుల ఎత్తును గలిగి బాలిక కూర్చుండుటకును ముడుచుకొనిపరుండుటకును చాలియుండును. ఈ



చిత్రము ౨ ఫిజీస్త్రీలు బుట్టలను చాపలనల్లుట

## వివాహము

కడుచిన్నవయసుననే బాలికలకు వివాహ ప్రయత్నములు జరుగును. బాలికలు సాధారణముగా ౧౦—౧౩ వయసులో రజస్వల లగుదురు. 'న్యూబ్రిటను'లో బాలికలకు ౧౦ వ సంవత్సరమున వివాహము జరుగును. 'అంబ్రీము' దీవిలో ౭—౮ సంవత్సరములకే వివాహము జరుగును. వివాహవయస్సు వచ్చినదని సూచించుటకుగాను వారి వస్త్రధారణమందును, పచ్చలు పొడుచుటయందును తగినమార్పులు చూపబడును. పచ్చలు పొడుచుకొనని బాలిక వివాహార్హ కానేరదు.

'న్యూహీబ్రడీసు' లో ఒకటిరెండు దీవులందు స్త్రీ రజస్వల యయినంతనే యామెముందటి పైపండ్లను ఒకరాతితో కొట్టి రాల్తురు. ఒకానొకబాలిక ఈబాధకు భయపడి పండ్లూడగొట్టుకొననందున నవివాహితగానే యుండవలసివచ్చెను. ఇదికాక జననిందకు పాత్రయయ్యెను. పండ్లూడగొట్టుట సాధారణముగా ముదుసలి స్త్రీలు చేయు పనియయియున్నది. న్యూఐర్లాండు దీవులలో బీదబాలికలు వివాహవయస్సువఱకు ఒకదట్టని రొమ్ముపైనను, వీపుపైనను మూలకుమూలకు భుజముల

గుడిసెలలో నా బాలిక ౪-౫ సంవత్సరములు గడపవలసియుండును. రోజుకొకసారి గుడిసెసమీపమున నుండు తొట్టిలో స్నానముచేయుటకు మాత్రము బయటికి రావచ్చును. గుడిసెలో వెలుతురు రాజాలదు. గాలిమాత్రము కొంచెము వచ్చుట కేర్పాటు చేయబడియుండును.

గొప్పకుటుంబములలో వివాహము కడుబాల్యముననే జరుగును. ఒకకుటుంబమున ఒకబాలుడు జనించినతోడనే వానితలిదండ్రులు, సమాన సంపద్యుక్తులగు వారియింట కుమార్తెగలిగెనేని తమబాలున కిచ్చునట్లు వాగ్దానము చేయించుకొందురు. ఈవిధముగ బాలిక పుట్టుటకుముందే వాని వివాహము నిశ్చయమయి యుండును. బాలిక జనించినవెంటనే కన్యాశుల్కముగా నిశ్చయించుకొన్న వస్తువులనుగాని, ధనమునుగాని ఇచ్చుటకు ప్రారంభింతురు. అంతయు నొకేమారు ఇవ్వవలసినది లేదు. బాలికకు పచ్చలుపొడుచుట ప్రారంభింపగనే అది శుల్కధనమును పూర్తిగా చెల్లించవలసినట్లు బాలునితండ్రికి గుర్తు.

'న్యూబ్రిటను'లో ఒకబాలుడు ౧౪ఏండ్లప్రాయమువాడు కాగానే వానికి వానిపితృవ్యుడు ఒక్క

బాలికను ఆమె తల్లివద్దనుండి కొనును. వివాహ సమయమున విందులు విశేషముగా జరుగును. 'న్యూహిబ్రిడిసు'లో ఏడేండ్లబాలికను ౧౮-౨౦ ఏండ్ల యువకునికి నిశ్చయించి పెట్టుదురు. వివాహము కాకున్నను యువకుడా బాలికను తనభార్యగానే భావించుచుండును. కాని బాలిక యుక్తవయసు వచ్చినకొలది తనకాతడిష్టపురుషుడు కాడేని మఱియొకనితో పాఱిపోవును. అపుడు బాలిక వివాహసంబంధముగా జరిగిన నిర్ణయముల గుఱించి ఉభయపక్షములవారికిని పోరాటము సంభవించుట గలదు.

న్యూకెలడోనియాలో బీదకుటుంబములలోని వివాహములు గ్రామపెద్దలు నిర్ణయింతురు. బాలికల



చిత్రము ౬
సాలమన్ దీవి బాలికలు. పూలును గవ్వలును గల దండలను ధరించియున్నారు. వీరి పావడలు ఆకులతో చేయబడినవి.

కే స్వాతంత్ర్యమును లేదు. ధనికులలో బాలికలు వారి యిష్టమువచ్చిన పురుషుని వివాహమాడవచ్చును. ఒక బాలికను వివాహమాడ పలువురు యువకులు ఇచ్ఛగలిగియుండిరేని వారందఱు బాలికగృహమునకు పోయి ఒక వరుసగా నిలుచుందురు. ఒక్కొక్కని యెదుట నొక యాకుపై టెంకాయముక్క లుంచబడును. ప్రతివాడును తనయెదుటి టెంకాయముక్కను కొఱికి శేషము ఆకుపై నుంచును. బాలిక కెవనిపై నిష్టముండునో వాడుకొఱికిన ముక్కను తాను కొఱికి తినును. వారిలో నెవరును తనకు నచ్చనియెడల ఆబాలిక యవివాహితగానే యుండుట తటస్థించును.

'న్యూకెలడోనియా'లో వరుడు మత్స్యపుచిప్ప పూసల దండను వధువున కివ్వనిచో వివాహము పూర్తికాజాలదు. వధూవరులు నమలిన మూలికలరసమును పులియబెట్టి తీయబడిన పానీయమును నిరువురు త్రాగవలెను.

చిన్నవయసు బాలిక వివాహము నిశ్చయమయిన తర్వాత భర్తయింటికి అప్పుడప్పుడుపోయి యొకనెలకాలముండి భర్తయింటివారితో స్నేహమును వృద్ధిపఱచుకొనుచుండును. బాలికకు కావలసిన యన్నవస్త్రములు పుట్టినింటినుండియే కొనిపోవలెను. అట్టిస్నేహమువలన వివాహమయినతర్వాత భార్య భర్తయింటికి సంకోచము లేక యిష్టముతో పోవును. ఉత్తరపు న్యూహిబ్రిడీసులో భర్త కాబోవువానియింటనే బాలిక పెరుగును. భావి భార్యాభర్తలు ఒకతల్లిబిడ్డలవలె పెరిగి పెద్దవారగుదురు. 'అమోబా' అను చోట వివాహ నిశ్చయమయిన తర్వాత బాలిక పురుషునింటనే పెరుగుచు వచ్చును. యుక్తవయసు రాగానే బాలికను తల్లిదండ్రులు తీసికొనిపోయి వివాహమునకు పచ్చపొడుచుట మొదలగు నాచారముల నిర్వర్తించుదురు. తర్వాత తమకు కావలసిన శుల్కధనమును తీసికొని వివాహము చేసి బాలికను పంపివేయుదురు.

'న్యూబ్రిటన్'లో కన్యాశుల్కము వరకు గాను అపరిమిత ధనమివ్వవలసియున్నందున వరుడు ఆధనము ఒక్కసారే యివ్వనక్కరలేదు. వివాహకాలమునకు జరిగినదో, అట్లు సాధ్యముకానియెడల తనజీవితకాలమున నెప్పుడో యొకప్పు డివ్వవచ్చునని తీర్మానించుకొని దానికి తగినట్లు కొంచెముకొంచెముగా ధనమును

చెల్లించుచువచ్చును. అందువలన వివాహ మతిబాల్యము ననే చేసికొని శుల్కధనమును చెల్లించుచువచ్చును. శుల్కధనములో నెక్కువభాగము చెల్లించబడినయెడల



చిత్రము ౭
ఫిజీ బాలిక.

మిగతను చెల్లించ కుండుటకు ఒక మార్గముకలదు. అదేదనగా, భర్త భార్యలు ఒకపొదలో నుడిసెనుకట్టి ఇద్దరును పారిపోవుదురు. అపుడు భార్యయొక్క తలిదండ్రులు కోపము నభినయించుచు కొంతపరివారముతో అల్లుని వెదుకుచు పోవుదురు. సాధారణముగా అల్లుడు కనబడడు. అంతవాడు కట్టినగుడిసెను తగులబెట్టి గ్రామము చేరుదురు. ఈలోన అల్లుడును, కుమార్తెయు గ్రామమునకు మరియొకమార్గమునవచ్చి క్షేమముగానుందురు ఈ కోపనాటకానంతరము శుల్కధన మివ్వనక్కరలేదు. ఒకవేళ శుల్కధనము చాలభాగము కొరతయుండినయెడల ఈనాటకము సాగదు. అపుడు నిజముగు పోరాటము కలిగి ధనము చెల్లించువరకును దంపతులను గ్రామము చేరనివ్వరు.

వివాహములేకనే ఏపురుషుడైనను పెద్దవాడైనయెడల అట్టివాని వివాహమున కనేకనిర్బంధములు కలవు. వాడు తొలుత కులపెద్దవద్ద అనుమతి పొందవలెను. ఏదేనికము కారణముగా వాని వివాహము జరగకుండియుండిన కులపెద్ద వానికిపెగిన కన్యను మాట్లాడి వివాహముచేయును.

ఒక్కొక్క జాతిసంఘములోను రెండుభాగములుండును. ఒకభాగములోనివారు రెండవభాగములోనివారితో వైవాహిక సంబంధములు చేసికొనవచ్చును. కాని తమభాగములోనివారు తమకు సోదరసమానులు కాన వివాహములకు తగరు. ఒకయువకుడు వివాహము చేసికొనగోరినయెడల తన తలిదండ్రులతోను, గ్రామపెద్దతోను చెప్పి యడవులకుపోయి దాగియుండునట. ఇట్లు దాగుటవలన దుష్టగ్రహబాధ యుండదట. వధూవరుల తలిదండ్రులు కన్యాశుల్కము మొదలగు నంశములను గూర్చి బేరములు సాగించి ముగించి ముహూర్తమును నిర్ణయించుకొందురు పిమ్మట వధువును తా మివ్వవలసిన కట్నములతో వరునింటికి గొనిపోయి వరుడులేకనే యచ్చట విందులు, నాట్యములు జరుపుకొని, వధువును అచ్చటనే వదలి స్వగృహమునకు పోవుదురు. తర్వాత వరుని తలిదండ్రులు అడవులలో దాగియుండు తమ కుమారుని నడికి తెచ్చెదరు.

లోకములో సాధారణముగా కన్యాన్వేషణ బాధ్యత పురుషునిదిగానుండ మలనేషియాలో కొన్నిదీవులయందు స్త్రీ తన వరుని కోరుకొనవలెను. 'న్యూబ్రిటన్' లో సులాంక్ జాతివారిలో స్త్రీ తన మగని గోరుకొని తలిదండ్రులకు చెప్పును. వారు తమ కుమార్తె కోరిన వరునికి చెప్పి పంపెదరు. వాడు ఇష్టుడైనయెడల వెంటనే కన్యయింటికి వచ్చును. కన్య వానిని ద్వారమువద్ద నెదుర్కొని భక్ష్యముల నిచ్చి మెడకొక యాభరణమును వేయును. ఇది నిశ్చితార్థ మనిపించుకొనును. పిమ్మట నొకరికొకరు తక్కిన కట్నముల నిచ్చుకొందురు. ఈకట్నము ఉభయుల తలిదండ్రులకు చేరునే గాని వధూవరులదికాదు. అంత వరుడు వధువునింటనే యుండి యామె కుటుంబమునకు సహాయముగ పనిచేయుచుండును. ఈకాలమున వధూవరుల భావిజీవనోపాధికిగాను ఒకతోట నేర్పరుతురు. ఇది ముగియగనే వివాహ ముహూర్తము నిశ్చయింతురు. ముహూర్తము నిశ్చయించునాడే పరిసరగ్రామములవారికి విందు జరుగును. ముహూర్తము నిశ్చయముచేసిన దినమునుండి ముహూర్త దినమువరకు కన్య సన్యాసినివలె నుండవలెను.

ఆమెను వరునింటి పెరటిభాగమున నొకగుహయందుంచి, తోడుగా నామెతో బుట్టువునుగాని, ఇతరచుట్టమునుగాని ఒక బాలికను పంపుదురు. వధువు స్వయముగ నేపనిని చేయరాదు. తోడుబాలికయే ఆమెకు గాను అన్నము వండి ఆమెనోట అన్నము కలిపిపెట్టుచుండును. ఆమె పురుషుల కంటబడరాదు. ఒక వేళ బయటి కెచ్చటికైన పోవలసిన యెడల చాపలతో నామెదేహము నెల్లకప్పి కొని దారి పోవుచునను పురుషులకు తన రాకను తెలుపుటకై యీలకొట్టుచుబోవును. ఈయజ్ఞాతవాస కాలముననే పచ్చపొడుచుట జరుగును. దీనికగు ఖర్చువరుడు భరించవలెను. ఈ కాలమున వరుడు తన కొక యింటిని కట్టుకొనును. ఈపనులు పూర్తియయినతర్వాత మహూర్తదినమున విందులు, నృత్యగీతములతో వివాహము జరుగును.

'న్యూహిబ్రిడీసు' లో 'అంబ్రిము' నందు బాలికలు నడువనేర్చు వయసుననే పందులకు బదులుగా అమ్మబడుదురు. ఒకబాలికకు ౫—౬ పందులు తగిన విలువ. ఆమె పుట్టినింటనే ౮—౧౦ సంవత్సరములవఱకుండి తర్వాత తన్ను కొన్నవారింటికి పంపబడును. ఒకవేళ బాలిక యిష్టపడనియెడల నామెను కొట్టి తిట్టి పంపుదురు.

ఇచ్చట వివాహములు వ్యాపారమువలె జరుగును. నాగరిక దేశము లనిపించుకొను దేశములందే వరశుల్కము కన్యాశుల్కము అను వ్యాపారధర్మములు వెలయుచుండ అనాగరికులలో నిట్టియాచార ముండుట వింతకాదు.

కొన్నిచోటులలో కన్యలను పందులకు బదులుగా నిచ్చెదరు. 'లాయల్టీ' ద్వీపవాసులు పడవలు కట్టుటలో నేర్పరులు. కాని వారి దేశమున కావలసిన కలప దొరకదు. ఈకలపను 'న్యూ కెలడోనియా' లో నుండి తేవలెను.



చిత్రము ౭
ఫిజీబాలిక కుడిభుజముపై క్రేలాడు వెండ్రుకల కుచ్చులు, అవివాహిత యనుటకు గుర్తు. వివాహమయిన వెంటనే యివి కత్తిరించబడును.

న్యూకెలడోనియావారికి లాయల్టీద్వీపస్త్రీలు అందకత్తె లని వారిని వివాహమాడ గోరిక కలిగియుందురు. అందువలన లాయల్టీద్వీపస్త్రీలను, న్యూకెలడోనియా కలపకు బదులుగా నమ్ముచుండువారు. క్రైస్తవప్రచారకులవలన నాగరికతవ్యాపించుకొలది విద్యావంతులగు వారిలో నీక్రయవిక్రయములు తగ్గిపోవుచున్నవి. మిక్కిలి భాగ్యవంతులు తప్ప, మఱెవరును అనేకభార్యావంతులగుట కిష్టపడరు.

(సశేషము)

# నక్షత్రమండలము

గొబ్బూరు వేంకటానంద రాఘవరావు

(ధాత సంవత్సర చైత్రమాసము, వైశాఖమాసము)

ఉత్తరము

తూర్పు




పడమర

దక్షిణము

[ఈపటమును తలమీదుగా పట్టుకొని ఆయాదిక్కులు సరిగా చూచుకొని పరిశీలింపవలెను. ఇందున్నట్లు 1936 ఏప్రిల్ 8 తేదీని రాత్రి 8-55 గంటలకును, ఏప్రిల్ 15 తేదీని రాత్రి 8-27 గంటలకును
,, 22 ,, ,, 7-59 ,, ,, 29 ,, ,, 7-31 ,,
మే నెల 6 ,, ,, 7-3 ,,
నక్షత్రాదులు కనబడును.]

Behold you a zure dome, the sapphire sky
Rear in unpilloried might, its canopy
That vast pavilion, gemmed with worlds of light
Whose circling glories boast a boundless flight
And as they roll, survey man's chequend state
And scan the destinies of mortal folk."

అదుగో! తలయెత్తి పరికించిచూడుము! ఆ వినీలాకాశము గొప్ప గుబ్బగోడుగువలె నలువంకలను ఎట్లు వంగి వ్యాపించియున్నదో! ఇంద్రనీల రుచులతో భూ రంగముపై చక్కగా నిర్మింపబడిన ఉల్లాభమువలె ఉప్పరము నిరాధారమహిమతో నిలిచి వింత గొలుపు చున్నది! అందు పొదిగిన ముత్యములవలెను, చక్కగా కూర్చిన రత్నములవలెను నక్షత్రములు మహనీయ తేజో విరాజమానములై భూమండలమునకు ప్రదక్షిణము చేయు చున్నవి. అ ట్లంబరతలమున చరించుచు నా తేజో మూర్తులు ఈ యిహలోకమున జీవయాత్రల సాగించు మానవకోటుల వివిధావస్థలను వీక్షించుచు వారివారి యోగములనుగూర్చి పర్యాలోచనము సల్పుచున్నవి!

ఈ ధాతృసంవత్సర చైత్ర బహుళ విదియ మొదలు వైశాఖ బహుళ విదియ (౧-౪-3౬ నుండి ౧-౫-3౬)వరకును నప మాసములలో రాత్రి తొలిజామున నగపడు ఖగోళదృశ్యములను పరిశీలింతము.

## పా లు వె ల్లి

## (Milky Way)

లోకేశ్వరుని శాశ్వత నివాసమునకు మార్గము (The way to God's eternal home) అని ఓవిడ్ కవీశ్వరునిచేతను, 'తీన్ హో' (Tien Ho) 'స్వర్గాపగ' అని చీనావారిచేతను ఆకాశగంగ-పాలసముద్రము అని మనవారిచేతను బహువిధముల వర్ణింపబడుచున్న యీ ధవళదృశ్యము ఈమాసమునందు రాత్రి తొలిజామున దక్షిణక్షితిజమునుండి బయలుదేరి, దిక్చక్రమునకు సమాంతరముగా పోవుచు, వాయవ్యక్షితిజమున నదృశ్యమగు చున్నది. దక్షిణమున త్రిశంకుమండలముకడ కొంచెము వెడల్పు కలిగినట్లున్నను అటుపై నది సన్నగిల్లుచు, అచ్చటచ్చట విశాలము నొందినను అటుపై నావెంటనే సన్నమగుచు వాయవ్యక్షితిజముకడ మరల విశాలముగా నగపడుచున్నది. దక్షిణమున త్రిశంకుమండలముకడ ప్రారంభమై, నౌకామండలము మీదుగా వాసుకిని, మందరగిరిని దాటి, శ్వాన పూర్వశ్వానములమధ్య పడి, వృత్రమండలము నంటుచు సారథి, భృంపరసుమండల ములమీదుగా, కల్పవృక్షపునీడల విహరించు నప్సరస లతో వాయవ్యదిశ నీపాలవెల్లి మనదృష్టిపథమును దాటి పోవుచున్నది. స్వర్గలోకమునుగూర్చి పోవువారి కిది బాటయనియు, ఈదేవమార్గమున పోవువారికి వెలుతురు కలిగించుటకు దీపస్తంభములవలె నక్షత్రములను దీక్య జ్యోతు లిరుప్రక్కలను ప్రతిష్ఠింపబడినవనియు 'హయు వాదా' అను గ్రంథమున గలదు.

## తేజోవిషయమున నగ్రగణ్యములైన నక్షత్రములు

## (First Magnitude Stars)

ఈమాసములలో రాత్రి తొలిజామున తేజోవిష యమున నగ్రగణ్యములైన నక్షత్రము లిరువదింటిలో పదునొకండు మనకు కానవచ్చుచున్నవి. అవి యేవి యనగా :

౧ పడమట నస్తమింపనై యున్న రోహిణి (Aldebaran)

౨. ఆర్ద్ర (Betelgeax)

3. రిగెల్ (Rigel in Orion)

౪. మృగవ్యాధుడు (Sirius)

౫. అగస్త్యుడు (Canopus)

ఈ యైదును పాలవెల్లికిని, పశ్చిమక్షితిజమునకును మధ్యనున్నవి.

పాలవెల్లికిని, యామ్యోత్తరరేఖకును మధ్య

౬. (బ్రహ్మహృదయము Capella in Auriga)

౭. సాంబమూర్తి (Pollux)

౮. పూర్వశ్వానము (**Procyon in Gemini**)

౯. గగనమధ్యరేఖపై మఘ(**Regulus in Leo**)

౧౦. చిత్ర.

౧౧. స్వాతి. (**Spica & Arcturus**) తూర్పున తోరణస్తంభములవలె ఉదయించి మెఱయుచున్నవి.

### పడమట

వాయవ్యదిశను కల్పవృక్షపు నీడలను విహరించుచున్న అప్సరసలు కొందర స్తమించినారు. ఇక కొందరు అస్తమింపనై యున్నారు. పాలవెల్లికిని వాయవ్యక్షితిజమునకును మధ్య పులోమరక్కసుడు గ్రుడ్లు మిటకరించుకొనుచు నదృశ్యుడగుచున్నాడు. జ్యోతిర్లత పూచిన కొలవిపువ్వులవలె కృత్తికచుక్కలు మెఱయుచు నభోరంగమునుండి నిష్క్రమించుట కాయత్తపడుచున్నవి. వింటి కెనువగా ఎద్దుకన్నువలె మెఱయుచు రోహిణి కూడ కృత్తికలమార్గము ననుసరించుచున్నది. పిల్లలకోడి యనబడు కృత్తికల కెనువ నుత్తరముగా భార్గవులు-అగ్నికార్య ధురంధరులు-మెఱయుచున్నారు. రోహిణి కెనువ పాలవెల్లికడ పగడమువలె ఎఱ్ఱని కాంతితో ఆరుద్రయు, ఆరుద్ర కెదురుగ పడమట పరివృత్తయు (Bellatrix) మెఱయుచుండుట గమనింపవలయును. ఈ నక్షత్రములకు దిగువ ఒరయన్ యోధుని పటకా చుక్కలు మూడును, వాటినుండి వ్రేలు ఖడ్గమును చూడదగును. ఆదిగువనే వానిపాదములు రెండును కలవు. ఎడమపాదమైన రీగల్ చుక్క సమీపమందే యమున జనించినట్లు కనబడుచున్నది. ఒరయన్ యోధుని పాదముల దిగువనే పిఱికి చెవులపిల్లి చూడనగును.

### దక్షిణాకాశమున

శశకము దిగువ నైరృతిదిశను కపోతమును, ఆ దిగువ అగస్త్యుడను మెఱయుచున్నారు. శివభక్తుడగు అగస్త్యుడు మృగవ్యాధరుద్రుని దిగువ నిలిచి ఆరుద్రుని సేవించుచున్నట్లు కనబడుచు అద్భుతతేజముతో మెరయుచున్నాడు. దక్షిణాకాశమున నిప్పుడు సగమునకు పైగా నాక్రమించుకొనియున్న దేవనౌకయొక్క అమరభాగము-అనగా వెనుక తట్టున చుక్కానికడ నిలిచినట్లున్నాడు అగస్త్యుడు. ఈనౌకయొక్క పృష్ఠభాగము (**Carina or keel**), తెరచాపలు (**sail**) స్తంభము (**Mast**) మొదలగు వివిధభాగములు ఇపుడు చక్కగా కనపడుచున్నవి. నౌకామండలమున కీవల ఆగ్నేయభాగమున త్రిశంకు,అశ్వతరమండలములు కొంత కొంత కనపడుచున్నవి.

### ఉత్తరాకాశమున

చిన్న ఎలుగులో ధాత, విధాత చుక్కలు ఆగ్నేయమునకు వ్రాలి కనబడుచున్నవి. వీటి కెదురుగా మిత్ర, అగ్నినక్షత్రము లున్నవి. ఎలుగతోకలో అగ్ని మొదటిది. తరువాత మహేంద్ర, కశ్యపులును, తోకచివర ధ్రువుడును ఉన్నారు. ఊర్వశీ పురూరవసు చుక్కలలో 2, 3 మాత్రము ఇపుడు కనబడుచున్నవి. ధ్రువక్షితి కీవల సప్తఋషులు గగనమధ్యరేఖను సమీపించుచున్నారు. ఇందు పులహక్రతు రేఖ ధ్రువుని చూపుచున్నది. పులహునకు తూర్పుగా పులస్త్యుడును, పులస్త్యున కీశాన్యదిశను అత్రియు నున్నారు. ఈనలువురు ఒక చతురస్రముగా నేర్పడినారు. శకటమునకు కాడిమొనయందువలె తూర్పుకొనను మరీచియు, మరీచికి వాయవ్యమున వసిష్ఠుడును అరుంధతియును, వసిష్ఠ, అత్రిఋషులకుమధ్య అంగీరసుడును కలరు. వీరే బృహదృక్షము. ఋక్షముల రెండింటికి మధ్యను మెలికలు తిరుగుచు నరకాసురుడు కలడు. పులహక్రతు ఋషుల కీవల, గగనమధ్యరేఖను దాటి, లంబోదరముతోను, ఏనుగ తొండముతోను మూషకవాహనుడైన విఘ్నేశ్వరుడు రమ్యముగా కానవచ్చుచున్నాడు.

### తూర్పున

తులాలచక్రమువలె విశాఖ బాగుగా ఉదయించినది. వేదవాఙ్మయములో దీనికి రాధ అని పేరు. శేషునిలో కొలదిభాగముమాత్రమే కనబడుచున్నది. శేషుని కీవల భూతేశమండలములో స్వాతి పగడమువలె ఎఱ్ఱగ మెఱయుచు ఆశ్చర్యము కలిగించుచున్నది.

### మధ్యను

పాలవెల్లికిని విఘ్నేశ్వరునికిని మధ్య సారథి మండలము చక్కగా మెరయుచున్నది. అందునుబ్రహ్మ

హృదయము వెన్నముద్దవలె ధవళమై ప్రకాశించుచు కనులపండువు చేయుచున్నది. సారథి మండలమును అందు బ్రహ్మహృదయమును కనుగొనినపుడు ఋగ్వేదములోనున్న "అపామర్థం యతీనాం బ్రహ్మభవతి సారథిః" అను ఋక్కు జ్ఞప్తికి రాగలదు.

ఆదిగువ, గగనమధ్యరేఖకును పాలవెల్లికిని మధ్యగా (మహామీనమ్) గొప్పచేపవంటి ఆకారముతో పునర్వసు మెఱయుచున్నది. క్రాంతిరేఖ పునర్వసుమీదుగా పోవుట గమనించవలయును. అనగా, చంద్రుడును, బుధ, కుజ, గురు, శుక్ర, శని గ్రహములును క్రాంతిరేఖయను నీబాట మీదుగానే పోవుచుందురు. ముఖ్యముగా చంద్రుడు పునర్వసులో నున్నపుడు చూచుట కెంతో రమ్యముగా యుండును. ఒకప్రక్క సాంబమూర్తి (Pollux) యు, రెండవప్రక్క పూర్వశ్వానమను (Procyon) అత్యంతమైన తేజముతో ప్రకాశించుచుందురు; మధ్య చంద్రుడుండుట ఇంకను సంతోషాశ్చర్యకారణమగును శ్రీమద్రామాయణములో వాల్మీకి ఈదృశ్యమును పలుతావులయందు వర్ణించియున్నాడు. చూ. యుద్ధ. ౬౭-౧౫౭, ౧౫౮.

నాశాశగతమైన కుంభకర్ణుని శిరస్సు రాత్రి ఉదయించిన పునర్వసుచుక్కలమధ్య చంద్రునివలె ప్రకాశించెను.

ఇట్లే యుద్ధ. ౭౧-౨౮ లో వానరసేనపై పరతెంచు అతికాయుని శిరస్సును వర్ణింపబడినది.

కుణ్డలాభ్యాంతు యస్యైత ద్భాతి వక్త్రం శుభేక్షణమ్, పునర్వస్వన్తరగతం పూర్ణం బిమ్బ మివైన్దవమ్.

ఇట్లు రమ్యమైన పునర్వసునకును గగనమధ్యరేఖకును నడుమధ్య, కర్కటకరాశిలో పొట్లపూవువలె పుష్యమి ఉన్నది. ఆదిగువను సర్పాకారమై సర్పదైవత్యమైన ఆశ్రేష కలదు.

దానికనువ ఇంచుమించుగా గగనమధ్యరేఖపై మఘ - సింహరాశిలో సింహము కంఠమునుండి వ్రేలు మణిలాగున ప్రకాశించుచున్నది మఘదిగువ గ్రావములును, చమసపాత్రయు కలవు. గ్రావముల యొత్తిడిచే నెడలు సోమరసము చమసపాత్ర నలంకరించి దేవతలకు పానీయమగుచున్నది. ఆదిగువనే అహి, నహుషమండలము లున్నవి. మఘకీవల, పూర్వఫల్గునీ, ఉత్తరఫల్గునీ నక్షత్రములు ముత్యములవలె మిలమిలలాడుచున్నవి. వాటి









(సప్తర్షులు)

కుంభకర్ణశిరో భాతి కుణ్డలాలంకృతం మహత్,
ఆదిత్యేఽభ్యుదితే రాత్రౌ మధ్యస్థ ఇవచన్ద్రమాః.

అదితి దైవత్యమైనవి పునర్వసు నక్షత్రములు, రెండుకుండలములచే నలంకృతమై ఖండన వేగమున

కీవల సవితృదేవతాకమై ఐదువ్రేళ్లతోకూడిన అరచేయి వంటి యాకారముతో హస్త ఉన్నది. ఆదిగువ క్రాంతిరేఖ నంటుచు చిత్ర కలదు. చిత్రా, చమసములకు మధ్య వార్తికపుపక్షి కలదు. కన్యయొక్క జట ముడి

వేయుచు భీముడు (స్వాతి) వేణీసంహారనాటక మాడు చున్నట్లు స్ఫురించుచున్నది.

## సప్తఋషులు

ఈప్రక్క పటములో నాలుగు చిత్రములు చూడ నగును. అందు ౧ లక్షసంవత్సరములక్రింద సప్తఋషులు భూమిమీదివారికి కనబడినరూపము వ్యక్తము చేయు చున్నది. ౨. ఇపుడు సప్తఋషులు మన కగపడుచున్న విధము, ౩. ఇటుపై లక్షసంవత్సరములకు భూమిమీది వారికి సప్తఋషిమండలము కనబడువిధము విదితము చేయుచున్నది. ౪. వ చిత్రమునందు ఒకొక్క నక్షత్రము ఏదిశకు పోవుచున్నదో అలుగుమొనవలన స్పష్టము కాగలదు. క్రతువును, మరీచియు ఒకప్రక్కకు పోవు చున్నట్లును, వారి కెదురుగా పులహ, పులస్త్య, అత్రి, అంగీరస, వసిష్ఠులు పోవుచున్నట్లును స్పష్టము. పులస్త్యను కొంచెము భిన్నమార్గమున వెడలుచున్నట్లు పరిశీలించగా తెలియగలదు.



కొచ్చిదేశమున చేపలుపట్టు సాధనము A. A.





శ్రీ మాధవపెద్ది గోపాలకృష్ణ గోఖలేగారికి మదరాసు లలితకళాప్రదర్శనమున జస్టిసు బరన్స్‌గారిచే యొసంగబడిన ప్రథమ బహుమతి

పోగానే రంగడు కూడా మెల్లిగా లోపలికి జారాడు; వంటయింటిగుండా పోవాలంటే మేడకీ, ప్రహారీగోడకీ మధ్యనున్న తోటలోంచి పోవాలి. దిక్కులు చూస్తూ, బెదురుతూ రంగడు తోటలోకి ప్రవేశించాడు. తోటలోని మొక్కలికి నీళ్లకోసం. మోటబావి త్రవ్వించాడు రంగయ్యనాయుడు, ఆ మోటబావి దగ్గరికెళ్ళి, నారింజచెట్టు దగ్గిర నిలుచున్నాడు రంగడు ఆలోచిస్తూ. ఇంతలో రంగయ్యనాయుడికొడుకు జిలేబీపొట్లం చేత్తో పట్టుకొని, కొంచెముకొంచెము తినుకుంటూ బావిసమీపంగా వస్తున్నాడు. వాడిలివెనక్కి కుర్రాడిచేతుల్లో పొట్లం రంగడికి నోట్లో నీళ్లూరించింది. ఆపొట్లం లాక్కొని ఒక్క పరుగున బజారులోనికి పరుగెత్తాలని ఆలోచిస్తున్నాడు రంగడు. దానికి అనుకూలంగానే కుర్రాడు బైలుకి వెళ్లవలసివచ్చినట్లో ఏమో, పొట్లం ఒకచెట్టుక్రింద పెట్టి, లాగుబొత్తాములు రెండుచేతులతోనూ తీసుకుంటూ, యింకో చెట్టుచాటుకి వెళ్లాడు. వీలుచిక్కగానే, ఆపొట్లాన్ని లంకించుకొని, ఒక్కపరుగుతీశాడు రంగడు.

౫

'దొంగ, దొంగ; పట్టుకో పట్టుకో' అని కేకలు వేస్తూ, రంగడివెనుక పరుగెత్తుతున్నాడు రంగయ్యనాయుడి బంట్రోతు. గబగబ పరుగెత్తుతూ, తోటలోనుంచి బయటికి పరుగెత్తుతున్న రంగడిని చూసి, అప్పుడే అన్నముతిని చెయ్యికడుక్కొంటూవున్న బంట్రోతుకు అనుమానంవేసింది. చేతులోవున్న చెంబు అక్కడేపడవేసి, రంగడి వెనక పరుగు ఆరంభించాడతను. చావుబ్రతుకులు తెలియని ముందు పరుగెత్తుతున్నాడు రంగడు. 'దొంగ, దొంగ, పట్టుకో, పట్టుకో' అని కేకలువేస్తూ పరుగెత్తుతున్నాడు బంట్రోతు. వాడు వేసే కేకలకు బజారంతా వొక్కసారి వులిక్కిపడ్డది. 'దొంగ' అనడంతోటే ప్రతిమానవునికీ గూడా ఒకవిధమైన రేవగింపు. పరుగెత్తుతూవున్న దొంగని పట్టుకుందుకు తయారయే మొగాళ్లు తక్కువగా వున్నా, దొరికిన దొంగని తన్నటానికి అంతా మొనగాళ్లే. దొరకని దొంగకూడా 'సిగపనిచెయ్యకపోతే బ్రతకలేవురా' అంటూ గొక కుమ్ము కుమ్ముతాడు దొరికినదొంగని.

'దొంగ, దొంగ, పట్టుకో పట్టుకో' అని బంట్రోతు రంగడివెనకాల కేకలువేస్తూ పరుగెత్తడం బజారులోవాళ్ళందరి నరాలనీ వొక్కపెట్టున కంపింపజేసింది. కిళ్లీకొట్టువాడు తనదుకాణమువదిలి పరుగుఆరంభించాడు దొంగను పట్టుకోడానికి. సుబ్రబ్బండి సాయెబు బండిని అక్కడేవదిలి పరుగెత్తాడు దొంగను పట్టుకోడానికి. మిఠాయిఅంగడివద్ద శేరు మిఠాయికొని పొట్లం తనచేతులో వుంచుకొని, డబ్బులకోసం జేబులో చెయ్యిబెట్టిన ఒకఆసామీ, చెయ్యిజేబులోనే వుంచి పరుగెత్తాడు దొంగను పట్టుకోడానికే కాబోలు. అవకాశమున్నవాళ్లెల్లా పరుగెత్తారు దొంగనుపట్టుకోడానికి.

'దొంగ' అనగానే హడలిపోయినవాళ్లున్నారు. 'బేరానికి వచ్చినవాళ్లలో వున్నాడేమో ఆదొంగ' అని చిల్లరదుకాణపుకోమటి రెండుమూడు నిముషాలు బేరగాళ్లనుచూస్తూ కూచున్నాడు నిలువుగ్రుడ్లేసుకొని. అప్పుడే భోజనముచేసి బయటికివచ్చిన శాస్త్రిలుగారొకరు ఘడేలుమని వీధితలుపేసుకొని యింట్లోకిపోయినారు. కాఫీహోటలుఅయ్యరుతోటి సరసమాడుతూ నిలుచున్న గొల్లచాన తనమెళ్లో పుస్తెలను కుడిచేత్తో గట్టిగాపట్టుకొని పక్కకుతొలిగింది.

ఒకటెండొకడుకలసి పాతికమంది పోగై తరుముతున్నారు. అందరికేకలకి రోడ్డంతా ప్రతిధ్వనిస్తూంది. వెనక్కితిరిగిచూడకుండా, ప్రాణాలు అరచేతులో పట్టుకొని, చావుబ్రతుకులు తెలియకుండా పరుగెత్తుతున్నప్పటికీ, చేతిలోపొట్లంమాత్రం విడిచిపెట్టలేదు రంగడు. ఎద్దులలాంటివాళ్లు తరుముకొనివస్తుంటే, ఎంతదూరము దాటపోగలడు కుర్రవెధవ! వెనక్కు తిరిగి చూశాడు. గుండెలు అదిరాయి. కాలికి రాయితగిలి 'దభ్బ'మని క్రింద పడ్డాడు కంకరరోడ్డుమీద. చేతిలోవున్న పొట్లం క్రింద బడి, జిలేబీ రోడ్డుమీద చెల్లాచెదురై పోయింది. బోర్లపడినందుచేత మొహం చెక్కలుపోయింది. రంగడిరక్తం చిమ్మింది కొంచెం. తిండిలేక యెండి కట్టె అయిన ఆశరీరములోంచి ధారగా కారేటంత రక్తమువుంటేగా. నేలమీదపడ్డంతోటే వాడికి స్పృహతప్పి పోయినది. వెనకనుంచి తరుముతూవస్తూవున్న మూక అంతా ఆగింది.

నాయుడి రొక్క కుపుత్రుడిని చంపినవాడిమీద ఆవూళ్ళో యెవరికైనా కనికారముంటుందా. 'ఎంతదుర్మార్గము! ఏ, వమిఠాయిపొట్లంకోసం ఒక్క పంలాంటి పిల్లాడిని వాడెక కడుపున పెట్టుకున్నాడు' అన్న అందరు ప్రజలతో పాటూ, రిక్షేపంలాంటి పిల్లాడిని తన కడుపున పెట్టుకున్న వ్యక్తి కూడా అన్నాడు. అవును! దొరికినదాకా దొంగమాత్రం

దొరకాడుగా? 'మిఠాయిపొట్లం తీసుకొని పరుగెత్తుతుంటే చూసేను నేనుడుగడు' అంటాడు రంగడు. పోలీసువాళ్లు అడిగినా అదేచెప్పాడు. సబుమేజస్ట్రేటుకోర్టులో విచారణకి అదే చెప్పాడు. నిజానికి వాడు అంతకన్న ఏమెరుగడు! కాని లోకం వాడిమాట నమ్మలా. సెషన్సుకోర్టుకు పంపించాడు సబుమేజస్ట్రేటు. సెషన్సుకోర్టులో మాత్రం రంగడితరపున వాదించడానికి గవర్నమెంటువారే వొక వకీల్ని యేర్పాటుచేశారు.

'రంగడే యీపని చేసివుంటే పిల్లాడి మెళ్ళోవున్న గొలుసు మాటేమిటి?' అన్నాడు రంగడిప్లీడరు

'పొట్లం లాక్కొని కుర్రాణ్ణి బావిలోకి తోసి వుంటాడు. మెళ్ళో గొలుసు బావిలో పడివుంటుంది. అంటాడు పబ్లిక్ ప్రాసిక్యూటరు

'ఇలు వెతికిపోకుండా వుండేటందుకోసం కుర్రాడి చేతులకు గాని గుడ్డల్లోను రికార్డు చెయ్యలేదు పోలీసు వారు. 'తోటలోనుంచి పరుగెత్తుతుంటే చూసే నేను పట్టుకున్నాను' అంటాడు బంట్రోతు.

'పగవాడి వాడియింట్లోకి యింకెవరూ రాలేదు' అంటారు ఒకరిద్దరు రంగయ్యనాయుడికి బంధువులు.

'ఇంక, పిల్లాడిని ఎవరు చంపినట్లు?' అని సవాలు చేశాడు పబ్లిక్ ప్రాసిక్యూటరు

'సాక్ష్యము బలంగాలేదు' అని సెషన్సుజడ్జి వాదములు, విచారణలు, క్రాసులు, అన్నీ అన్ని కేసులలోలాగనే సక్రమముగా జరిగాయి.

... ప్రత్యక్షసాక్ష్యము లేదు. తాత్కాలికసాక్ష్యము మీద ఆధారపడి శిక్షచెప్పాలి జడ్జి.

'నిందితుడు మంచిచెడ్డలను తెలిసికొనునంత మనోవికాసతలేని బాలుడైనందున, నిందితుని ఐదు సంవత్సరములు బోర్ స్టలుస్కూలునందుంచుటకు తీర్పు చెప్పుచున్నాను' అని తేలాడు సెషన్సుజడ్జి. శిక్ష చాలా వరకు తగ్గినందుకు రంగడి ప్లీడరూ, అసలు కేసు పోనందుకు పబ్లిక్ ప్రాసిక్యూటరూ సంతోషించారు.

రంగయ్యనాయుడికిమాత్రం మతిభ్రమణ కలిగింది. ప్రపంచ మతనికి అసహ్యమైపోయింది. రంగడికి శిక్షవేసినావొకటే, వెయ్యకపోయినావొకటే రంగయ్యనాయుడికి. బంట్రోతుమాత్రం రంగడికి శిక్షచెప్పేటంత వరకూ ఒక్కరాత్రి కూడా సరిగా నిద్రపోలేదు. 'ఇలాంటి తెలివితక్కువ జడ్జీలువుంటే న్యాయమెలా తేసులద్తుంది' అన్నాడు మహా విసుగుతో. తనలాంటి తెలివితక్కువ బంట్రోతును పెట్టుకొన్నందుకే రంగయ్యనాయుడికి కొంపమాలిందని తెలియదు వాడికి. కాని నిజంగా, ఆఖూనీచేసిన వ్యక్తిమాత్రం ఒకరిద్దరు సంగాతికాండ్లదగ్గర 'అలాంటి వెధవనొకర్లని పెట్టుకోకూడదు' అన్నాడు విశ్వాసమేనా లేకుండా.

౨

బోర్ స్టలుస్కూలులోకి వెళ్ళిన రంగడికి యిదంతా ఒకమాయలాగకనిపించింది. సబ్ జైళ్లలోవున్నప్పుడు కొంచెంకష్టమనిపించిందికాని, బోర్ స్టలుస్కూలులోమాత్రం అంతా తనయీడుపిల్లలే అవటంచేత ఆటల్లోనూ, పాటల్లోనూ గడిపేవాడు కొంతకాలాన్ని. పనిచేసినప్పుడు పనేచేసేవాడు. ఆడినప్పుడు ఆడేవాడు. రోజూ పాఠాలు మాత్రం తప్పకుండా వల్లించేవాడు. తోటి బాలురందరిలోకి మెఱుగనిపించాడు. సూపర్నెంటుకి దయగలిగేటట్టు ప్రవర్తించేవాడు.

తండ్రి నల్లనివాడైనా, రంగడితల్లిది మాత్రం బంగారంలాంటి ఛాయ. రంగడుకూడా తల్లినిపోలి పుట్టాడు. బోర్ స్టలుస్కూలులోకి వచ్చినతరువాత కడుపునిండా దిగులులేని కూడు దొరకడంచేత, రక్తం బాగా వృద్ధయింది. నిగనిగలాడుతూ చక్కగా తయారయ్యాడు. వాడి చక్కదనమూ, మంచినడతా చూసి, దొర రంగడిమీద అమితప్రేమతో వుండేవాడు. తన అనుమానం

తీర్చుకుంటుకు రంగడిని చాలాసార్లు తనదగ్గిరకు పిలిపించి 'నువ్వు ఆమ్రోల్లి బావిలో పడేశావా!' అని అడిగేవాడు. వెక్కి వెక్కి యేడుస్తూ రంగడు 'నేనెరుగనండి దొరగారూ. ఆ పొట్లంమాత్రం తీసుకొని పరుగెత్తేనండి' అనేవాడు. దొరమాత్రం ఆగూటనమ్మి, వాడికళ్లు తుడుచుకోమని, నానుగొట్టె కొరుకిటి తెప్పించి యిచ్చేవాడు. రంగడికళ్లల్లో నేవుండే 'నేనంత పెద్ద నేరం చెయ్యగలవాణ్ణికాను సుమా' అనే భావాన్ని వెలువరించే తేజస్సు.

ఆస్కూలులో వృత్తిపనులు అన్నీ నేర్పుతారు. న్యాయమైన జీవితాన్ని అలవరించుకోవడానికి అనుకూలమైన పద్ధతులు అన్నీ బోధపరచి, తక్కిన పురజనులందరిలోనూ ఒకడివికమ్మని ఆశీర్వదించి పంపిస్తారు, శిక్షాపరిమితి తీరిన పిల్లల్ని ఆస్కూలుపాలకులు. ఈ స్కూలులో తర్ఫీదు అయినవాళ్లకి చాలామట్టుకు సర్కారుకొల్వగాలే దొరుకుతాయి; బాల్యములో చేసిన నేరమేగనుక, శిక్షపడ్డప్పటికీ యీస్కూలులో నడత బాగున్నదని సూపర్నెంటు యోగ్యతాపత్రిక యిస్తే చాలు.

రంగడికివున్న తెలివితేటలు చూసి అభివృద్ధిలోనికి రాగల కుర్రవాడని చదువుచెప్పించాడు సూపర్నెంటుదొర. తెలుగూ, యింగ్లీషూ రెండూ ఒకే కాలములో ఆరంభించాడు రంగడు. బహుశ్రద్ధగా చదివేవాడు.

జడ్జీవేసినశిక్ష ఐదు సంవత్సరాలు అయినప్పటికీ, జైలులో మంచినడతకు కొంతకాలము తగ్గింపబడినది. బోర్స్టలు స్కూలుకు వెళ్లేటప్పటికి రంగడికి పన్నెండో యేడునిండింది. బోర్స్టలుస్కూలునుంచి వదిలిపెట్టబడేటప్పటికి పదునేడో యేడు వెళ్లింది.

మెట్రిక్యులేషన్ పరీక్ష ప్యాసయినట్లు సర్టిఫికెట్టూ, అనుసరణీయమైన నడత కలవాడని సూపర్నెంటుయిచ్చిన యోగ్యతాపత్రమూ రంగడికి ఆధారము. యౌవనములోకి అడుగువేస్తూవున్న వయస్సు రంగడిరూపానికి మెరుగుపెట్టింది. రంగడిమీద అమిత వాత్సల్యము కలిగినదొర జైలునుంచి విముదల పొందేటప్పుడు రంగణ్ణిపిలిచి, 'రంగరావ్! ఇదిగో యీ పాతికరూపాయలు తీసుకో. చెన్నపట్టణములో మా తమ్ముడున్నాడు. తగిన సహాయము చెయ్యమని ఉత్తరము యిస్తాను. తీరికల్లు ఇంకా పైకి చదువుకో' అని చెప్పి ఆ రూపాయలూ, ఆవుత్తరమూ, క్రొత్త చొక్కా, క్రొత్తపంచా యిచ్చి, ఆశీర్వదించి పంపించాడు. తమ్ముడికి యిచ్చిన వుత్తరములో 'యీ కుర్రవానిని క్రైస్తవునిగా నొనర్చిన యెడల ఉత్తమ క్రైస్తవుడగునని నా ఆశయము' అనికూడా వ్రాశాడు. సూపర్నెంటు దొర తమ్ముడు మదరాసులో ఒక కాథలిక్కు ప్రీస్టు.

ఐదు సంవత్సరములు తనకు అన్నమూ, విద్యా యిచ్చిన జైలుస్కూలునుంచి బయటపడేటప్పుడు రంగడు వీడ్కోలు యిస్తూ, కన్నీళ్లు విడవకుండా వుండలేకపోయాడు. అదైతే అతనికి జ్ఞానప్రదాయిని; జీవనప్రదాయిని, **Alma Mater.** పైపరికరాలతో నూతన జీవితాన్వేషియై మద్రాసుకు బయలుదేరాడు రంగడు-రంగరావ్.

౨

మధ్యాహ్నము రెండు గంటలకి మదరాసు పొలిమేరలోని జనసముద్రములో రంగడొకడు. ఆ మహాసముద్రములో యెటుపోవలెనో తెలియక కొంచెం తటపటాయించాడు. సూపర్నెంటుదొరతమ్ముడి యిల్లు నుంగంబాకములో వుంది. అక్కడికిపోయినచో తగిన సలహాలభించును.

చిటపటమని పెద్ద చినుకులతో ఆరంభమైంది, సాయంత్రము నాలుగుగంటలకు, మధ్యాహ్నమునుంచీ కారుమేఘాలతో కప్పబడిన వాన. సరిగ్గా ఆసమయానికి నుంగంబాకములో దొరచెప్పిన చిరునామా పట్టుకొని, యింటినెంబరు చూసుకుంటూ రోడ్డుమీద నడుస్తున్నాడు రంగడు. వాన ఆరంభంకావటము తోటే కట్టుకున్న బట్టలు తడిసిపోతాయని ఎదురుగుండా కనిపించిన పెద్దమేడఅరుగుమీద నుంచుని వానవెలిసేదాకా ఆగి పోవచ్చునని ఒక్క పరుగుదీశాడు ఆమేడలోకి.

ఎత్తయిన ప్రహారీగోడమధ్యవున్న దా మేడ, ఆరోడ్డుమీది అన్ని మేడలలాగే. చుట్టూ పూలమొక్కలూ, అవి

గోముగా పెరిగివున్నాయి ముంచుకొని వస్తున్నావాన్లో గబగబ అరుగుమీదికి పరుగెత్తాడు రంగడు. అరుగుమీద అటూ యిటూ పెట్టామో లేదో 'గాంయి' మంటూ రెండు బొచ్చుకుక్కలు మీద పడ్డాయి. ఒకటి కాలు పట్టుకుంది. రెండోది మొహంపట్టుకొందుకు మీదకి ఎగురుతోంది. 'అమ్మో చచ్చా' అని కేకవేసి క్రిందపడ్డాడు గుండెలుచెదరిన రంగడు.

'ఆఁ, ఆఁ, ఇష్షూ, ఇష్షూ, రాజా, రాణీ' అని కుక్కల్ని పిలుస్తూ, లోపల్నించి పద్నాలుగేళ్ల చక్కని చుక్కలాంటి ఒకపిల్ల పరుగెత్తుకువచ్చింది. ఆమెను చూడగానే తోకలు ఆడిస్తూ, రంగడినివదలిపెట్టి రెండుకుక్కలూ ఆమెదగ్గరికి పోయాయి. క్రిందబడ్డరంగడు స్పృహలో లేడు. కుక్కల అలుపుకే వాడు అదిరిపోయాడు. పైగా కాలిమీద ఒకకుక్క కరిచిందికూడాను.

'ఆరమ్మో, అమ్మో' అంటూ లోపలికివెళ్ళి పని చేసేదానిని తీసుకొచ్చింది ఆ అమ్మాయి.

'కరిచిందండి కాలిమీద' అంది పనిచేసేది. 'అయ్యో, పాపం' అంటూ లోపలికివెళ్ళి, టెలిఫోను తీసి డాక్టరు అంఖానిని వెంటనే రమ్మని, మళ్ళీ రంగడివద్దకు వచ్చింది ఆ అమ్మాయి. ఇంతట్లో ఆ అమ్మాయి చెల్లి, తోటమాలీ కూడా అక్కడకు వచ్చారు. తోటమాలీ, పనిచేసేదీ, యిద్దరూ కలసి మెల్లిగా రంగడిని లేవదీసి నడవలో సోఫామీద పడుకోబెట్టారు. కొంతసేపటికి డాక్టరు అంఖా కూడావచ్చి కాలికికట్టు కట్టి కొంచెం కాఫీయిమ్మనిచెప్పి వెళ్లాడు. డాక్టరు వచ్చేటప్పటికి రంగడికి బాగా తెలివివచ్చింది. నువ్వెవరు అని ఎవరూ రంగడిని అడగలేదు. ఆసోఫామీదే పడుకొనివుండి పోయాడు బహునీరసంగా. అరగంటలో కాఫీ తయారుచేసి తెచ్చియిచ్చింది ఆఅమ్మాయి. గ్లాసు తీసుకొని త్రాగాడు రంగడు. అంతసేపూ రంగడికేసి వింతగా చూస్తూ నిలబడిపోయింది ఆ అమ్మాయి.

౯

రంగడు నాలుగున్నర సంవత్సరాలనించి చూస్తున్న ఆ వేశ్యని తప్ప రెండో ఆడదానిని చూసియెరుగడు. అంతే స్త్రీపురుషులకు అన్యోన్యంగా వుండే ప్రపంచసర్వాన్ని కూడా యెరుగ డన్నమాట. అందం అనేమాటయొక్క నిర్వచనమేమిటో బొత్తిగా వాడికి తెలియదు.

ఆ అమ్మాయిని చూసేటప్పటికి తను యెన్నడూ యెరుగని భావం ప్రవేశించింది వాడి హృదయములో.

ఆమేడ శ్రీపతిరావునాయుడిది. అసలు కాకినాడ అయినప్పటికీ, రంగూనులో చాలకాలము వ్యాపారముచేసి లక్షలకొద్దీ గణించి, ప్రస్తుతము మద్రాసులో ఆమేడకట్టుకొని కాపురమున్నాడు శ్రీపతిరావునాయుడు. ఇప్పుడు పురజన ప్రముఖులందరిలోనూ తనొకడు.

ఆరున్నర అయేటప్పటికి పట్నంలోకి వెళ్ళిన శ్రీపతిరావునాయుడు యింటికివచ్చాడు. సాయంత్రము జరగిన సంగతంతా విన్నాడు. రంగడు పడుకున్న సోఫాకి యెదురుగా కుర్చీవేసుకొని రంగడి చరిత్ర అడిగాడు నల్లపూసంతకూడా దాచకుండా రంగడు తన కథంతా చెప్పాడు. వాడికళ్లు రెండూ నీళ్లుకమ్మాయి. శ్రీపతిరావునాయుడికళ్లుకూడా నీళ్లుకమ్మాయి. తండ్రి కుర్చీవెనకాల, కుర్చీని రెండుచేతులతోటే పట్టుకు నిలుచున్నమణి - ఆ అమ్మాయి - పైటకొంగుతో తనరెండు కళ్లూ తుడుచుకొంది.

రంగడిమాటల్లో వాళ్ళకేమీ అపనమ్మకం తోచలేదు. కులాభిమానము లేనివాడు జగతిలో లేడు. కులస్థుడైన రంగడి కథవిన్న శ్రీపతిరావునాయుడికి రంగడిమీద మహాదయకలిగింది. పుత్రులులేని అతనికి యేమో అనిపించింది. చిన్నప్పుడు విధికృతముచేత కొన్ని చెడ్డ పనులుచేసినా, పెద్దవారైనతరువాత బుద్ధిమంతులు వాటిని మరచిపోతారని శ్రీపతిరావునాయుడి నమ్మకం. మణికి రంగడికథ వినేటప్పటికి, వాడినిజాయితీకీ, ఓర్పుకీ, ఎక్కువగా వాడి చక్కదనానికీ యేమేమో అనిపించింది. ఏవేవో వూహాలు క్రొత్తగా పుట్టాయి.

కాలు బాగా నయమయేదాకా రంగడికి వాళ్లు చేసిన వుపచారాలు అన్నీయిన్నీ కావు. మాయింట్లోనే

వుండి చదువుకో అని రంగణ్ణి కాలేజీలో చేర్పించాడు శ్రీపతిరావునాయుడు.

మణి అప్పుడు నాలుగో ఫారం చదువుతోంది. వారానికి వొకసారైనా సూపర్నెంటు గారికి వుత్తరం రాసేవాడు రంగడు.

తమ్ముడిని చూడటానికి సెలవుతీసికొని నుంగంబాకమువచ్చినదొర నాయుడియింటికికూడా వచ్చి రంగడి అభివృద్ధికి చాలా సంతోషించాడు.

దొరతోటి రంగడివిషయమై యేమేమో చాలా చెప్పుకున్నాడు శ్రీపతిరావునాయుడు మణిని దగ్గర పెట్టుకొని — వాళ్లు మాట్లాడినంతసేపూ ఎర్రబడ్డ చెక్కిళ్లతో మణి తలవంచుకునే వుంది.

౧౮

నాలుగేళ్లు గడిచాయి.

రంగారావుకునూ, మణికీ వివాహము జరిగింది. విందుకువచ్చిన పెద్దలలో సూపర్నెంటు దంపతులు ముఖ్యులు

అదృష్టంకానీ, దురదృష్టంకానీ రావలసినప్పుడు వాటంతట అవే వస్తాయి రానప్పుడు వాటిజాడయినా తెలియదు



పల్లెటూరి సంసారము —టి. కేశవరావు

# వినయాదిత్యుని మాయలూరు శాసనము

మల్లంపల్లి సోమశేఖరశర్మగారు

కొంతకాలముక్రిందట నోసంకాపురస్థులయిన శ్రీయుత మా. వెంకటరెడ్డిగారిద్వారా నాకు రెండు శాసనములు లభించినవి. వాటిని ఎచ్చట ఎట్లు కనిపెట్టినదియు వారు నాకు వ్రాసిన యుత్తరమున నిట్లు తెలిపియున్నారు:

" ఈ శాసనములు మా గ్రామమున కుత్తరమున ఎనిమిది మైళ్లు దూరమున నున్న మాయలూరు అను గ్రామమునుండి నాకు లభించినవి. ఆ గ్రామము నానుకొని పశ్చిమమున ఒక పెద్ద మట్టిదిబ్బ యున్నది. పూర్వమున నది గ్రామముగా నుండెనని చెప్పుదురు. ప్రకృత మది పొలముగా వాడబడుచున్నది. దానిలో నొక రైతు తనచేను దున్నుకొనుచుండగా నొకమట్టికుండలో ఉంకపోసియుంచి దానిలో నీ రాగిరేకులు భద్రపఱుపబడియుండి దొరికినవి. అవి యదృష్టవశమున మా బంధువులమూలమున నారుమాసములక్రిందట నాచేత బడినవి".

వారే మాయలూరునుగురించికూడ నిట్లు వ్రాసినారు:

"మాయలూరు వాతాపిపురమనియు, మాయలపురమనియు, దీనికి రెండుమైళ్ల దూరముననున్న రూపనగుడి యను గ్రామముగలచోట వాతాపి, ఇల్వలులు రూపములు మార్చుకొనుచోటనియు నీ ప్రాంతముల వాడుక. ఈ రెండు గ్రామములకు దక్షిణమువైపున ఒక మైలు సమానదూరములో అత్యద్భుత శిల్పవిరాజితమయిన ఒక పురాతన దుర్గదేవాలయము కలదు. ఇందలి శిల్పచాతుర్యము అసమానము; రీతి చాళుక్యశిల్పమును బోలిన దయియున్నది. దేవాలయము చుట్టును విగ్రహములు మలిచినరాళ్లతోనే కట్టబడియున్నది. ద్వారబంధము లతలతోను, కుబ్జ విగ్రహములతోను చెక్కబడి చక్కని నునుపుగలిగి యిప్పటికిని నిగనిగలాడుచున్నది. ప్రకృత మీ దేవాలయము జీర్ణస్థితియందుండి చూపరకు దుఃఖము కలిగించుచున్నది. ఇది సుమారు వేయిసంవత్సరములనాటిదని వాడుక".

రేకుల త్రుప్పు వదలగొట్టుటకు చేసిన ప్రయత్నములయందు కావచ్చును అచ్చటచ్చట రేకులకు దెబ్బ తగిలి శాసనము కొంతచెడినది. కిలముపట్టినయిట్టి ప్రాతతామ్రశాసనములు దొరకుట సంభవించినప్పుడు శాసనాక్షరములకుగాని, రేకులకుగాని యేవిధమయిన చెఱుపును కలుగకుండ వాటిని పరిశుద్ధముకావింప బ్రయత్నించుట ఆవశ్యకము. అట్లు చేయ సాధ్యముకానినాడు రేకులను దొరకినవిదొరకినట్లే యుంచుట మంచిది. ఈశాసనపు రేకు లితరులచేతిలోబడి పూర్తిగ నాశనముకాకుండ కాపాడినందులకు శ్రీ వెంకటరెడ్డిగారు సంస్తుతి పాత్రులు. వారు పంపినరెండుశాసనములలో నొకదాని నిపుడు ప్రకటించుచున్నాను.

ఈశాసనమున నొక్కొక్కటి ౫ అంగుళములు పొడువును, ౩.౭ అంగుళముల వెడల్పును గలమూడురేకులున్నవి. వీటిని ౩.౯" వ్యాసముగల యొకగుండ్రని కడియమున గూర్చియాకడియపుకొనలను రాజముద్రిక యడుగుభాగమున తాపటముచేసినారు. గుండ్రనగనున్న యీ రాజముద్రిక నడిమికొలత ౧.౨". ఆముద్రికమీద ఎడమవైపునకు ముఖము గల యొకవరాహము ఉబ్బెత్తుగ చెక్కబడియున్నది. నా దగ్గఱకు వచ్చునప్పటికే కడియము కోసియున్నది. రేకుల చివరల కంచుతీర్పు లేకపోవుటనుబట్టియే ఈశాసనము చాల పురాతనపుదని నిశ్చయమగును.

లిపి, భాష:

ఈశాసనలిపి ప్రభవసంవత్సర మార్గశిరమాస భారతియందు ప్రకటితమయిన వినయాదిత్యుని కర్నూలుశాసనలిపిని బోలియున్నది. ఇది క్రీస్తుశక మేడవ శతాబ్దినాటి తెలుగు-కన్నడలిపి. కత్తుమాత్రము వాలుకత్తు,

వాతాపిచళుక్యశాసనములలో గొన్నిట వాడినది ఈ కర్తే. వినయాదిత్యమహారాజు తొగర్చేడు1, సొరబు2, జేజూరి 3 మొదలగుశాసనములన్నియు నీకర్తనసే యున్నవి. వ్రాతతీరుచూచినంతనే శాసనము వాతాపి చళుక్యులదని గుర్తింపవచ్చును. లిపినిగుఱించియు, అక్షరములనుగుఱించియు కర్నూలుశాసనము ప్రకటించు సందర్భమున జెప్పినవాటికన్న తెలుపదగినవిశేషము లేమియులేవు. ధ, మ వర్ణములుతక్క వెలుపలిగిలకతో నున్న తక్కినవర్ణములన్నియు ద్విత్వముచెందినవి. ఈ నియమముకూడ చక్కగ పాటింపబడలేదు.

శాసనభాషయంతయు సంస్కృతము. శాసనారంభమున ఆదివరాహ స్తవమునకు సంబంధించిన మంగళశ్లోకమును, కట్టకడపటివ్యాసగీతాశ్లోకములును తక్క మిగిలినశాసనమంతయు జటిలము, శబ్దాలంకార శోభితము నగుగద్యమున నున్నది. దానవిషయమును గుఱించి చెప్పుసందర్భమున 'మాలుఞ్ఛమలుమన్న' పదము వచ్చును. ఇది దేశీయపదమనకతీరదు. ఫ్లీటు దొరగారు పరిష్కరించి ప్రకటించినతొగర్చేడుశాసనమునగూడ నీపదము వచ్చును. చూడుడు: "పెడె కల్విషయే తొగచ్చే(ర్)డుగ్రామే ఆదిత్యఞ్ఛమలు మన్నో, సున్నవెళ్లో(ళ్లో)లుగ్రామే మాలుఞ్ఛమలు మన్నో, వరేయూగ్రామే మాలుఞ్ఛమలుమన్నో, బట్టెయుగ్రామే మాలుఞ్ఛమలుమన్నో ........., సభోగే దత్తః". ఇవి ఏవోపన్నులకు పేర్లయియుండ వచ్చునని ఫ్లీటుదొరగారు భావించినారు4. ఇట్లే ఆదిత్యవర్మకర్నూలుశాసనమున5 'ఉఞ్ఛమన్న' పదము వచ్చును: చూడుడు: "ముణ్డకల్లుగ్రామస్య పల్లిఱెగ్రామస్యచ ఉఞ్ఛమన్నపన్నాసవృత్తిః". ప్రాచీనాంధ్రభాషాశాసనములయందు వచ్చు పన్నసపదము యొక్క సుస్వరూపము 'పణ్ణాస' లేక 'పన్నాస'. 'పన్నాస'యనగా ఏబది (పంచాశత్ - ప్రాకృతము: పన్నాస) యనియర్థము. ముండకల్లుగ్రామమునందును పల్లిఱెగ్రామమునందును 'ఉంఛమన్నవృత్తి'గా ఏబది- (అది నివర్తనములుకావచ్చును)-ప్రమాణముగలభూమి నిచ్చెనని యర్థము. దీనిననుసరించి మనశాసనమునందుగూడ ౧౦౫ నివర్తనములభూమిని 'మాలుంఛమలుమన్న వృత్తి'గ నిచ్చెననియర్థము చేసికొనవలయును. అంతియ కాని ఫ్లీటుదొరగారుచెప్పిన ట్లీపదములను పన్నులని యర్థము చెప్పుకొన నవకాశములేదని నాతలంపు. 'ఉంఛమన్న', 'ఆదిత్యుంఛమన్న', 'మాలుంఛమన్న', మాలుంఛమలుమన్న' పదములు వృత్తి విశేషమును దెలుపు పదములుగ గ్రహించినను వాటికి సరియైన యర్థమేమో తెలియరాదు. ఈశబ్దములయర్థమింకను నిర్ణయింప బడవలసియున్నది.

ఈశాసనము వాతాపి రాజధానిగ పరిపాలించిన చలుక్యమహీపతులలో నొకడగు వినయాదిత్యమహారాజుది. దానమిచ్చిన విషయమును, ప్రతిగ్రహీతవిషయమును దెలుపుసందర్భమునదక్క ఈశాసనము కర్నూలు శాసనమునకు మార్పులేని చక్కని ప్రత్యంతరము.

## శాసనవిషయము:

శాసనము వరాహావతార మంగళాశ్లోకముతో నారంభమగును (పం.౧ - ౨). ఇది చలుక్యులపరిపాలన లక్ష్యమునకు సూచకము. మహార్ణవమున మునిగిపోయిన భువనమును ఆదివరాహ మెట్లుద్ధరించెనో అట్లే పాపాంబుధిని మగ్నమయినలోకమును తామును (వరాహము నాదర్శముగా గొని) యుద్ధరించి పరిరక్షింతుమనుటకు సూచన. పిదప చలుక్యవంశప్రశస్తి కలదు. చలుక్యులు శ్రీమంతులు; సకలభువనములచేతను స్తుతింపబడుచున్న మానవ్యసగోత్రులు; హారీతిపుత్రులు; సప్తలోకమాతలగు సప్తమాతలచేతను అభివృద్ధినొందింపబడినవారు; కుమారస్వామి పరిరక్షించుటచేత పొందినకల్యాణపరంపరలు

1. Ind. Ant., Vol, VI, p. 85 ff.
2. Ind. Ant., Vol, X1X,, p. 146 ff.
3. Ep. Ind., Vol. XIX, p. 62 ff,
4. Ind. Ant., Vol. VI, p 87, f. n.
5. Jour. Bom. Br. Roy. As. Soc., Vol XVI, p. 223 ff.

కలవారు; భగవంతుడయిన నారాయణుని ప్రసాదముచేత బడసినవరాహలాంఛనమును చూచినక్షణములో వశీకృతులగు సమస్తమహీపతులుగలవారు (పం. ౨ - ౫). ఈవంశమున కలంకారమయినవాడు శ్రీపులకేశివల్లభుడు. ఇతడు అశ్వమేధయాగము నొనరించి తద్యాగాంతమున దోషపరిహారార్థమయిన అవభృథస్నానమును గావించుటచేత పవిత్రముగా జేయబడినశరీరము కలవాడు ((పం. ౫ - ౬). ఇతనికొడుకు కీర్తివర్మ పృథివీవల్లభమహారాజు. ఇతడు వనవాసిమొదలయిన శత్రురాజమండలములను పరాక్రమముచేత ఆక్రమించుకొనగా చేకూరినవిశుద్ధకీర్తి కలవాడు (పం. ౬ - ౮). సమస్తమయిన ఉత్తరాపథమను దేశమునకు ప్రభువయిన శ్రీహర్షవర్ధనుని యుద్ధమునందు పరాజయము నొందించుటచేత పరమేశ్వరుడను అపరనామమును పొందినసత్యాశ్రయ శ్రీపృథివీవల్లభమహారాజాధిరాజపరమేశ్వరుడు ఆకీర్తివర్మతనయుడు (పం. ౮ - ౧౦). సత్యాశ్రయునికుమారుడు విక్రమాదిత్యపరమేశ్వరభట్టారకుడు. ఇతడు బుద్ధిని సహాయముగ గొని సాహసమాత్రముచేత తనవంశమునకు యోగ్యమయిన అంతరితరాజ్యవిభవమును పొందినవాడు; వివిధవిధములగు ధ్వనుల నొనరించుబాణములతో నొప్పు యుద్ధభూమిని పొందినశత్రురాజులను జయించుటవలన లబ్ధమయిన కీర్తిపతాకచేత ప్రకాశించుదిగంతరము కలవాడు; చంద్రకిరణములవంటి స్వచ్ఛమయినవంశము యొక్క పరిభవమునకు, వినాశనమునకు కారణమయిన పల్లవపతిని ఓడించినపిమ్మట కాంచీపురమును దీసికొన్నవాడు; పరాక్రమ(మను) వజ్రాయుధముచేత చీల్చబడిన చోళ, పాండ్య, కేరళ(రాజ) పర్వత(ముల) దర్ప(మను) శిఖరము గలవాడు. ఇతరుల కవనతుడుకాని కాంచీపతి (యొక్క) మణిమయ(మగు) కిరీట(మను) ఘట(మునుండి వచ్చు) కిరణ(ములను) జలముచేత అభిషిక్తమయినపాదపద్మముకలవాడు[6]; మూడుసముద్రములకు నడుమనున్న దేశమునకు అధీశ్వరుడయినవాడు (పం.

6. 'మతిసహాయసాహసమాత్రసమధిగలనిజవంశసముచితచిర(రి)రాజ్యవిభవస్య', 'వివిధరసితసిత్తసమరముఖగతరిపునరపతివిజయసముపలబ్ధకీర్తిపతాకావభాసితదిగన్తరస్య', 'హిమకరకరవిమలకులపరిభవవిలయహేతుపల్లవపతిపరాజయానంతరపరిగృహీతకాంచీపురస్య', ప్రభావకులిశదలితచోళపాండ్యకేరళధరణిధరత్ర(?) యమానమానశృంగస్య', 'అనన్యసమవనతకాంచీపతిమణిమకుటకుటకిరణసలిలాభిషిక్తచరణకమలస్య' అని విక్రమాదిత్యునిగుఱించి గల వర్ణనయందు ఎత్తుగీతవలన జూపబడిన 'చిర', 'సిత', 'కుట', 'మాన', 'కర' పదములలో కడపటి 'కర' తక్క మిగిలినవి అర్థముకాక చాలకష్టము కలిగించినవి. ఇవి ఫ్లీటుదొరగారు పరిష్కరించి ప్రకటించిన వినయాదిత్యశాసనములలో వచ్చినను వాటి కంతతృప్తికరమయినయర్థమును వారు చెప్పియుండలేదు. వినయాదిత్యుని జెజూరిశాసనములు ప్రకటించిన ప్రొఫెసరు డి. ఆర్. భండార్కరుగారు వీనియర్థమునుగూర్చి విచారించియుండలేదు కాని యిందలికష్టమును గమనింపకపోలేదు. 'కుట' పదమును 'కూట' గాను, 'త్ర(?)యమాన' పదమును 'త్రాయమాణ' గను సవరించినారు. శాసనములయందు వచ్చుపదములు ప్రమాదపతితములు కావని లోచినయెడల వానిని ఉన్నవియున్నయట్టుగ అర్థముచెప్ప బ్రయత్నించుట సముచితముకాని సవరింపబూనినచో అర్థమువచ్చునట్లెట్లయినను సవరింపవచ్చును. పూజ్యులయినపదుగురుపండితులను వీనియర్థమునుగుఱించి విచారించి తెలిసికొంటిని. వారికందఱకు నేను కృతజ్ఞుడను. ఈవిషయమున నెక్కువశ్రద్ధవహించి అర్థముతీయుటలో నెక్కుడుగ పరిశ్రమచేసితోడ్పడిన డాక్టరు వి. రాఘవన్‌గారికి ప్రత్యేకవినతులు. ఆపండితులు చెప్పినయర్థము ననుసరించియే పైవిక్రమాదిత్యవర్ణనము తెలుపబడినది. 'చిత' అనగా 'Concealed, Rendered obscure, Vieled' అనునర్థము లుండుటచేత 'అంతరిత' అనియర్థము వ్రాసినాను. అవనిపతిత్రితయాంతరితమయిన రాజ్యమును విక్రమాదిత్యుడు తిరిగి పొందినవాడనుటచేత నాయర్థము సముచితమేయని నావిశ్వాసము. 'రసిత' మునకు ధ్వనియని, 'సిత' మునకు బాణమని యర్థముచెప్పబడినది. 'కర' మునకు 'కిరణ' మనునర్థము ప్రసిద్ధమే. 'కుట' మును 'కూట' గ సవరించుట అనవసరము. 'కుట' మునకు 'కుండ' అనియర్థము. 'త్ర(?)యమాన' పదమున కిప్పటికి అర్థము తెలియలేదు.

౧౦-౧౪). ఇతనికుమారుడు వినయాదిత్యసత్యాశ్రయ శ్రీ పృథివీవల్లభమహారాజాధిరాజపరమేశ్వరభట్టారకుడు. ఇతడు తండ్రియాజ్ఞచేత శివునికుమారుడయిన కుమారస్వామి రాక్షసబలము నెట్లో యావిధముననే గర్వించియున్న పల్లవ రాజ్యత్రయముయొక్క బలము నెదిరించి[7] సమస్తదేశమును ప్రశమనముచేయుటచేత అతని(తండ్రి) మనస్సును రంజింపజేసినవాడు; అత్యంతవత్సలత్వమువలన యుధిష్ఠిరునివంటివాడు; లక్ష్మిని సంతోషపఱచుటవలన వాసుదేవుని వంటివాడు; నృపాంకుశత్వము[8] చేత (రాజుల కంకుశమువంటివాడగుటవలన) పరశురాముని వంటివాడు; రాజాశ్రయత్వము[9] వలన భరతునివంటివాడు (పం ౧౪-౨౩). ఇతడే శాసనదాత. మహాకోట (మహాకూట ?) తీర్థమున దండువిడిసియున్నతరి, శక వర్షములు ౬౧౭ గడచినపిదప, ప్రవర్ధమానమగు విజయ రాజ్యసంవత్సరము పదునొకండవది ప్రవర్తిల్లుచుండగా ఈమహారాజు భార్గవసగోత్రుడును, షడంగవిదుడును అనుస్వస్తిశర్మకుమారుడును, చతుర్వేదవిదుడగు హారిదత్తశర్మకుమారుడును, వేదవేదాంగవేత్తయు నగుత్రివిక్రమశర్మకు పెడెకుల్విషయమునందలి ఆలికుంద గ్రామమున 'మాఱుంభమఱుమన్న' మగు ఆగ్రామమునందే రాజమానమున నూటయొనిమిదినివర్తనముల క్షేత్రమును దానమొసంగెను (పం ౨౩ - ౨౪). ఈవిషయమును దెలుపుటకు ఈశాసనము పుట్టినది. ఈదానము ముందురాగల, తనవంశమునందలివారు, ఇతరులు నగురాజులు ఆయురైశ్వర్యాదులవిలాసము మెఱుపువలె చంచలమయినదని తెలిసికొన్నవారై చంద్రసూర్యధరాసముద్రము లుండునంతకాలము కీర్తిసంపాదనాభిలాషులై తామొనరించిన 'దత్తి'గనే భావించి పరిపాలింపదగినది (అని మహారాజుకోరిక) (పం ౨౪ - ౩౧). పిదప భగవానుడయిన వేదవ్యాసుడగు వ్యాసుడు చెప్పినశ్లోకములు- దానపాలనమునుగూర్చి- (పం. ౩౧ - ౩౬). ఈశాసనము మహాసంధివిగ్రహికుడయిన శ్రీ రామపుణ్యవల్లభుని చేత వ్రాయబడినది (పం. ౩౬ - ౩౭).

## శాసనవిశేషములు :

ఈశాసనము వాతాపిచళుక్యులకును, కాంచీపుర పల్లవులకును జరిగినయుద్ధములనుగుఱించి కొంతసూచించుచున్నది. శాసనవిషయము చక్కగ నవబోధమగుటకు కాంచీపురపల్లవులకును, వాతాపి చళుక్యులకును గలసంబంధమునుగుఱించి కొంత తెలిసికొనుట యావశ్యకము. శాసనదాతయగు వినయాదిత్యునిపితామహుడును, విక్రమాదిత్యుని తండ్రియునగు సత్యాశ్రయ మహారాజు (- ఇతనికి రెండవపులకేశియని నామాంతరము-) కాంచీపురాధిపతియైన పల్లవ మహేంద్రవర్మపై దాడివెడలి యతనినోడించెను. పగలుపొగలు దిమ్మప్రతీకారము బుసలుకొట్టగను సత్యాశ్రయుని యడుగుజాడలను పసి కట్టిపోయినది. వాతాపినగరమును అనతికాలముననే పల్లవులు ముట్టడించిరి. మహేంద్రవర్మకుమారుడయిన నరసింహవర్మ పెత్తనమును దీర్చుకొనెను. ఈ ముట్టడియందే క్రీ. శ. ౬౪౨లో[10] సత్యాశ్రయుడు వీరశయనము నలంకరించెనని చరిత్రకారు లందురు.

సత్యాశ్రయ తనయుడయిన విక్రమాదిత్యుడు ౬౫౫ లో సింహాసనము నధిష్ఠించెను. ౬౪౨ - ౬౫౫ సంవత్సరములకునడుమ సత్యాశ్రయునికుమారులు విక్రమాదిత్యునిసోదరులునయిన ఆదిత్య, చంద్రాదిత్యులు రాజ్యమేలిరనుట కాధారమున్నను నాటిరాజ్యవిశేషములు సవిస్తరముగ దెలియరాక చలుక్యచారిత్ర మింకను చాలవఱకు అజ్ఞాతముగనే యున్నది. మఱికొన్ని క్రొత్త శాసనములు దొరకువఱకు నీముసక తొలగదేమో. అంతవఱకు కాకాలపుచారిత్రము ఊహావశ్యము.

---

7. 'త్రైరాజ్యపల్లవబల మవష్టభ్య' — మూలము.

8. వినయాదిత్యునికి నృపాంకుశబిరుద మున్నట్లు కన్పట్టును.

9. రాజాశ్రయబిరుదము గలదు. 'రాజాశ్రయత్వా ద్భరత ఇవ 'అన్నదానిలోని సారస్యము నా కింకను బోధపడలేదు.

10. Vineent Smith-'Early History of India', p. 385.

విక్రమాదిత్యునికాలమునకు వచ్చునప్పటికి మంచు పొర వదలి స్థితిగతులు చక్కగ తెలియవచ్చును. వాతాపి పతనానంతరమున పల్లవహస్తగతమైన చలుక్యరాజ్యమును మరల సంపాదించుటయేకాక విక్రమాదిత్యుడు పల్లవరాజ్యముపై దండెత్తి వారిరాజధానియగు కాంచీపురమునుగూడ బట్టుకొనెను. చలుక్యరాజ్యప్రతిష్ఠావైభవములను మరల స్థాపించి చలుక్యకీర్తిపతాకను ప్రతిష్ఠించినవాడు విక్రమాదిత్యుడు. తండ్రియాజ్ఞను పరిపాలించి వినయాదిత్యుడుకూడ పల్లవరాజ్యముపై నెత్తివెళ్లి సమస్తదేశమును ప్రశమనముకావించి యాతనికి మునము గూర్చెను. విక్రమాదిత్య, వినయాదిత్యుల యీసాహస కార్యములే శాసనములయం దెక్కువగ నభివర్ణితములయినవి.

“త్రైరాజ్యపల్లవబలమ్”:

అన్వయమువిషయమున చరిత్రపరిశోధకులను చాలకాలమునుండి చీకాకుపఱుచుచున్న సమస్తపదమిది. త్రైరాజ్యపదము చోళ, పాండ్య, కేరళరాజ్యములకు వర్తించునని కొందఱిమతము పల్లవపతినోడించి కాంచీపురమును బట్టుకొనెననియు, పరాక్రమముచేత చోళ, పాండ్య, కేరళులను జయించెననియు, కాంచీపతిచేత మ్రొక్కులందెననియు విక్రమాదిత్యుడు ఈశాసనమునందువలెనే వినయాదిత్యుని ఇతరశాసనములయందును అభివర్ణితుడయ్యెను. కాని విక్రమాదిత్యుడు స్వయముగ నొసంగిన శాసనములలో నతడు “అవనీపతిత్రితయాంతరితమయిన తనపితృసంపదను తాను ఆధీనముకావించుకొని, సమస్తరాజ్యమునకును అధిపతియైనవా”డని ప్రస్తుతుడయినాడు. ఆతనిగద్వాలశాసనమున11 పైనుడివినవిషయము తెలుపబడుటయేకాక, కాంచీపురపల్లవపతులయిన నరసింహవర్మ, మహేంద్రవర్మ, పరమేశ్వరవర్మల నతడు జయించినట్లుకూడ వర్ణింపబడినది. పల్లవరాజపరాజయమును, కాంచీపురపరిగ్రహణమును విక్రమాదిత్య, వినయాదిత్య శాసనములయందు సమానమేకావున నిక విక్రమాదిత్యశాసనములయందు పేర్కొనబడిన ‘అవనీపతిత్రితయము’ వినయాదిత్యశాసనములయందు చెప్పబడిన చోళ, పాండ్య, కేరళ ధరణిధరత్రయమేయని వారివాదము. అవనీపతిత్రితయముకానీ, అది త్రైరాజ్యముకానీ – ఈపదమువలన దెలియనగు రాజ్యత్రయము పల్లవరాజ్యములేకాని అన్యములుకావు; ఈ మూడుపల్లవరాజ్యములకు కాంచీపతియే అధిపతియని మఱికొందఱిమతము12. ఈపదము ‘త్రైరాజ్యకాంచీపతిబల’మనియును వినయాదిత్యుని కొన్నిశాసనములయందు గలదు.

ఈవిషయమునుగుఱించి కొంతచర్చకలదని పాఠకులకు దెలుపుటకుమాత్రమే ఈసమస్తపదమునుగుఱించి యింతలెక్క వ్రాసినాను.

11. Ep. Ind , Vol. X, p. 100 ff.

12. ‘త్రైరాజ్యపల్లవ’ పదమునకు మొదట ఫ్లీటుదొరగారు “The three Component parts of the Pallava kingdom” అని యర్థము చెప్పియు తరువాత నది చోళ, కేరళ, పాండ్యరాజ్యములకే వర్తించునని చెప్పినారు. కీల్‌హార్న్‌దొరగారును, కృష్ణశాస్త్రిగారునుకూడ అట్లేచెప్పినారు. డుబ్రాయిల్‌దొరగారు త్రైరాజ్యమన్నది పల్లవ, పాండ్యరాజ్యములకును, (కొన్నికారణములచేత) సింహళ మానవర్మరాజ్యమునకును వర్తించునన్నారు. ఆమీదఁ గొన్నాళ్లక్రిందట ఈవిషయమునుగురించి వ్యాసము వ్రాయుచు డాక్టరు యన్. వేంకటరమణయ్యగారు ఆపదము పల్లవరాజ్యత్రయమునకే వర్తించునని వ్రాసినారు. ఇటీవల వినయాదిత్యుని దయ్యందిన్నె శాసనమును ప్రకటించుసందర్భమున శ్రీ ఆర్. ఎస్. పంచముఖి, ఎమ్. ఏ. గారు ‘త్రైరాజ్యపల్లవ’ పదమునుగురించి మరల చర్చించి యది చోళ, పాండ్య, కేరళరాజ్యములకే వర్తించునుగాని పల్లవరాజ్యత్రయమునకు వర్తించదని వ్రాసియున్నారు. ఈవిషయమునుగుఱించి వ్రాసినఆయాపండితు లట్టివిధమున నభిప్రాయపడుటకు కారణము లేవో తమపుస్తకములయందును, వ్యాసములయందును దెలిపియున్నారు. ఈవిషయమునుగూర్చి చర్చించునెడల వ్యాసమతివిస్తరముకాగలదు. దానంజేసి చర్చయిచట విరమించి నాయభిప్రాయమునుమాత్రము తెలిపినాను. చరిత్రపాఠకులు మన్నింతురుగాక! నే నాంగ్లభాషను వ్రాసినవ్యాసమున ఈవిషయమును ఎక్కువగ చర్చించినాను.

విక్రమాదిత్యుని మొదటిశాసనములలో 'స్వగురోః శ్రియ మవనీపతిత్రితయాంతరిత మాత్మసాత్కృత్య (త్వా) కృతైకాధిష్ఠి తాశేషరాజ్యభరః[13]' అనిమాత్రమే యున్నది కాని యతడు వేఱె పల్లవుల నోడించినట్లుకాని చోళపాండ్యకేరళులను జయించినట్లుకాని చెప్పబడి యుండలేదు. ఈకారణమునుబట్టియు, ఇంతవఱకు తెలియవచ్చినచలుక్యచరిత్రవిషయములనుబట్టియు చూచి నచో నాకు త్రైరాజ్యపల్లవబల మనగా పల్లవరాజ్యత్రయమునకు సంబంధించినబల మనునర్థము చక్కగ గుదురుటయేకాక చాలయుక్తియుక్తముగను గనబడుచున్నది.

శాసన కాలము :

వినయాదిత్యమహారాజు శకవర్షము ౬౧౪ కడచిన మీద,తనపదునొకండవవిజయరాజ్యసంవత్సరముప్రవర్తిల్లుచుండగా ఈశాసనమునందు దెలుపబడినదానమును జేసెను. ఇతని యితరశాసనములయందువలె నిందు తిథిమాసాదులు లేవు. ఆకారణమున నీశాసనము క్రీ. శ. ౬౯౨ నాటిదనిమాత్రమే నిశ్చయింపవలెను; అనగా నిది పుట్టి యిప్పటికి పండ్రెండువందల నలువదినాలుగేండ్లయినది.

ఇతర శాసనములు, రాజ్యారంభ కాలము :

ఈశాసనముతో గలుపుకొని వినయాదిత్యుని వింతవరకు తామ్రశాసనములును, శిలాశాసనములునుగలసి పదునొకండుశాసనములకుపైగ దొరకినవి. తామ్రశాసనములు వినయాదిత్యుడు ఆయాదానములను ఏయేశకవర్షములయందు, తన యెన్నవవిజయరాజ్యసంవత్సరములందు చేసెనో తెలుపును. శిలాశాసనములలో నొక్కటిమాత్రమే (లక్ష్మేశ్వరశిలాశాసనము[14]) తామ్రశాసనములవలె శకవర్షాదికము నిచ్చును. ఈక్రిందిపట్టిక శాసనదానకాలవిశేషములను దెలుపును :

| | శాసన స్థలము. | రాజ్యసంవత్సరము | శకము. | దానకాలము. | ఇంగ్లీషు తేది. | రాజ్యారంభసంవత్సరము |
|---|---|---|---|---|---|---|
| ౧ | లక్ష్మేశ్వర శిలాశాసనము | ౭ | ౬౦౮ | మాఘ శు. ౧౫ | ఫిబ్రవరి 3, ౬౮౭ | ౬౮౧ |
| ౨ | జేజూరి తామ్రశాసనము | ౯ | ౬౦౯ | ఆషాఢ శు. ౧౫ | జూలై ౨, ౬౮౭ | ౬౭౯ |
| 3 | తొగర్చేడు ,, | ౧౦ | ౬౧౧ | కార్తిక శు. ౧౫ | నవంబరు 3, ౬౮౯ | ౬౮౦ |
| ౪ | కర్నూలు ,, | ౧౧ | ౬౧3 | మాఘ శు. ౧౫ | జనవరి ౧౦, ౬౯౨ | ౬౮౨ |
| ౫ | సొరబ ,, | ౧౧ | ౬౧౪ | రవి దక్షిణాయనాభిముఖుడగుచుండగా రోహిణీనక్షత్రయుక్త శనివారమున | జూన్ ౨౨, ౬౯౨ | ౬౮౨ |
| ౬ | మాయలూరు ,, | ౧౧ | ౬౧౪ | ........................ | ...... ౬౯౨ | ౬౮౨ |
| ౭ | దయ్యందిన్నె ,, | ౧౨ | ౬౧౫ | ఆషాఢ శు. ౧౫, దక్షిణాయన కాలము | జూన్ ౨౨, ౬౯3 | ౬౮౨ |
| ౮ | హరిహర ,, | ౧౪ | ౬౧౬ | కార్తిక శు. ౧౫ | అక్టోబరు ౯, ౬౯౪ | ౬౮౧ |
| ౯ | పాంసోడా ,, | ౧౪ | ౬౧౭ | వైశాఖ శు. ౧౫ | మే ౪, ౬౯౫ | ౬౮౨ |

13. ఇట్లని విక్రమాదిత్యుడు తనమూడవవిజయరాజ్యసంవత్సరమున నిచ్చినకర్నూలుశాసనమునందు గలదు.

14 Ind. Ant,, Vol. VII, p. 112 ff.

ఫ్లీటుదొరగారీశాసనకాలమున కిచ్చినసరియైనఇంగ్లీషుతేది ఫిబ్రవరి, ౭, ౬౮౭. దయ్యందిన్నెశాసనమును ప్రకటించినశ్రీపంచముఖిగారు శకవర్షము వర్తమానాబ్దముగ గ్రహించి దానికి జనవరి, ౨౦, ౬౮౬వ తేది నిచ్చినారు. 'ప్రవర్ధమానవిజయరాజ్యసంవత్సరే పఞ్చమే (?సప్తమే)' అని ఫ్లీటుదొరగారిపాఠము. పంచమ అనియుండగా సప్తమఅనునేమోయని ఏల సంశయించినారో తెలియదు. పాఠము సరిచూచ మన్న ప్రతిబింబము లేదు. భండార్కరుగారు సప్తమపాఠమును, పంచముఖిగారు పంచమపాఠమును గ్రహించినారు. నేను సప్తమపాఠమును గ్రహించినాను.

పైపట్టికను తిలకించినచో రెండువిషయములు తేటపడగలవు :—(౧) చలుక్యులు దానధర్మముల నెప్పుడును పౌర్ణమిని చేయుట. పౌర్ణమితిథికి వా రంతటి ప్రాముఖ్య మేలయొసంగిరో తెలియరాదు; (౨) శక, వర్షములకు విజయరాజ్యసంవత్సరము లకుగల వ్యత్యాసవిరోధములు. లక్ష్మేశ్వరశిలా శాసనమునుబట్టియు, హరిహర15 తామ్రశాసనమునుబట్టియు వినయాదిత్యుడు క్రీ.శ. ౬౮౧ లో రాజ్యమునకు వచ్చినట్లు చెప్పవలసియుండును; కర్నూలు16, సోరబు17, మాయలూరు, దయ్యందిన్నె18, పాటోడా19 తామ్రశాసనములననుసరించి ౬౮౨ లో పట్టాభిషిక్తుడయినట్లు తలంపవలసియుండును; జేజూరి20, తొగర్చేడు21 తామ్రశాసనములు రెండును రాజ్యారంభకాలమును ౬౭౯, ౬౮౦ గదెలుపును. వినయాదిత్యుడు ౬౮౧ లో యువరాజపట్టమునందినట్లును, ౬౮౨ లో రాజ్యాభిషిక్తుడయినట్లును నిశ్చయింతమన్న జేజూరి, తొగర్చేడుశాసనము లీనిర్ణయమునకు ప్రతిబంధకములు. వినయాదిత్యుడు తాను స్వంతముగ నిచ్చిన తామ్రశాసనములయందే ఇట్టివ్యత్యాసదోష మేలకనిపింప

15. Ind. Ant., Vol. VII, p. 300 ff

16. Ind, Ant., Vol. VI, p. 88 ff.

17. Ind. Ant., Vol. XIX, p. 146 ff.

ఇందు 'దక్షిణాయనాభిముఖే భగవతి భాస్కరే' అని యుండుటచేత ఇంకను దక్షిణాయనసంక్రాంతి రాలేదని విశదమగుచున్నది.

18. Ep. Ind., Vol. XXII, p. 24 ff.

దయ్యందిన్నె శాసనదానకాలమును గురించి స్వామికన్నుపిళ్లెగారిట్లు వ్రాసిరి : "ఇందలి తిథిమాసాదులు శకవర్షము ౬౧౪ గతాబ్దమునకే వర్తించునటుల...ఆషాఢశుద్ధపౌర్ణమి అధికఆషాఢ మయినచో జూన్ ౪-వ తేదియును, నిజఆషాఢమయినచో జూలై ౪-వ తేదియు నయినది...కాని ఈరెంటిలో నేదినమునను దక్షిణాయన సంక్రమణము లేదు. కాని శకవర్షము ౬౧౪ను వర్తమానాబ్దముగ గ్రహించినచో, అనగా క్రీ. శ. ౬౯౧ - ౯౨ అయినయెడల ఆషాఢ శు. ౧౫ జూన్, ౧౬-వ తేది, ౬౯౨ (౬౯౧ అనునది పొరపాటున ౬౯౨ పడినది) అగును. అప్పటి తేదికి దక్షిణాయనసంక్రమణము చాలచేరికగ నుండును." పంచముఖిగారు ఈశాసనకాలమునకు సరియయిన ఇంగ్లీషుతేది జూలై ౪, ౬౯౨గ గ్రహించినారు. దక్షిణాయనకాలమన్నది అప్పటి సంక్రమణపుణ్యకాలముకాక (అదివఱకే సంక్రమణము వచ్చియుండుటచేత) దక్షిణాయనకాలముమాత్రమే యగును. కాని నేను ౬౯౩-వ సంవత్సరమునకు లెక్కకట్టితిని. ఆషాఢ శు. ౧౫ మధ్యమతిథి సూర్యోదయమానముల ననుసరించి క్రీ. శ. ౬౯౩లో జూన్ ౨౨-వ తేది యగును. నాడు చతుర్దశితిథి ౩౭ గడియల, ౧౨ విఘడియలవఱకును గలదు. పిదప పౌర్ణమి. ఆసంవత్సరమున దక్షిణాయనసంక్రమణముకూడ జూన్‌మాసము ౨౨-వ తేదినే యగును. నాడు సంక్రమణపుణ్యకాలము ౧౫ ఘడియల, ౭ విఘడియలకు. అందువలన దక్షిణాయనసంక్రమణపుణ్యకాలము పౌర్ణమితిథిలో బడకపోయినను పౌర్ణమితిథ్యారంభమయిననాడే అయినది. ఇట్టిప్రక్రమములు శాసనములయందు వచ్చుట కలదు. అందువలన దయ్యందిన్నె తామ్రశాసనదానకాలము నాయుద్దేశముప్రకారము ౨౨-వ తేది, జూన్ ౬౯౩. అయితే శకవర్షము ౬౧౪ను గతాబ్దముగ దీసికొన్నను ౬౯౨ కావలెనుకాని ౬౯౩ అనుటయెట్లు అనుప్రశ్న కలుగుట సమంజసము. ఎట్లో నేను చెప్పజాలను కాని శకవర్షమును గతాబ్దముగ దీసికొన్నను ఇచ్చిన వివరములు దానికిగాక దానితరువాతిసంవత్సరమునకు సరిపోవునట్టియుదాహరణములు ఎన్నిటనో శాసనముల నుండియే యియ్యవచ్చును.

19. Ind. Ant, Vcl. IXL, p. 240 ff.

20. Ep. Ind„ Vol. XIX, p. 62 ff,

21. Ind. Ant., Vol. VI, p. 85 ff,

ఈశాసనమునకు ఫ్లీటుదొరగారిచ్చినతేది నవంబరు 3, ౬౮౯. పంచముఖిగారు ఈశాసనమునందలి శకవర్షమునుగూడ వర్తమానాబ్దముగనే గ్రహించి దానికి అక్టోబరు ౧౫, ౬౮౮-వ తేది నిచ్చిరి.

బలెనో తెలియరాదు22. జేజూరి, తొగర్చేడుశాసనములనే కాదు తదితర వినయాదిత్యతామ్రశాసనములు వేనిని సృష్టి యని యింతవఱ కెవ్వరును నిరాకరింపలేదు. దాన ప్రతిగ్రహీతల విషయమున తక్క జేజూరిశాసన మంతయు దయ్యిందిన్నె, హరిహరశాసనములకు సరి యైనవకలు. 'రాజాశ్రయత్వాద్భిరతఇవ' (పం. ౨౧) అన్నపిదప 'పల్లవకలభ్రకేరళహైహయవిళమాళవచోళ పాండ్యాద్యాః యేనానువగంగాద్యైః క్రమైరెన్నసమభృత్యానీతాః' అన్నవచనము తక్క జేజూరి, దయ్యిందిన్నె హరిహరశాసనములయందు మాత్రమే కానవచ్చును. జేజూరిశాసనమునం దిచ్చిన ౯-వ విజయరాజ్యసంవత్సరము సరియైనదైయైనయెడల పదవ, పదునొకండవ, విజయరాజ్యసంవత్సరముల నాటితొగర్చేడు, కర్నూలు, సొరబు, మాయలూరు తామ్రశాసనములయం దావచన మేలలోపించినదో తెలియరాదు. దీనినిబట్టి చూడగా జేజూరి, తొగర్చేడు శాసనములం దిచ్చిన దానకాల, విజయరాజ్యసంవత్సరములయం దేదో ప్రమాదము దొరలి యైననుండవలెను;23 లేదా యాశాసనములు అనుమా నాస్పదములయినవైన నయియుండవలెను. అనంతపురము జిల్లా, గుత్తితాలూకా, దిమ్మగుడియందలి శిలాశాసనము24 ననుసరించి విక్రమాదిత్యుడు ౨౬ సంవత్సరములు పాలించినట్లు తెలియుచున్నది. దీనినిబట్టి అతని పరిపాలనము ౬౮౧ లో అంతమగుచున్నదనుటస్పష్టము. కావున వినయాదిత్యుడు ౬౮౧ – ౬౮౨ సంవత్సరమున రాజ్యమునకు వచ్చియుండవలెను.

స్థలనిర్దేశము :

ఈశాసనమున మహాకోటతీర్థమును, పెదెకల్లి విషయమును, అలికుంగ్రామమును పేర్కొనబడినవి. మహాకూటతీర్థమునకు మహాకోటతీర్థమన్నది లేఖక ప్రమాదమని నాయూహ. మహాకూటమే యైనచో అది వాతాపి (ఇప్పటిబాదామి)కి తూర్పుగ మూడుమైళ్ళ దూరమున గలమహాకూటేశ్వరతీర్థమే కావచ్చును. అచ్చట కొండలమీద మహాకూటమనుపేర బరగుకొన్ని దేవళములసంపు కలదు. మహాకూటేశ్వరుడు తత్క్షే త్రాధిష్ఠానదైవతము. అగస్త్యమహర్షి ఇల్వల, వాతాపులను సంహరించినస్థల మదియేయని మహాకూటస్థల మాహాత్మ్యమువలన దెలియును. పురాణము లీగాథ వింధ్యపర్వతసాన్నిధ్యముల నెచ్చటనో జరగినట్లు చెప్పు చున్నను ఇల్వల, వాతాపులకు నీక్షేత్రమునకు నెద్దియో సంబంధ ముండవచ్చునని ఫ్లీటుదొరగారుకూడ విశ్వ సించిరి. విశాలమయిన యావరణమున ఆదేవాలయములు గలవట. ఆయావరణమున ప్రవేశించుటకు ఈశాన్యాశ నొకద్వారము కలదట. ఆద్వారబంధముమీద నెడా పెడా మనిషంతయెత్తయిన రాక్షస విగ్రహములు మలచియున్నవట. ఆవిగ్రహము లిల్వల, వాతాపులవని స్థానికులు చెప్పుదురట25.

---

22. ఈవిధమయినతికమకలను సరిపుచ్చి ఒకపంథలోనికిదీసికొనివచ్చుటకే పంచముఖిగారు వినయాదిత్యశాసనములయందలి శకవర్షములు గతాబ్దములయినను ("శకవర్షేష్వతీతేషు" అనియేపాఠము) వాటిలో కొన్నిటిని గతాబ్దములుగను, మఱికొన్నిటిని వర్తమానాబ్దములుగను పరిగణించినారు. ఇది సరియైన పద్ధతిగ దోపదు. అనియటుంచ వారు శాసనమున విజయరాజ్యసంవత్సరములు వర్తమానాబ్దములుగ నిచ్చినను వాటిని గతాబ్దములుగ లెక్కించినారు. ఇదిపొరపాటు. పదునొకండవవర్తమానాబ్దమనగా నిజముగా గడచినవి పదేండ్లేయన్నమాట.

23. ఏకారణముననో ఫ్లీటుదొరగారు లక్ష్మేశ్వరశిలాశాసనమును 'సృష్టి' యన్నారట. భండార్కరుగారు జేజూరిశాసనమును ప్రకటించుసందర్భమున ఒకవేళ ఫ్లీటుదొరగారినిర్ణయము సరియైనదైనచో వినయాదిత్యునిమిగిలిన శాసనములన్నిటిలో నీజేజూరిశాసనమే మొదటిది కావలయునని తమయభిప్రాయమును వెలిపుచ్చినారు. కాని యీజేజూరిశాసనమునందలి 'పల్లవ కలభ్ర కేరళ...సమభృత్యానీతాః' అనువాక్యమునుబట్టి యిది మొదటిదిగానే నెంచును. శకవర్ష, విజయరాజ్యసంవత్సరములలో నేదో ప్రమాద ముండవలెననియే నాతలంపు. ఆవాక్యము పన్రెండవవిజయరాజ్యసంవత్సరమునుండి కాని శాసనములందు కానరాదు.

24. Ep. Coll., No. 364 of 1920.

25. Ind. Ant., Vol. X, p. 102.

పెడేకల్విషయ మనుపేర ఈవిషయమే వినయాదిత్యుని తొగర్చేడు శాసనమునందును వచ్చును. ఆశాసనమున దానమిచ్చిన గ్రామము తొగర్చేడే. ఢోన్ తాలూకాయం దొకతొగర్చేడును, నంద్యాల తాలూకాయం దొకతొగర్చేడును గలవు. కోయిలకుంట్లతాలూకా మాయలూరికి వాయవ్యమూలగ ఆఱుమైళ్లదూరమున ఆలికొండ (ఆలవకొండయనియు నామాంతరము) యనుగ్రామము కలదని శ్రీవెంకటరెడ్డిగారు తెలుపుచున్నారు. మనశాసనమున పేర్కొనబడిన ఆలికుంద ఆలికొండయనుటకు సంశయింప నక్కఱ లేదు. నంద్యాలతాలూకాయందలి గడిగరేవుల, పాణెం, నంద్యాల గ్రామములు పంద్రెండవశతాబ్దికి తరువాతి కాలపుశాసనములయందు పెడకంటిసీమలోనివిగ దెలుపబడినవి. పెడెకుల్విషయమని, పెడేకల్విషయమని వినయాదిత్యశాసనములయందు పేర్కొనబడినదేశమే పెడకంటిసీమయని నిశ్చయింపవచ్చును. అట్లయినచో ఇప్పుడు కోయిలకుంట్ల, నంద్యాలతాలూకాలాక్రమించిన ప్రదేశము పూర్వము పెడకల్లువిషయమని, పెడకంటిసీమయని వ్యవహరింపబడుచుండెనని చెప్పదగును. పెడకల్లు ఏదిఅనువిషయము ఇంకను విచారణీయము26. పెడేకల్విషయములోనిదిగ జెప్పబడిన తొగర్చేడు నంద్యాల తాలూకాయందలి తొగర్చేడుగ గ్రహింపవచ్చును.

**శాసనలేఖకుడు :**

శాసనములిఖించినవాడు శ్రీరామపుణ్యవల్లభుడు. వినయాదిత్యశాసనములకన్నిటికి నితడే లేఖకుడు. ఇతడు సంధివిగ్రహి (Minister for peace and war)

## చలుక్యులు అసలు ఎచ్చటివారు?

(౧) వాతాపిచలుక్యులశాసనము లెన్నో కర్నూలుమండలమున దొరకినవి.

(౨) ఆశాసనములయందు పేర్కొనబడిన గ్రామము లనేకములు కర్నూలుమండలమున గుర్తింపబడినవి

(3) విక్రమాదిత్యునిగద్వాలశాసనమున 'ఖండుగ వడ్లసహిత'మ్మని 'వడ్లు' పదమును, 'ఉంఛమన్న', 'మాఱుంఛములుమన్న' పదము లితర చలుక్యశాసనముల యందును వచ్చును. ఇవి దేశీయపదములు; ప్రాయికముగ తెలుగుపదములే యగునేమో!

(౪) విక్రమాదిత్య, వినయాదిత్య శాసనములు కొన్ని తెలుగుబాసనే కలవు.

(౫) చాళుక్య రాజరాజనరేంద్రుని నందంపూడిశాసనము చాళుక్యవంశోత్పత్తి ప్రకారము నిట్లు చెప్పుచున్నది. విజయాదిత్యుడు త్రిలోచనపల్లవునితో యుద్ధముగావించి యందు దైవదురీహచేత లోకాంతరగతుడయ్యెను. అంతర్వత్నియగు నాతనిమహాదేవి తమ పురోహితునితోగూడ ముడివేము అనునగ్రహారము చేరి అచ్చట విష్ణుభట్టసోమయాజి27 యను బ్రాహ్మణునిచేత ఆతనికూతురువలె పెంపబడి విష్ణువర్ధనుడను కుమారుని గనెను. విష్ణువర్ధను డొక్కనాడు; జరిగినపూర్వవృత్తాంతమంతయు తల్లివలన దెలిసికొని చలుక్యగిరికేగి యచట గౌరియయిన నందాభగవతినారాధించి కుమారస్వామిని, నారాయణుని, మాతృగణములను (సప్తమాతలను) సంతృప్తిపఱిచి సకలసామ్రాజ్యచిహ్నములను సంపాదించి

---

26. పెడేకల్లు పెండేకల్లగునా యన్నది విచారణీయము. పెండేకల్లగుచో ఢోన్ తాలూకాయం దొకపెండేకల్లును, పత్తికొండతాలూకాయం దొకపెండేకల్లును గలవు. కోయిలకుంట్లతాలూకాకు ఢోన్ సరిహద్దుతాలూకా యగుటవలన దానినే గ్రహింపవలసియుండును. అప్పుడు ఇప్పటి ఢోన్ తాలూకాయందలి కొంతభాగముకూడ పూర్వము పెడకంటివిషయమున జేరియున్నట్లు తలంపవలసియుండును.

27. S. I. I., Vol. IV., No. 927.

త్రినయనపల్లవునియొద్ద వెన్నయభట్టసోమయాజియొక డుండినట్లును, ఆతడు గౌడభట్టు నోడించినట్లును, వెన్నయభట్టసోమయాజివచోవృత్తిని విని పల్లవిత్రాంతరంగుడయి త్రినయనపల్లవు డతనికి ఆఱామలేఖావృతమయిన ఇట్టలూరు నిచ్చినట్లును ఇర్లపాడుశాసనమున గలదు. ఈవెన్నయభట్టసోమయాజియే అంతర్వత్నియైన విజయాదిత్యుని మహాదేవికి శరణ్యమిచ్చి కూతురివలె నామె నాదరించినవిష్ణుభట్టసోమయాజి యైయుండవచ్చును.

కదంబ, గంగాదిపార్థివులను నిర్జించి చలుక్యరాజ్యమును ప్రతిష్ఠాపించి యేలెను. ఇతఁడే చలుక్యవంశమునకు మూలపురుషుఁడు. ఈవిష్ణువర్ధనునికి విజయాదిత్యుఁడు, విజయాదిత్యునికి పొలకేశివల్లభుఁడు, పొలకేశివల్లభునికి కీర్తివర్మయు గలిగిరి. ఈపొలకేశివల్లభుఁడే మనశాసనమున మొట్టమొదట పేర్కొనఁబడిన పులకేశివల్లభమహారాజు.

ఈపైది గాథయేయైనను అందు మనము గమనింపవలసిన కొన్ని యంశములు కలవు. అవి యేవన (౧) ముడిమేము అనునగ్రహారము జమ్మలమడుగు తాలూకాయందలి పెద్దముడియము. అట్లగుచో విష్ణువర్ధనుడు తపమాచరించిన చలుక్యగిరి ఆప్రాంతమున నే యుండవలెను. మూషికులు నివసించుచుండిన ప్రదేశమునందలి పర్వతమునకు మూషికపర్వతము లేక 'ఎలిమలై' అను పేరు కలిగినట్లే 'చలుక్యగిరి' యను పేరు కూడ అది అసలు చలుక్యుల ఆదిమనివాసప్రదేశమునందుండుటచేత కలిగియుండుననుట సమంజసము. విష్ణువర్ధనుడు జయించెనని చెప్పబడిన కదంబులును, గాంగులును రాయలసీమలోనివారు. తలగుండశాసనము[28] ననుసరించి కదంబవంశజుఁడైన మయూరశర్మ కదంబరాజ్యమును తొలుదొలుత స్థాపించినది శ్రీశైలదుర్గమారణ్యములయందు. అచ్చటినుండి యధికారమును బలపఱుచుకొని అతడు బాణులు మొదలయినవారిని జయించెను. గంగవంశజులయినదడిగ, మాధవులు కడపమండలమునందలి గంగపేరూరునందుగల జైనుడు సింహనంద్యాచార్యునికృపాకటాక్షమున గంగరాజ్యమును స్థాపించిరి. ఈవిధమున గంగరాజ్యము అసలుస్థాపితమయినది రాయలసీమయందు. కదంబ, గంగ రాజ్యములు రెండును ఇరుగుపొరుగున నుండుటచేతనే చలుక్యవిష్ణువర్ధనుడు తొలుదొలుత వాటిని జయించుట కలిగెనది అనియు, అవి ప్రముఖముగ పేర్కొనఁబడినవనియు చెప్పవలసియుండును.

(౨) 'చలికి' కులజులు నా గార్జునికొండ 'శ్రీపర్వత' శాసనములయందు పేర్కొనఁబడియున్నారు. 'ఖంద చలికి రెమ్మణక' యన్నది ఆశాసనములయందువచ్చు 'చలికి' కులజుని పేరు. శాసనప్రమాణమున 'చలికి', 'సలికి', 'సళ్కి', 'చళికి', 'చలుక్య' 'చళుక్య' మొదలయినపదములు చాళుక్యపదరూపాంతరములుగ తెలియవచ్చుచున్నవి. 'చలికి రెమ్మణక' వ్రాయికమునగ 'చలికిరణక' కావచ్చునని, దానికి 'చలికిరణుడు' - చంద్రుడు అని స్టెన్ కొనో దొరగారర్థము చెప్పినారు. కాని యీయర్థము సరియైనదికాదని నాయభిప్రాయము. శాసనములను పరిశీలించినచో 'ణక' యన్నది పురుషనామములచివరను, 'ణిక' యన్నది స్త్రీనామములచివరను వచ్చు ప్రత్యయములని విశదమగును; ఉదా: ఖంద విసాఖణక;[29] ఖందసాగరణక; చాతిసిరిణిక. 'ణక', 'ణగ' గను గన్పట్టుచున్నది (మాడుగు: ఖందసాగరంణగ). 'చలికి రెమ్మణక' యన్నది చలుక్య 'రెమ్మణక' కావచ్చును. ఇతడు మహాసేనాపతి మహాతలవరుడు; హిరణ్యకవంశ్యుడు. పై నామములకు ముందుగల 'ఖంద', ('స్కంద') పదము వారికి కుమారస్వామి యిష్టదైవమనుటను సూచించునని నా యూహ. చలికికులజులు సామంతులుగను, సేనాపతులుగను, మహాతలవరులుగను గొలిచిన ఇక్ష్వాకుభూపతులుకూడ 'విరూపఖపతి మహాసేనపరిగహితస' అని మహాసేనునిచేత (కుమారస్వామిచేత) పరిగ్రహింపబడిన

28. Ep. Ind., Vol. VIII, p. 24 ff.

29. 'ణక', 'నక' లేక 'ణగ' యన్నది 'నాగ' శబ్దరూపాంతరము కావచ్చును. అట్లయినచో స్త్రీప్రత్యయమగు 'ణిక' లేక 'నిక' యన్నది 'నాగనిక' యొక్క హ్రస్వరూపము కావచ్చును. అప్పుడు 'ఖందవిసాఖణ'కుడు 'స్కందవిశాఖనాగుడును, 'ఖందచలికిరెమ్మణ'కుడు స్కందచలుక్యరెమ్మనాగుడును 'చాతిసిరిణిక' శాంతిశ్రీనాగినికయు నగుదురు. అట్లయినచో హిరణ్యకవంశమునందలి చలుక్యులు నాగజాతులలోనివా రగుదురు. నాగజాతివారు ఆంధ్రశాతవాహనులనాటనుండియు వారిక్రింద సేనాధిపత్యముమొదలయినగొప్పపదవులను బడసి ప్రాముఖ్యమునకు వచ్చిరి. నాగజాతివారికిని పల్లవులకును సంబంధబాంధవ్యములు కలవు.

వారు (ఆనరింపబడినవారు) అని శాసనములయందు పరికీర్తితులయినారు. చలుక్యులు రాజ్యలాభము కలిగినమీదట ఇక్ష్వాకుజనపతుల ననుకరించి తాము 'మహాసేన పరిగృహీతు'ల మనికాక 'మహాసేనపాదానుధ్యాతుల' మని చెప్పుకొనియుండిరని యూహింప వచ్చును. పైవిషయముల నంగీకరించునెడల 'చలుక్యులు' హిరణ్యకులలోని అంతశ్శాఖవారని చెప్పుకొనవలసియుండును.

పూర్వోక్తవిషయముల నన్నిటిని చక్కగ పర్యాలోచించినచో చలుక్యులు అసలు శ్రీశైలప్రాంతవాసులనియు, రాయలసీమ వారి మొదటినివాస భూమి యనియు నిశ్చయింప నవకాశము కలదు.

# మూలము[1]

## మొదటిరేకు : రెండవ పైడ

1. [స్వస్తి ॥ జయత్యావిష్కృతం*] విష్ణో[ర్వారాహం క్షోభి*][తార్ణవం] [।*] దక్షిణోన్నతదంష్ట్రాగ్ర [వి] శ్రాన్త [భు] [వనం*]
2. [వ][పుః ॥ శ్రీమతాం సకలభువనసంస్తూయమానమానవ్య*]సగోత్రాణాం [హా(రీ)తి] [పుత్రాణాంస*]
3. [లోకమాతృభి*] [స్సప్త]మాతృభిరభివర్ధి[తా*][నాం*] [కార్తికే] [య*]పరి ర[క్షణప్రాప్తకల్యాణప*]
4. [రమ్ప][రాణాం*] [భ]గవన్నా[రా][య*]ణప్రసాదసమా [సాదితవరా *] హ [లాఞ్ఛ][నేక్షణ*]క్ష[ణవశీ*]
5. [కృ]తారాతిమహ[హీ][భృ*]తాం[*] చలు[క్యా]నాం కు[లమల*]ఙ్కరిష్ణో[రశ్వ] [మే*]ధా[వభృథస్నా*]
6. [నప*] [వి] (త్రీ) కృత [గాత్ర*] [స్య] శ్రీ[పుల] కేశివల్ల [భ*] [మ]హారాజ[స్య] [సూను*] పరాక్ర[మా*]
7. [క్రాన్తవనవా*] [సా] [దిప*] రనృపతిమ [ణ్డ]ల ప్రణిబ[ద్ధ] [వి*] శుద్ధకీర్తి[పతా*]కః [కీర్తివర్మ*]పృథివీ
8. [వల్లభమ*]హారాజ స్తస్యాత్మజ స్స[మ*] రస[o*] [సక్త] [సకలో*] త్తరాప [థేశ్వ] [ర*] శ్రీహర్షవర్ధన
9. [పరా*]జయోపల[బ్ధ*] పరమేశ్వరాప [ర] నామధేయ స్స*]త్యా[శ్రయ శ్రీపృ]థివీ [వల్లభ*]
10. [మ]హారాజాధి[రా][జ*][ప] రమేశ్వర [స్య] [ప్రి]యసుత*][స్య] విక్రమా[ది]త్య పరమేశ్వర

1. నాదగ్గఱ నున్న రేకుల ననుసరించి.

## రెండవ రేకు : మొదటి పెడ

11. భట్టారకస్య [మ][తిస*][హా]యసాహసమా[త్రసమధి*]గతనిజవంశసముచ్ఛిత
12. చితరాజ్యవిభ[వ][స్య వివి*]ధర[సి]తసి[త][సమరము*]ఖగతరిపునరపతివి
13. జయ[స][ము*][ప][ల]బ్ధకీర్తి[ర్*]పతాకావభా[సితదిగన్త]రస్యహిమకరకరవిమల
14. [కు]ల[నరిభవ*][వి]లయహేతుపల్లవపతిరాజయోస్త[ర*]రిగృహీతకాఞ్చీ[పు*]
15. [ర*][స్య][ప్ర]భావకులిశదలితచోళపాణ్డ్యకేరళధరణిధరత్ర(త్ర)[య*]
16. [మాన*][మా]నశృంగస్య అనన్యసమవనతకాఞ్చీపతిమణిమకుటకు
17. ట[కి][రణసలి*]లాభిషిక్తచరణకమలస్య త్రిసముద్రమధ్య[వర్తిభువనమ*]
20. ణ్డలాధీశ్వరస్యసూనుః పితురాజ్ఞయా బాలేన్దుశేఖరస్యే[వ][సేనానీర్దైత్య*]
21. బల మతిసముద్ధత[ం*]త్రైరాజ్యపల్లవబల మవష్టభ్య సమస్తవి[ష][య*]
22. ప్రశమనాద్వహితతన్మనోనురఞ్జనః అత్యన్తవత్సలత్వాద్యుధిష్ఠిర ఇవ

## రెండవ రేకు : రెండవ పెడ

23 శ్రీరామత్వాద్వాసుదేవ ఇవ న పాంకుశత్వాత్పర[శు]రా[మ] ఇవ రాజా[శ్ర]య
త్వా [ద్భర][త ఇవ*]
24. [శ్రీ*] వినయాదిత్య సత్యాశ్రయ శ్రీపృథివీవల్లభ [మహారా*]జాధిరా[జపరమేశ్వ*]
ర[భ]ట్టా
25. రకస్సర్వానేవ మాజ్ఞాపయతి విదితమస్తు వోస్మాభి శ్చతుర్దశోత్తర షట్ఛ[తేషు]
శ[కవ*][ర్షే]
26. [ష్వ]తీతేషుప్రవర్ధమానవిజయరాజ్యసంవత్సరే ఏకాదశే వర్తమానే మహా[కో]ట
27. తీ[ర్థ][ే*]మధివసతివిజయస్కన్ధావారే భార్గవసగోత్రస్య (త్రాయ) పఞ్చార్[దః]
స్వామి
28. శర్మణః పౌత్రాయ[2] చతుర్వేదపదో హరిదత్తశర్మణః పుత్రాయ త్రివిక్రమ
శర్మ[ణే*]
29. వేదవేదాఙ్గపారగాయ పెడకుల్వింగ్రామే ఆలికున్ద్రగామే మాఙ్గుణుల
30. మన్వితస్మిన్నేవ గ్రామే రాజమానే నాష్టోత్తరశతనివర్తన సంఖ్యం క్షేత్రం దత్త[ం] [తదా]
31. గామిభిరస్మద్వంశ్యై రన్యైశ్చ రాజభిరాయురైశ్వ[ర్యాదీ]ని[నా][ం*]విల[సి*][త]

2. ఈ 'య' వర్ణమును లేఖకుడు మొదట వ్రాయమఱచి 'త్రా'కు 'చ'కు నడుమ దిగువ వ్రాసినాడు

### మూడవ రేకు : మొదటి పెడ

32. మ[చి]రాంశుచంచలమవగచ్ఛ[ద్భి][రా*] చన్ద్రార్క్కధరా[ర్ణ్ణ]వస్థితి [స]మకాలం
33. యశశ్చిచీషుభి[ః*]స్వదత్తినిర్వ్విశేషం పరిపాల[నీ]య(ం)[ము][క్త*]ఞ్చ భగవతా వేద
34. వ్యాసేన వ్యాసేన[॥*] బహుభిర్వ్వసుధా భుక్తా రాజభిస్సగరాదిభి[।*]యస్య య[స్య]
35. [య*][స్య]యదా భూమి స్తస్య తస్య తదా ఫలం[॥*] స్వదాతుం సుమహచ్ఛక్యం దుః
36 [ఖమ*]న్యస్య పాల[నం][* [దాన . పాలనం . తిదానా]చ్ఛ్రేయోనుపాల[నం॥*] [స్వ]
37. [దత్తాం*]పరదత్తాం వా యో హరేతి వసున్ధరాం [।*] షష్టిం వర్షసహస్రాణి
38. [వి*][ష్ఠా]యాం జాయతే క్రిమిః[॥*] మహాసాన్ధివి[గ్ర]హిక శ్రీ రామపుణ్య[వ]ల్ల
39. [భే*]న లిఖితమిదం శా[స][న*]మితి[॥*] . . [న]మో[న]మః[॥*]



గంగానదిపైన సూర్యోదయము                A. P.

# వినోద విమర్శనము

## పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రి

కోయిలలు క్రొమ్మావిచిగురుజొంపములు మేసవి కుహూకుహూధ్వనులఁ గ్రుమ్మరింప మొదలిడినవి. చిలుకలగములు నవ్యఫలాహారంబులఁ జవిచూచి ముద్దుపలుకుల ముచ్చటింపఁదొడఁగినవి. ఎలదెమ్మెరలు పువ్వుసౌరభఘుమంఘుమముల నలుగడల వెదచల్లసాగినవి. తమ్మిచెలికాని కిరణములు గోరువెచ్చవాటి ముదుసలుల సీతువు నడంప నారంభించినవి. ఆసమయమున నొక యఱువదియేండ్ల ముదుసలి నరసినవెండ్రుకలటునిటుఁ జెదరుచుండ విబూదిపెండెకట్టులతోడను రుద్రాక్షపేరులతోడను పంచెగోఁచితోడను వృక్షవాటికకరుదెంచి కొంతతడవటునిటుఁ దిరిగి తుద కందున్న స్ఫటికంపుఱాతిన్నియ నధిష్ఠించెను. అప్పుడు ఇరువదియేండ్ల ప్రాయంపు యువకుఁడు తాటియాకులగ్రంథ మొకటి చంకనిడికొనివచ్చి యాతని సమీపించి పండితాఖండలులకు నమస్కారము అని చెప్పి యాతనికభిముఖముగానున్న కుశాస్తరణమునఁ గూరుచుండి తన చంకనున్న తాటియాకుల గ్రంథమును విప్పి యేదియో చదువ మొదలిడెను. (అటుపిమ్మట వారిరువురు నిటులు సంభాషింపఁదొడఁగిరి.)

వృద్ధు—శారద్వతా! ఏది! యిదియేనా! నీ సందియమున కాస్పదమగు పద్యము?

శార—అగును.

వృద్ధు—విననేదీ! మరల నొకసారి చదువుము.

శార—

గంగం దాల్చితి వుత్తమాంగమున నక్
  రైకోలా గావిరచిత—...
ర్థాంగీకార మనం బురంధ్రి నిను వా
  మాంగంబునం దాల్పనే

శృంగాగోన్నతిఁ జూడు మంచు గిరిజన్
  శ్లాపగాబింబిత
స్వాంగాసంగతఁ జేయు శంభుఁడు నృసిం
  హాధీశ్వరుం బ్రోచుతన్.

(అని చదువును)

వృద్ధ—(కొంచె మాలోచించి) ఇఁక నీసంశయ మేమియో చెప్పుము.

శార—ఉత్తమాంగమున గంగను ధరించితివి. నన్నర్ధాంగీకృతఁ గాంచితివి. ఇది న్యాయమా అని సపత్నీమాత్సర్యమును వెల్లడించుచు పార్వతి శివునిఁ బ్రశ్నించెను. శివుఁడు నన్నుమాత్రము వామాంగమున ధరింపనైతినా? చూడుము. అని తన శిరమందున్న గంగయందు పార్వతిని ప్రతిబింబింపఁజేసి చూపి యామెను సంతోషపఱచెను. అట్టిశివుఁడు నరసభూపాలునిఁ బ్రోచుఁగాత యనిగదా యీపద్యభావము?

వృద్ధ—ఇంతికన్న నీపద్యమున మఱొండు భావమేమున్నను?

శార—అయిన నిఁక వినుఁడు. 'గంగం దాల్చితి.............కాంచు' అని సపత్నీమాత్సర్యమునఁ బార్వతి తన్ను ప్రశ్నించినప్పుడు ఆమె నానందపఱచ జేయఁదలఁచిన శివుఁడు చెప్పవలసిన సమాధానము 'నన్నుమాత్ర ముత్తమాంగమున ధరింపలేదా?' అని కాని 'వామాంగంబునం దాల్పనే?' అనికాదు. పార్వతికిఁ గలిగిన మాత్సర్యము సపత్నీమాత్సర్యము. అది తన సపత్నియగు గంగ కిచ్చిన స్థానమును తనకుఁగూడ నిచ్చిననే కాని తీరునదికాదు. అంతకన్న మున్నతస్థానము నిచ్చిననోయని మీరు చెప్పవచ్చును. కాని కవియే యుత్తమాంగపదమును శ్లేషించి యదియే యుత్తమమగు స్థానమనియు, శరీరమున నంతకన్న నుత్తమమగుస్థాన మొం

నొకటిలేదనియుఁ దెలిపెదము న్నాఁడము. కాన నిట శివుఁడు చెప్పినది ప్రశ్నానుగుణమగు సమాధానము కాదు. ఇం కొకటి పార్వతి యీశ్వరుని యర్ధాంగమున నుండుట తానెఱుంగదనిచో ? శివుఁడు శ్లాఘగాబింబితఁ జేసి చూపుట యెఱుఁగదనియే యనుకొందము. ఐననో 'నట్టి నైకోలు గానించి యర్ధాంగీకారము' అని చెప్పినదే ? ఇందలి యర్ధాంగీకారము అను పదమునకు శ్లేషభంగిచే నర్ధాంగముగాఁ జేసికొనుటయు నర్థమేకదా ? మఱి యొకమాట. అర్ధాంగీకరణ మనునది పార్వతికిఁ బ్రత్యక్ష దృశ్యమే యగుచుండ నెచ్చటనో చూపు టెందులకు ? చూపినను దర్పణమునందే చూపవచ్చునే ? శిరస్సునందే తలపు టెందులకు ?

వృద్ధు — నాయనా ! శారదస్వతా ! నీవు చూపిన యనుపపత్తులన్నియు బాగుగనే యున్నవి. కాని యిట 'నిను వామాంగంబునన్' అనుటకు మారుగా 'నిను నాయంగంబునన్' అని యుండవలయునేమో యని తోఁచుచున్నదోయీ !

శార — అయిన నర్థమేమి ?

వృద్ధు — నినున్ = నిన్నును, ఆయంగంబునన్ = ఆ యుత్తమాంగమునందే, తాల్పనే = ధరింపనా ? (ధరించియే యుంటినని యర్థము) పార్వతీ ! గంగ స్థానము నిచ్చితినో నీకును నే నాస్థానమునే యిచ్చియుం టిని. చూడుము అనిచెప్పి శ్లాఘగాబింబితఁజేసి పార్వ తిని శివుఁ డానందింపఁజేసెనని దీని భావము. ఇదియే కాక 'శ్లా......దిత' యని చెప్పుటచే 'పార్వతీ ! నీ వనుకొనినట్లు నేను గంగను నెత్తిపై నెక్కించుకొనుట సత్యమేకాని నిన్ను తిరస్కరించితిననుట మాత్రము సత్యదూరము. ఆ నెత్తిపైననేకదా నిన్నుంచితిని.' అని తన జటాజూటమందలి గంగయందు ప్రతిబింబమును చూపి గిరిజ నానందింపఁజేసెనను వ్యంగ్య చమత్కార మును గూడఁ గని యిందుఁ బొందుపఱచినాఁడోయీ !

శార — తాతగారూ ! నా సంశయము లన్నియుఁ దీఱునట్లు బాగుగనే తెలిపిచ్చితిరి. ఐనను నాకిటనిం కొక సంశయముమాత్రము పొడముచునే యున్నది. శివుని యర్ధాంగమున నేకదా పార్వతియున్నది ? అతని శిరమున నేకదా గంగయుండుట ? అట్టిచోఁ దన శిర మున నున్న తన ప్రతిబింబమును తాఁ జూచెనని చెప్పుట గగనకుసుమాయమానము కాదా ?

వృద్ధు — శారదస్వతా ! సెబాస్. అడుగవలసినదే యడిగితివి. వినుము. గంగ నుత్తమాంగమునఁ దాల్చితివి, నన్నర్ధాంగీకృతఁ జేసితివి. అని యలుకనూనిన పార్వతికి శివుడు పాదానతుఁ డాయెను. అప్పు డమిన్నేటియందు పార్వతీరూపము ప్రతిఫలించెను. అదిచూచి నన్నును శిరముననే ధరించెనుగదా నా ప్రాణనాథు డని గిరిజ యానందించెనని కవి చెప్పఁబూనెను. కాని భట్టుమూర్తి గారి కిది ప్రసన్నరచనమగుటచే రసవంతమగు నీభావము నంతయు సహృదయహృదయంగమ మగునట్లు తా నీ పద్యమునఁ బొందుపఱుపలేకపోయెనోయీ ! ఈకొఱఁ తను దీర్చుటకే కాఁబోలు తన వసుచరిత్రమునం దీతఁ డభావమునంతయు దిద్ది మెఱుఁగుపెట్టి చిత్రించి చూపి నాఁడు, చూడుము.

ఆమందాకిని మాళిఁ బూని నను న
ర్ధాంగీకృతం జేసి తా
నా మేల్మేలని యార్య యల్గఁ బ్రణతుం
డై తత్పదాంభోజమో
గామర్శంబున గంగయుక్ మొరయఁ జూ
డాభోగసమ్యక్క్రియా
సామర్థ్యంబున వేఁడు శంభుఁడు కృతి
స్వామిం గృపం బ్రోవుతన్.

శార — తాతగారూ ! మీదయచే నిందలి నా సంశయములన్నియు రూపుమాసినవి. ఇట్టులనే నాకక్కడక్కడ కొన్ని సందేహములు కలవు వినిపింపుమందురా ?

వృద్ధు — నాయనా ! ఇప్పటికే నా కనుష్ఠానము నకు వేళ యతిక్రమించినది. సమయాంతరమున విని పింపవచ్చును. నీకును భోజనపువేళ యాయినది. వెళ్లుదము రమ్ము.

శార — చిత్తము. (ఇరువురు నిష్క్రమింతురు.)

## ఆంధ్రుడు కాకినాడలో



# బియ్యపు బలాబలములు

గుమ్మలూరు సత్యనారాయణ

## ౧

ప్రతిదినము ననుక్షణము ననేక సాధారణ దిన కృత్యముల జేయుచును, వాటియందలి పరిజ్ఞానమును దెలుసుకొనుటకు ప్రయత్నింపకుండుటవలన ననేకదురవస్థలకు బాల్పడుచుంటిమనియు, పరిజ్ఞానముకొరకై తచ్ఛాస్త్రపరిచయము లవసరమనియు నిదివరకే గ్రహించితిమి. ఇందు మన దేశములో, ముఖ్యముగా దక్షిణమున, మూలాహారమగు వరిబియ్యమువలన మన దేహములకు గలుగు దార్ఢ్యతావివరముల పరికించెదము. మనము ధాన్యమును అన్నముగా దినుటకుముందు, మూడు తరగతులలో వరి యెన్నో మార్పులను, భిన్నాహారతత్వములను బొందుచుండునని యెరుగవలసియున్నది. ఇవి i.) పొలములోని సాగు-స్థలము, ఎరువు, వరిరకములందలి భేదములు. ii) బజారుధాన్యము నింటగాని, మరలోగాని దంచి బియ్యము చేయుట, పొల్లుతీయుట, మెరుగు బెట్టుట, ఉప్పుడు బియ్యము చేయుట-మొ॥ వానివలన కలుగు భేదములు iii) వంటయిల్లు-బియ్యమును బాగుగా కడుగుట, అన్నమును వార్చుట-వీటివలని భిన్నపరిస్థితులు. కనుక వరి యన్నము దినుచున్నపుడు అందరమును ఒకేరకమును, ఒకే విధముగ తయారు నోయిన బియ్యమును దినుటలేదని రూఢియగుచున్నది. బియ్యములోని మారుచున్న గతిని బట్టి అది మన కిచ్చెడి బలముకూడ మారుచున్నది. అందువలన ఏయవస్థలలోని యేరకముల వరిబియ్యమును తినిన ఎక్కువబలముగా నుండునో మన మిందు పరిశీలించెదము.

ఇట్టి పరిశీలనకు తొలుత మన మెరుగవలసిన రెండు శాస్త్రవిషయము లున్నవి. (౧) ఏయాహారపదార్థమువలననైన బలము కలుగుచున్నది యనగా నర్థమేమి? (౨) బలము నిచ్చుట కేయే యాహారతత్వములు, ఎట్లు ఎంతెంత, చర్చయందలి యాహారపదార్థము (నిచ్చట వరిబియ్యపురకములు) లో నున్నవి?— ప్రతి యాహారపదార్థములోను నీరు (తేమ), మాంసకృత్తులు, కర్బనోదజనితములు, క్రొవ్వులు, ఖనిజకూటములగు భస్మములు కలవనియును, వాటిలో మాంసకృత్తులు దేహమాంస నిర్మాణమునకును, పిండి, క్రొవ్వుపదార్థములు వరుసగా



పటము ౧.
ధాన్యపు గింజ




పటము ౨.
బియ్యపుగింజలోని యాహారతత్త్వములు.

సిద్ధసాధ్యరూపములలో నున్న ఇంధనశక్తికిని, మిగిలినవి యితర సజీవవ్యాపారములకును వినియోగపడుననియు నెరుగుదుము. ఇక వరిలోని యాహారతత్వములను పరికించెదము.

వరి యేకదళబీజములగు కాయధాన్యములకు జెందినది. ధాన్యపుగింజను నిలువుగా కోసి, యొక పొరదీసి, భూతద్దములో జూచిన రెండవపటములోనున్నట్లు కానవచ్చును. అన్నిటికంటె లోపునను, ఒకప్రక్కకు నున్నది బీజము. (ఇందు బహుసూక్ష్మమగు గర్భమూలకాండములు రెండును కానవచ్చును. గర్భబీజము నానుకొని, దాని భావిజీవనమున కాద్యవస్థలలో తగు నాహారమును, బీజమును, ఆహారమును సంరక్షించుచు తుషావరణము నుండుట గాంచుదుము. భావిజీవికి వరిగింజలో నమర్చబడిన యాహారములో నెక్కువ భాగము పిండిపదార్థములు. దీనిచుట్టును ఆవరించుకొనియున్న మాంసఖనిజకూటము తక్కినది. మాంసఖనిజావరణము వరిలో బహుస్వల్పము. ఐనను ముఖ్యాహారము లన్నియు నిందులో నుండుటంజేసి దీని యావసర మింతింతయని జెప్పుటకు కాదు. శాస్త్రపరిశోధనలలో నెప్పుడును 'బహుసూక్ష్మములు, స్వల్పములు'నుకొను పదార్థములకే కొండంత ప్రాముఖ్య మున్నట్లును, అవి లేకుండిన మిగిలిన వెంతయున్నను ముప్పు వాటిల్లుననియును కనుగొనబడుచున్నది.

సాధారణముగా వరిలోని యాహారతత్వము లీయీ పరిమితులలో నుండుననని యామోదించిరి. ఈ దిగువ పట్టికలో హిందూదేశములోని వరిరకముల సరాసరియును, ప్రత్యేకరాజధానులు కొన్నిటిలో గల పృథక్కరణములు తెలుపబడినవి.

పట్టిక ౧

వరిలోని యాహారతత్త్వముల ప్రతిశతములు

| స్థలము | తేమ | మాంసకృత్తులు | కర్బనోదజనితములు | నార | క్రొవ్వులు | భస్మములు | జీవసుముఖ్యములు |
|---|---|---|---|---|---|---|---|
| హిందూదేశము | 12.80 | 7.30 | 78.30 | 0.40 | 0.60 | 0.60 | |
| చెన్నరాజధాని | 10 31 | 6.96 | 80.27 | 0.46 | 0.88 | 1.22 | మొదటి |
| బెంగాలు | 1t.73 | 7.30 | 79 34 | 0.46 | 0.40 | 0.76 | రెండును |
| బొంబాయి | 12.61 | 7.69 | 74.63 | 0.89 | 2.65 | 1.53 | (ఎ, బి) |
| బర్మా | 11.54 | 7.54 | 78.59 | 0.58 | 0.98 | 0.77 | |

దీనినిబట్టి ముఖ్యముగా బొంబాయి రాజధానిలోని వరిరకములలో సాధారణముగా నెక్కువ ప్రతిశతములలో యాహారతత్వము లున్నవని విశదమగుచున్నది.

మనదేశములో వరితోసహా మూలాహారమయిన గోధుమలు, జొన్నలు, చోళ్లు, గంటెలు ఒకదానితో నొకటి పోల్చిన నెట్టులుండునో, యేప్రత్యేకతత్వములో నెయ్యది యెక్కుడుగా నున్నదో తెలుసుకొనవలెను.

పట్టిక. ౨.

## మన దేశములోని మూలాహారములందు గల యాహారతత్త్వముల తరతమములు

| ముఖ్య ఆహారతత్త్వములు | వరి (బియ్యము) | | గోధుమ | చోళ్లు | జొన్నలు | గంటెలు |
|---|---|---|---|---|---|---|
| మాంసకృత్తులు | 7.3 | తవుడు | 9.74 | 9 44 | 9.71 | 9 52 |
| కర్బనోదజనితములు | 78.3 | 5.72 | 70.18 | 60.13 | 72.38 | 73.52 |
| క్రొవ్వులు | 0.6 | 34 25 | 1.76 | 4 93 | 3.69 | 5.83 |
| భస్మములు | 0.6 | 8.31 | 2.98 | 7.65 | 2.05 | 2.08 |
| జీవసుముఖ్యములు { ఎ- | బ. స్వ | 18.34 | + + | + + | + | + |
| జీవసుముఖ్యములు { బి- | + | + | + + + | + + | + + | + + |

దక్షిణమున బెరుగు పంటలలో చోడి యెంత ప్రశస్తమైనదో గాననగును. దానినే ముఖ్యాహారముగా జేసుకొనియున్న రైతుభోజనము మన కసహ్యమట. మైసూరులో నిది విస్తారముగా బెరుగుచున్నది. అచట మహారాజుగారుకూడ ప్రతిదినము నింతో యంతో చోడిని తిందురని ప్రతీతి.

౨

ఇక వరిరకములను, వాటి నామకో యున్న యాహారమూల్యములను దెలుసుకొనెదము : రెడ్లను వడ్లను లెక్కింపలేమని యార్యోక్తి మన మెరిగినదే. కనుక నావడ్లరకముల నన్నిటిని తర్కించుట సులభసాధ్యము కాదు. ఐనను మనరాజధానిలో వరి సాగుచున్న ఉత్తర సర్కారులలోని ముఖ్యమగు వరిరకములును, దొరకినంత వరకు వాటివివరములను ఈదిగువ పట్టికలో జూపబడియున్నవి.

పట్టిక. 3.

## ఉత్తరసర్కారుల వరిరకముల వివరములు :

| రకము | జిల్లా | తేలిక-తే. బరువు-బ. | సవర్ణము-స. శ్వేతము-శ్వే. | ముతుక-ము. సన్నము-స. మధ్యమము-మ. | మొదటిపంట-౧. రెండవపంట-౨. మెట్టపం -మె. |
|---|---|---|---|---|---|
| బయ్యహుండ | గంజాం | బ | శ్వే | మ | |
| బోరోపాంకో | విశాఖపట్నము | తే | స | ,, | మెట్ట పంటలు |
| మొహింపాళో | | బ | ,, | ము | గంజాంలో విప |
| మొంసియపుల్లో | | ,, | శ్వే | మ | రీతము. |
| జిలిపయాగి | | ,, | ,, | స | |
| సన్నఖిల్లో | | తే | ,, | ,, | -ఈ జిల్లాలలో |
| సీతాసాళో | | ,, | ,, | ,, | రెండు వరిపంటలు |
| బోహులో భేణి | | ,, | స | మ | లేవు కాని చెరువు |
| నవకోటిసన్నవు | | బ | ,, | ,, | నీటి యాధారము |
| కంకసాంభ | | ,, | ,, | ,, | గల కోట్ల చిట్టెడు |
| సిసాంపు | | ,, | శ్వే | ,, | లు వేసవిలో పం |

| రకము | జిల్లా | తేలిక-తే. బరువు-బ | సవర్ణము-స. శ్వేతము-శ్వే. | ముతుక-ము. సన్నము-స. మధ్యమము-మ. | మొదటిపంట-మొ. రెండవపంట-౨. మెట్టపంట-మె. |
|---|---|---|---|---|---|
| బెన్నభోగి | | తే | ,, | ,, | డించెదరు. పిదప |
| బిక్కిరిసన్నము | | బ | ,, | స | మామ్ములు గా |
| గుణుపురంసన్నము | | ,, | ,, | ,, | మరల వరివచ్చును. |
| రత్నచుడి | | ,, | ,, | ,, | |
| సత్తికాలు | | తే | స | ము | |
| చిట్లేడులు | | ,, | ,, | ,, | |
| చిట్టిముత్యాలు | | బ | శ్వే | మ | |
| మెట్టబుడగలు | గోదావరి | తే | స | ము | మె |
| బుడమలు | | ,, | ,, | ,, | ,, |
| కోనామణి | | బ | శ్వే | ,, | ౧ |
| పునాసకోనామణి | | ,, | ,, | ,, | ,, |
| రసంగి | | తే | స | ,, | ,, |
| జిలమ | | ,, | ,, | ,, | మె |
| కాశీపిచోడి | | ,, | శ్వే | స | ౨ |
| అక్కుళ్లు | | బ | శ్వే | మ | ౧ |
| దాళవ | | తే | స | ము | ౨ |
| స్వర్ణాలు | | ,, | శ్వే | ,, | ,, |
| గరికసన్నము | | ,, | స | ,, | ,, |
| కృష్ణకాటుకలు | కృష్ణ, గుంటూరు | బ | శ్వే | స | ౧ |
| గుత్తికుసుమ | | ,, | ,, | ము | ,, |
| అట్రగడ | | ,, | ,, | ,, | ,, |
| కేసర | నెల్లూరు | తే | స | ,, | ౨ |
| మొలకొలకులు | | బ | శ్వే | ,, | ౧ |
| పిషాణము | | బ | స | ము | ,, |
| ఈశ్వరకోర | | ,, | ,, | ,, | ,, |

గంజాంజిల్లాలో నెక్కువగల వరిరకములకు, వరి సాగువిధానములకును అందలి విపరీతమగు నైసర్గికస్వభావమును, కొంతవరకు ననాగరికతయు కారణము లయి యుండవచ్చును. శాస్త్రరీతిని విమర్శించిన యొకేరకము రెండు మూడు పేర్లలో వేరువేరుచోట్ల వ్యవహరింపబడునటుల నగుపడగలదు. మాటకు మహీపా, కోనామణి, కుసుమయును; గరికసన్నము, కేసరియు; మొలకొలకులు, తంజావూరులోని నెల్లూరు సంబారయును; వంకసన్నం, ఢిల్లీ భోగాలును; మొసియపుల్లా, చిట్టిముత్యాలును; యొకే స్వభావము, ధర్మము కలిగియున్నటుల కానబడును. ఇదివరకు గంజాం వరిరకములపై శాస్త్రపరిశోధన లేకుండుటచే ౩, ౪ సం. వెనుక బరంపురములో గవర్నమెంటువారు ఒక నూతన ధాన్యపరిశోధనస్థానమును నిర్మించిరి. కొంతకాలము పోయిన పిదప అందుండి కొంత తేలగలదు.

రకములు వాటి నామము, నామాంతరము లెట్లున్నను మనము దీసుకొనవలసినది వాటి స్వభావములు, ధర్మములు. ఇవి మీదిపట్టికలో పేర్కొనబడినవి; గాని పాఠకుల కొక హెచ్చరిక గలదు. దేశవాళిరకములన్నియు నధమము రెండు మూడు రకముల కలగూర

గంపయే. అందుచేతను పట్టికలో నుదాహరించిన వివరములను ఆదర్శముగ దలంచక, నొక యుద్దేశము నిచ్చునవి యని యూహింపవలెను.

## ధాన్యస్వభావస్వధర్మములవలన మారుచున్న యాహారతత్వములు

౧. తేలికలు-బరువులు: తేలికలనగా స్వల్పకాలములో నాయారకములు పంటముఖమును బట్టునవి. బరువులనగా వాటికి వ్యతిరేకము. ఎన్నో రకముల పృథక్కరణమును సరాసరి చేసిచూచిన నీ రెంటికి భేదముతగా కనుపడకపోయినను, స్వల్పముగా మాంసకృత్తులలోను క్రొవ్వుపదార్థములలోను వ్యత్యాస మగుపడును. మనభాగములలో నొక వాడుకయున్నది. తేలికలగు గరికసన్నము, రసంగి, దాళవా, స్వర్ణాలు కొంచెము వాతకారియనియును, ఆగుణము విరుగుటకు వాటిని ఉప్పుడుబియ్యముగాజేసితినవలయుననియు ప్రతీతి. అటులనే బరువులగు రత్నచూడి, అట్రగడ, కృష్ణకాటుకలు, కొనామణి తినుటకు బాగుండుననియును అభిప్రాయము గలదు. ఈ యభిప్రాయములకు సరియగు నాధారము కలదో, లేదో చెప్పుట కష్టము. కాని వాటి యాహారపదార్థతత్వములను జూచిన యీ తేలికలలో మాంసకృత్తులు, క్రొవ్వుపదార్థములు నెక్కువయున్నట్లు (ఖనిజములు), భస్మము తక్కువయున్నట్లును కానవచ్చును. ఈ యవస్థకును, వాటి దుర్గుణములకును సంబంధ ముండునా? ఉప్పుడు చేయుటవలన విరుగు డెట్లు కలుగుచున్నది? ఉప్పుడుబియ్యము చేయుట యనగా ధాన్యమును తగుమాత్రము నీటిలో కొంచెముసేపు వేడిచేసి, యెండబెట్టి దంచి బియ్యమును దీయుట. ఇందేమి మార్పులు జరుగుచున్నవి? మాంసకృత్తులు ఘనీభవించి అన్యరూపములను బొంది, కొంతవరకు పూర్వధర్మములనుండి తొలగును. భస్మములోని ఖనిజములు తుషావరణములో నుండికూడ కరగి లోనున్న బియ్యపు గింజలోనికి దిగుటవలన, ఉండిన కాసంత భస్మము ఊకద్వారా పోక బియ్యములో నిలచును. వీటితోపాటు పైభాగములలోనుండి ఊక, పొల్లు ద్వారా సాధారణముగా పోయెడి జీవన్మ్రఖ్యములు బియ్యము నానుకొని యుండును. ఇట్టి నూతన రసాయనపరిస్థితులవలన ఆ బియ్యపురకముల వాతకారిగుణము విరుగునా? అదిగాక చక్కని సాగులో నుండని మోటురకములలో మాంసకృత్తులు, క్రొవ్వులు, భస్మములు నెక్కువగా ఉండునని యమెరికాశాస్త్రజ్ఞు డొకడు దెలుపుచున్నాడు. సాగునుబట్టియు, భూమియొక్క సత్తువను, వేసెడి యెరువులను బట్టియు నాఫలసాయములోని జీవన్మ్రఖ్యములు (ముఖ్యముగా రెండవది-బి) తమతమ పరిమితులలో మారుననియు దెలియుచున్నది. మోటురకములకు సరియగు కృషి లేనందున అందు జీవన్మ్రఖ్యములు తక్కువ కాగలవు; తుదకు రోగకారణములు కాగలవు. పైనుదాహరించిన దాళవా, స్వర్ణాలు మొ. వి మోటురకముల కీయవస్థలలో సంబంధించి యుండవచ్చును. ఎందుచేతననగా ఈ దురభిప్రాయముగల రకములన్నియు రెండవ పంటలోనే యున్నవి. రెండవపంటకు సరియగు యెరువులు, పూర్వోత్తరకృషులుకూడ నుండవనియును, ఎక్కువకాలము భూసారమును దీసివేసెడి పెద్దపంటలగు బరువురకముల వెంటనే యీ తేలికలు వచ్చుచున్నవనియును మన మెరిగినదే. కనుక నీతేలికలలో జీవన్మ్రఖ్యములు తక్కువగా నుండుట కవకాశమున్నది. ఇట్లు వాతకారియైనను కావచ్చును. ఇవి యన్నియును ప్రజాభిప్రాయమును వితర్కించుటకు గల పరిస్థితులు. సరియైన కారణము తెలియనప్పు డెన్నెని రూఢికాని యభిప్రాయములను పేర్కొనవచ్చును. కనుక నీ ముఖ్యవిషయము తత్కృషిశాస్త్రవేత్తలకే చర్చకు దగును. ఒకప్పుడు శాస్త్రపరిశోధనలచే ప్రజాభిప్రాయము, అనుభవము స్థిరపడినచో చాలకాలముక్రిందటనే పరిరకముల బలాబలములు చక్కగా మనవా రెరిగియుండి రనిడిది నిర్వివాదాంశము.

౨. ముతుకలు-సన్నములు: పెక్కుమంది సన్నధాన్యమునకు వాపోవుట కలదు. దీనికి గల కారణము వాటి యాహారతత్వ ప్రాధాన్యమేమో యని చూచినచో, ఇంతో అంతో ముతుకలకన్న సన్నములే దుర్బలములట్లు విశదమగుచున్నది. లోన లొటారము, పైకి బటారము గల వస్తువులు సాధారణముగా ధనికుల కాకర్షణీయముగా నుండుటచేత తొలుత వారివద్దనే యంకురించినదేమో యీ దురభిప్రాయము!

3. శ్వేతములు - సవర్ణములు: తెల్లబియ్యము కొరకు నొకటి-రెండు కాసు లెక్కువైనను మనము

పోవుచున్నాము. బహుశః తెల్లబియ్యపు అన్నము చూచుట కందముగా నుండుననియే. ఒక్క భస్మములలో స్వల్పముగాదక్క నన్యత్ర భేదము కానరాదు. అదైనను స్వభావసిద్ధమే. ఎందుచేతననగా వర్ణమునకు కొన్ని (ఖనిజ)రసాయన ధాతూపధాతువులు కారణములు.

ఇట్టివిభజనపై వాదోపవాదము లటున్నను, ముతుకలు, సన్నములు, శ్వేతములు మొ. వి యొక స్థితిలోనుంచి మరొకస్థితిలోనికి సాగుజేయుస్థలముబట్టి మారుచుండుట గోచరమగుచున్నది. సన్నములని యొకరకము నెక్కడనో కొనితెచ్చి తనపొలములో వేసిన నవి 'ముతుకల'గుట కర్షకు లెరిగినదే.

౪. సజీవపు యెరువులు-జీవనుఖ్యములు: ధాన్యములు తమ రకములలోను, స్థలములలో గల భేదములను, సాగు:వేయుబడు నెరువులబట్టికూడ పొందుచున్నవని యిటీవలి శాస్త్రవేత్తలు దెలుపుచున్నారు. బాగుగా చివికిన పశువుల యెరువు వేసి సాగుచేసిన గింజలలోని యాహారపుష్టియు, జీవనుఖ్యాధిక్యమును గలుగుటచేత నట్టిగింజల యాహారమును మనము తినిన ఎక్కువ బలమనియు పరిశీలించి ప్రదర్శించిరి. దీనికి కారణము పశువుల యెరువులో వృక్షాహార తత్వములు సంపూర్ణముగా నుండుటచే సస్యములకు సరియగు పుష్టిని గలుగ జేయుచున్నది. అదిగాక యొక్క భాస్వరపుయెరువులు (ఎముకలపొడి, సూపరు మొ. వి) వేసిన గింజలలోని పూర్ణత, పటుత్వమును; కారపు యెరువులవలన (బూడిద, పొటాషు మొ॥) పిండి పదార్థ సముచ్చయమును, నత్రజనివలన (అమ్మోనియా, గానుగపిండి మొ.వా ధాతువులు) మాంసకృత్తులును మారగలవని తెలియుటచేత మన ముపయోగించెడి యెరువులవలన ధాన్యముల యాహారతత్వములను (మన భూసారము, వరిరకము, మన యవసరము లేక ఉద్దేశము మొ. వాటిని చర్చించి) మార్చగలమని విశదమగుచున్నది. వేరువేరు స్థలములలో గల భిన్నాహారతత్వములకు నానాభూములలో గల భిన్నవృక్షాహారపదార్థములు కొంతవరకు కారణములని తెలియుచున్నదికదా.

సాగులోనుండి వచ్చిన ధాన్యములు, బియ్యములుఎట్లు భిన్నములై యున్నవో యిట్లు తెలుసుకొనిన పిదప వాటికి మన విలాసములవలన బజారులలోను, వంటయింటి యవివేకమువల్లను నెట్టిదురవస్థలు రానున్నవో యికజాచెదము.

## 3

ధాన్యమును ఇంట రోలు, లేక 'ఢెంకి' యందుగాని, బియ్యపుమరలలోగాని దంచి, పొల్లు చెరగి, బియ్యమును దీయుచున్నాము. వీటినే మనము దంపుడుబియ్యమనియు, మరబియ్యమనియు క్రమముగా వ్యవహరింతము. ఇవిగాక యుప్పుడుధాన్యమును దంచిన యుప్పుడుబియ్యమనుచున్నాము. ఉప్పుడుబియ్యము సాధారణముగా తెల్లగా నుండదు. మనజిల్లాలలో ధనికు లంతగా దీనిని వాడరు. కాని మలబారులో విస్తారము వాడుకయందున్నది.

ధాన్యము నింట దంచి, యూకను దీయుటలో తుషావరణమునకు దగ్గరగా నానుకొనియున్న మాటు ఖనిజావరణము కొంత దెబ్బతిని పోబోవుటకు సిద్ధముగా నుండును కాని మరలలో దంచినపుడు గోకలిపోదునన్న బలమగు దెబ్బయు, ఎక్కువగాలితో బాగుంక పొట్టుపోవునటుల విరుటయు నుండుటచేత నా మాంస ఖనిజావరణము కొంతవరకు పోవును. కనుక దంపుగా బియ్యముకంటె మరబియ్యము బలహీనము.

బియ్యమునకు బాగుగా మెరుగుపెట్టుట కలదు. అనగా దంచిన బియ్యమునకే మరొకపోటుబెట్టి, బాగుగా చెరగిన, తవుడు దీసి, ఛాయబెట్టుట. లోనున్న తెల్లని పిండిపదార్థ మగుపడువరకు నటుల జేసినగాని ఛాయ రాదు. మాంసఖనిజావరణము తవుడుమూలముగ పోవుచున్న కొలది బియ్యమునకు ఛాయవచ్చును. ఛాయ వచ్చుకొలది బియ్యములోని బలమైన భాగము పోవుచున్నది.

వండుటకు ముందు బియ్యమును బాగుగా కసనీరు (కడుగు) పోవువరకును కడుగుచున్నాము. కసనీరు పోవువరకు కడుగుచున్నామనిన మాంసఖనిజావరణము పూర్తిగా పోవువరకు నన్నమాట. ఇదివరకు వచ్చిన విఘాతములలోనే సగము నశించగా మిగిలిన

భాగములో నెక్కువగా మరల నీకడుగునుండి బలమగు భాగము పోవుచున్నది.

అంతతో నూరుకొనక బియ్యమును బాగుగా నుడుకబెట్టి, వండునపుడు, పైకివచ్చిన సారాంశము నంతయును గంజిరూపముగా వార్చి పారబోయుచున్నాము ఇట్లుచేయుటవలన గంజిద్వారా మాంసకృత్తులు —౮%, క్రొవ్వుపదార్థములు—౫౦%, పిండిపదార్థములు—౮%, భస్మములు—౧౬%ను బియ్యముల సత్తువ పోవుచున్నది.

తొలుతను మరలోను, పిదప మెరుగులోను, ఆ పిదప కడుగులోను 'పోగా నింకను మొండివలె నెక్కడినో నతుకుకొనియున్న రవ్వంత మాంసఖనిజ భాగమును ఉడికించి, పైకిలాగి, పంతము పట్టినట్లు పారద్రోలుచున్నాము. దానితో పాటు (బియ్యము నుడికించి గంజిని త్యజించునపుడు) అందు ఎక్కువగా క్రొవ్వు పదార్థములుకూడా పోవుట జూచుచున్నాము. ఇక మిగిలినదేమి—పిండి పదార్థము, తినుమాత్రము భస్మములును. వీటిని, బలహీనమయి సగము చచ్చిన యా మెతుకులను, కడుప్రీతిగా బలమైన యన్నమనియు కడు ప్రశస్తమనియు తలచి తినుచున్నాము. ఇట్టియన్నమువలన శరీరములో నొక్కవేడి (ఇంధనశక్తి) తక్కయితరము లేవియు కలుగకున్నవి. ఆ వేడికి తగిన తైలమున్నకదా యందు బూరెలో గారెలో నేచుటకు. అట్లు లేనందున నా వేడికి రెండు తిలల జార్చవలసినదే.

వీటితో నీ దురవస్థ యాగక జీవన్మఖ్యములకు కూడ నెంతో నష్టము వచ్చుచున్నది. మాంసఖనిజావరణలో జీవన్మఖ్యములుకూడ నుండును. చిట్టు, తవుడులతో నాయావరణము, నందలి జీవన్మఖ్యములునుకూడ నన్నములో లేకుండ పోవుచున్నవి. అసలు ధాన్యములో నున్నవే రెండు. అందు మొదటిది బహుస్వల్పము. రెండవదికూడ కడు పేదిగా నున్నది. 'ఎ' జీవన్మఖ్యము (మొదటిది) మన శరీరమునకు నంటురోగములు రానీయక కాపాడును. శరీరములో నీరు పట్టక గాచుచుండును. ఇది లేనందువలన 'రేచీకటి' కూడ వచ్చునని తెలియుచున్నది. ఇక రెండవదియగు 'బి' జీవన్మఖ్యము లేకుండిన మణుకులు, మోకాళ్లు, ముంజేతులువాచి, నొప్పులెక్కి తుదకు స్మృతి దప్పినట్లు చచ్చియుండును. అందు నీరు చేరును. గుండెజబ్బులు కూడ వచ్చును. ఇట్టి రోగమునకు పూర్తిగా నొక్క వరియన్నము దిని బ్రతుకువా రెందరో ఆహుతి యగుచున్నారు. ఈ రోగమునకే 'బెరిబెరి' యందురు. ఈ రోగములు వచ్చినపుడు 'బియ్యపు తవుడు'ను రొట్టెలుగా జేసి తినుమని వైద్యులందురు. ఎందుచేతను?—మన తెలివి తక్కువచే బియ్యములో నీజీవన్మఖ్యములను తవుడుద్వారా బోగొట్టుకొనుచున్నాముకనుక.

సజీవఫల బెరువులు (పసువులపెంట మొ.వి) వేసిన యాజీవన్మఖ్యాభివృద్ధి విత్తులలో కలుగును. అట్టిధాన్యములను నిలవజేయుటలోకూడ కొన్ని పద్ధతు లున్నవి. ఎట్టకేల కీపద్ధతులు కొన్నిప్రాంతములలోనైన నుండుట ప్రశంసనీయము. గంజాం,విశాఖపట్నము, దత్తమండలములలో భూమియందు ౩౯ అ. లోతున గొయ్యిజేసి, యందు గడ్డి, చాపలు మొ.వి పరచి, ధాన్యమును పోసి, తిరుగ మూసి, తవ్విన మన్నును మీద కప్పుదురు. దీనినే ధాన్యమును పాతరవేయుట యందుము. అట్టి ధాన్యపు గోతులలో బొగ్గుపులుసువాయువు, ఉష్ణము, నెక్కువగా నుండుటచేత జీవన్మఖ్యములు నశించవు. అదిగాక ధాన్యములో నొక విధమగు 'పూర్వపాకము' కూడ నగును. అందువలన పాతరవేసిన ప్రాతబియ్యము మంచిదని సర్వత్ర నామోదించబడియున్నది. గడ్డిచుట్టలలోను మేదరి పొణకలలోను, కొట్లలోను కన్న గోతులలో నిట్లు పాతరవేసిన ధాన్యపుబియ్యము ప్రశస్తములైయున్నవి.

ఉప్పుడుధాన్యముమిగిలినవాటికన్న శ్రేయస్కరమైనను,మామూలుగా వంటకు ముందు వాటిని పదేపదే కడిగి, సారలనూడబెరికిన మిగిలినవాటి గతియే దీనికిని సంభవించును.

## విషయసంగ్రహము:

౧. మనదేశములో నెన్నోకోట్ల ప్రజలకు వరిబియ్యము ముఖ్యాహారమయియున్నది. కాని యంతటను వాడుకలోనున్న బియ్యము లొక్కవిధముకాదు, ఒక్కరకముకాదు. ఇట్టి వివిధావస్థలను బట్టి బియ్యమునకు గల బలాబలములు మారుచున్నవి.

౨. ఆ వివిధావస్థలకు కారణములు మూడు:

a) తొలుత-రకములు. వాటిని సాగుజేసెడి నేలలు. తదితర కర్షక నియమములు.

b) పెంప ప్రజల విలాసము ననుసరించి బజారున కనేక రూపములలో నమ్మకమునకు వచ్చుచున్న బియ్యపు తరగతులు.

c) తుదకు-తెల్లని మల్లెపువ్వుల యన్నముకొరకు వంటయింట జేసిన యవివేకపు పరిచర్యలు.

౩. "బరువులు శ్రేష్ఠమనియు, తేలికలు లేక చులకనలుకొన్ని వాతకారులని"యు గల ప్రజాభిప్రాయము విమర్శించబడినది. వరిలోని యాహారతత్వములు, బరువులు, తేలికలు ; శ్వేతములు, సవర్ణములు ; ముతుకలు సన్నములు మొ॥రకములబట్టి, మారుచున్నవి వైవిధ్యము లంత విస్తారముముగా లేవు.

౪. సాగులో వేసిన యెరువులబట్టి గింజల యాహారతత్వములు చక్కగా మారగలవు. సజీవపు పెరువులను పసులపెంట, గానుగ రొట్టలు మొ॥వాటివలన గింజలలోని జీవస్సత్వములు హెచ్చును.

౫. బియ్యమును మెరుగుబెట్టుచున్నకొలది బియ్యములోని మాంసకృత్తులు, ఖనిజములు, జీవస్సత్వములు, తవుడుబిట్టుపొల్లుమూలమున పోవుచున్నవి.

౬. వండుటకు బియ్యమును నెక్కువకాలము కడుగుటవలన నెక్కువ సారము కడుగునీరుమూలమున పోవుచున్నది.

౭. గంజిని వార్చి, విసర్జించుటవలన, బియ్యములోనున్న క్రొవ్వు పదార్థములు కూడ సగము పోవుచున్నవి.

౮. మామూలు బియ్యముకంటె నుప్పుడుబియ్యము మంచిది. కాని వీటిని కడుగుచున్నకొలది యందలి సారము పోవును.

౯. గోతులలో పాతరవేసిన పాతబియ్యము ప్రశస్తము.

౧౦. తుదకుబియ్యమువలన నెక్కువబలము పొందుటకు—"ప్రాతముతుకబియ్యము (నుప్పుడుచేసిన మంచిది) నింట దంచి, యెక్కువగా చిట్టు, తవుడును చేరిగి తీసివేయక యుంచిన పిదప, బియ్యమును చాలకాలము కడుగక, గంజిని పారబోయక నత్తెసరు బెట్టి తినవలెనని" గురిగానుంచుకొనవలయును.

అనుబంధము

మాంసఖనిజావరణము—(Aleurone Layer )
తుషావరణము—(Pericarp and Testa fused.)
గర్భకాండము—(Plumule.)
గర్భమూలము—(Radicle.)

ఇంధనశక్తి. (Energy.) ఇంధనమనగా వంటచెరుకు. మనశరీరములో వంటచెరకువలె పిండిపదార్థము లెక్కువ త్వరగా వేడిపుట్టించి పనిజేయుటకు దగు చురుకుదనము లేక శక్తి నిచ్చును. అందుచేతను ఈ విధమగు శక్తికి 'ఇంధనశక్తి'యందుము. పిండిపదార్థములకన్న క్రొవ్వు పదార్థములకు రెట్టింపంతల యింధనశక్తి గలదు.

కర్బనోదజనితములు—పిండిపదార్థములు—(Carbohydrates.) వీటికే 'శక్తిదములు', 'ఓజసములు' అని యనగలము.

క్రొవ్వు—నమురుపదార్థములు—(Fats.) ఈ పదములు రెండును విరివిగా నొకేయుద్దేశమును దెలుపుటకు వాడబడుచున్నవి. పంచదారలలోని యింధనశక్తిని పిండిపదార్థములను, వీటిలోని శక్తిని క్రొవ్వుపదార్థములను ఘనీభవింపజేసి, తక్కువస్థలములో నెక్కువశక్తిని ఉంచును. అందుచేతనే బాగుగా క్రొవ్వెక్కిన జీవములు తిండిలేక చాలదినములవరకు నుండగలవు.

సజీవపు పెరువులు—(Organic Manures.)

మోటువరిరకములు—(Crude Rices.)

నారపదార్థము—(Crude Fibre.) మన యాహార పదార్థములను కాయగూరలలో పీచువంటి భాగముండుట నెరుగుదుము. అదియంతయు కాయగూరలలోని జీవకణముల(cells)యావరణలు. అనగా కణకవచములు. (cell_walls). ఇవి కణశర్కరముల(cellulose)తో తయారుజేయబడినవి.

ఆహారతత్వములు—(Food Ingredients) లేక యాహారపదార్థఘటకావయవములగురించి యెక్కువ వివరములు ఏప్రిలు ౩౫ "చంద్రిక"లోని 'మనయాహారచరిత్ర' యను వ్యాసమున దెలియగలవు.

# సాముద్రికశాస్త్రము

## ౫. ఐశ్వర్యభావము

**కోటమర్తి చినరఘుపతిరావు**

వంకరటింకరలతో గూడిన ధనరేఖ తఱచుగా దెబ్బలాంటులక్షణము. అభిప్రాయములు మార్చుకొనుచుండుట ఏకార్యాచరణమునందునను స్థిరత్వములేక కార్యభంగ మొనరించుకొనుట మొదలగు లోపములతో నిండియుండును. (చూ. ౧ వ పటము)



పటము ౧

ఇందులకు కారణ మేమనగా తిన్నగ నుండు ధనరేఖ ధనార్జనమందు ఏకపథమును నిరూపించును. ధనరేఖలోని ప్రతివంకర ధనార్జనావిధానమును మార్చుటనో, నివాస స్థానమును ధనార్జనముకొఱకు మార్చుటో జరుగుచుండుట సూచించును. కొందఱు స్థానమును మారుట సూచించుచున్నదని చెప్పినప్పుడు సహజముగా నే వైపునకని ప్రశ్నింతురు. కాని హస్తములలో దిక్కులు సూచింపబడవు. నిర్దిష్టముగ దిక్కును సూచించి చెప్పు సాముద్రికశాస్త్రవేత్త దగాకోరు చెప్పుచున్నాడని నిశ్చయించుకొనవలెను. ధనరేఖలోని వంకర ధనార్జనమునందే సాధారణముగ భిన్నమార్గముల నిరూపించును. అందుకొఱకు తఱచు భావములను మార్చుకొనుచుండును. వృత్తి మారుచుండుటచే, తగినంత ధనము లేక దానికొఱకై చిక్కుల బడుచు అస్థిమితతను వెల్లడించుచుండును.

ధనరేఖ ప్రారంభములో పలవగా ప్రారంభించినచో అన్యసాహాయ్యమును సూచించును. (చూ. ౨ వ పటము)



పటము ౨

ఈరేఖయే దిగువగా ప్రారంభించినచో దత్తత నిరూపింపవచ్చును.(చూ. 3వ పటము)

ఎవరైనను ఆస్తికొఱకై దత్తత చేసికొందురుగదా! ఆస్తి గలిగినవారు దత్తత చేసికొ

నునప్పుడు తమ చెప్పుచేతలలోనుండి తిన్నగ నడచుకొనవలెనను నుద్దేశముతో గదాదత్తత



పటము 3

స్వీకారమును చేసికొందురు. అందుచే చిన్నతనములోనే దత్తత చేసికొనినగాని ప్రేమాభిమానములు పెరుగవని, చేసికొని వానిని గారాబముగ పెంచికొందురు. ధనరేఖ మొద



పటము ౪

టినుండియు నుండుట, యితరశాఖ అనగా అన్యసంబంధమువలన ధనప్రాప్తి యీరెండు నుకలిపి అన్వయించుకొని అట్టిరేఖలవలన దత్తుడని చెప్పవలెను.

కాని దత్తులందఱు కట్టిరేఖ యుండ నక్కరలేదు. (చూ. ౪ వ పటము)

ఈపటమునందలిచేయి దత్తునిదే. కాని పై చెప్పిన లక్షణము లన్నియు నిందు వర్తింపవు. ఈచేయిగలజాతకుడు నిజమునకదృష్టవంతుడే.



పటము ౫

చిన్నతనమునుండియు మంచి ఐశ్వర్యమును, ఆనందమును ననుభవించెను. అందుల కాధనరేఖయే కారణము. ఇతడు స్వంతకుటుంబములోని దత్తుడేకాని పైవాడుకాడు. ఆకారణముచే ధనరేఖ ద్వితీయశాఖను గలిగియుండలేదని చెప్పవచ్చును. (చూ. ౫ వ పటము)

ఈ ౫ వ పటములోని చేయికూడ దత్తునిదే. ఈచేతిలో భిన్నశాఖ ధనరేఖ లో లేదు. అంతమాత్రముచే నీతడు దత్తుడు కాడని చెప్ప వీలులేదు. ఈతని ధనరేఖను బట్టి చిన్నప్పటినుండియు నైశ్వర్యవంతుడని మాత్రము చెప్పగలము. కాని యీతడు దత్తుడే. సాధారణముగా శాస్త్రములో చెప్పిన చిహ్నములన్నియును నుండనక్కఱ లేదు. ఫలితముల జెప్పుటకు చంద్రస్థానములో బయలు దేరిన ధనరేఖ హృదయరేఖతో నాగిపోయి నచో అమితమైన వ్యయముచే సౌఖ్యదూరుడగుటయు, లేక ప్రేమ భగ్నమగుటయు తట స్థింపవచ్చును. (చూ. ౬ వ పటము)



పటము ౬



పటము ౭

శిరోరేఖపైనుండి ప్రారంభించిన ధనరేఖ వక్రగతిని శనిస్థానములోనికి పోయినచో కష్ట జీవియగును. (చూ. ౭ వ పటము)

వంకరటింకరలతో నుండిన రేఖ తన సహజమైన మంచిశక్తిని పోగొట్టకొని అనుగ్రహము ముగా వచ్చునట్టియో, లేక సంపాదితమగు నట్టియో దుస్థితి, లేకనీరసస్థితిని నిరూపించును.

ధనరేఖ గురుస్థానములో నాగిపోయి నచో సర్వవిధలాభములును, అనుకూలమైన వివాహమును ఫలితము లని చెప్పవలెను. (చూ. ౮ వ పటము)



పటము ౮

ధనరేఖ బుధస్థానములో నాగిపోయినచో వ్యాపారలాభము. (చూ. ౯ వ పటము)



పటము ౯

ధనరేఖ శనిస్థానములో పాయలై ఒక పాయ గురుస్థానములోనికిని, ఒకటి శనిస్థాన ములోనికిని, మరొక్కటి రవిస్థానములోనికిని పోయినచో సదాశయములు, ధీశక్తి, బుద్ధి

వికాసము, ఆర్జనము మొదలగు శుభలక్షణములు పట్టును. (చూ. ౧౦ వ పటము)



పటము ౧౦

ధనరేఖ దిగువభాగమునకు శాఖలు పంపినచో ధననష్టములు. (చూ. ౧౧ వ పటము)



పటము ౧౧

ధనరేఖ ఎగువభాగమునకు శాఖలు పంపుచో ధనలాభములు. (చూ. ౧౨ వ పటము)



పటము ౧౨

ధనరేఖలో ఎగువభాగమునకు బోవు శాఖలు రవిస్థానములోనికి బోవుచో నమితమైన ధనలాభము, ధీశక్తివలన ధనార్జనము కలుగును. (చూ. ౧౩ వ పటము)



పటము ౧౩

ధనరేఖ చిద్రుకమై యున్నచో నాస్త మరణము, లేక జీవితములో మార్పు సంభవింపవచ్చును. ధనరేఖలో నాస్త మరణమును గూర్చి గత వ్యాసములో వ్రాసియుంటిని. (చూ. ౧౪ వ పటము)



పటము ౧౪

ధనరేఖ చిద్రుకమై యుండుటేగాక వివిధస్థానములలో నష్టరేఖలచే తెగగొట్టబడినచో దుర్దశపరంపరలుగావచ్చును. (చూ. ౧౫ వ పటము)

చంద్రస్థానములోనుండి యొక రేఖవచ్చి ధనరేఖతో కలుసుకొనిన వెంటనే ధనరేఖ



పటము ౧౫

తెగిపోయినచో సీటిగండమువలన మరణము, లేక ప్రేమింపబడినవారివలన స్వామిద్రోహ



పటము ౧౬

ముచే ప్రమాదము తటస్థించుట. (చూ. ౧౬ వ పటము)



పటము ౧౭

ధనరేఖ తెగిపోయి చీలికలుగా విభజింపబడుట శరీరసుఖమును కోరుకొనుటచే వచ్చు సుఖజాడ్యములను నిరూపించును. (చూ ౧౭ వ పటము)

ధనరేఖ తెగిపోయినపిదప చంద్రస్థానమునుండివచ్చు ప్రయాణరేఖ పొడుగుగ సాగినచో ఉన్నవృత్తిమాని దూరదేశములకుపోయి జీవితమును గడుపుట తటస్థించును.

ప్రయాణరేఖనుగూర్చి కొన్ని ముఖ్యవిషయములు చెప్పవలసియున్నది.

ప్రయాణరేఖ చంద్రస్థానములోనుండి ధనరేఖవెంట బోవు రేఖయని చెప్పుదురు ఆ రేఖకై ౧౮ వ పటము చూడుడు. కాని యీ ప్రయాణరేఖ అన్ని హస్తములలోను గానరాదు. నేను పెక్కండ్ర చేతుల చూచి



పటము ౧౮

తిని. వారు విదేశములలో సంవత్సరముల తరబడి నుండినవారే. కొందరు భూప్రదక్షిణము చేసివచ్చినవారుకూడ కలరు. వారి చేతులలో నెక్కడను ప్రయాణరేఖ పైజెప్పిన రీతిని కానవచ్చుటలేదు. కాని పాశ్చాత్యులీరేఖనుగూర్చి నొక్కి చెప్పుచువచ్చిరి. కొందరు చంద్రస్థానముపై నడ్డముగనుండు రేఖలు భూప్రయాణమును నిరూపించు రేఖలని అం

రుదు. (చూ. ౧౯ వ పటము) చంద్రస్థానముపైనున్న యీరేఖలను జూచి ప్రయాణము లున్నవని చెప్పుచుందరు. కాని ఆప్రయాణములు, విశేషించి కాశీ ప్రయాణాదులనుగురించి చేయి చూపించుకొనువారు ప్రశ్నించునప్పుడు సాముద్రిక శాస్త్రవేత్త సాధ్యమైనంత త్వరలో వారందరిచేతను ప్రయాణములు కట్టించును. "త్వరలోనే మీకు కాశీరామేశ్వర ప్రయాణము లున్నవండి. మీరు ప్రయత్నించినచో సానుకూలపడును. ఆవిషయములో గట్టిశ్రద్ధ చేయుడు. చేతిలో రేఖ విస్పష్టముగ నది సూచించుచున్నది. ఇక వెడలకపోవుట మీలోపమేసుడీ" యని వారి కందరికి ఉత్సాహము గల్పించి ప్రయాణోన్ముఖులను జేయును. ఇది కేవలము దగా. ప్రయాణరేఖలు చేతిలో నుండవచ్చును. అవిసూచించురేఖ లున్నవనిపెద్దలు చెప్పుచున్నారు. కాని ఆప్రయాణ మెప్పుడు జరుగునో విస్పష్టముగా నిర్దేశించి చెప్పటకుమాత్రము సావకాశము లేదు. చేయి చూపించుకొనినవారిని తృప్తిపఱచుటకై వారికి త్వరలోనే ప్రయాణముహూర్తముల



పటము ౧౯

నుంచి చెప్పుచుందురేగాని యేలక్షణమును బట్టియో, వారేనాడు ప్రయాణ మగుదురో నిర్దుష్టముగ జెప్పుటకు సావకాశము లేదు. ట్లు చెప్పుట సాహస మనకతప్పదు. ఇకఆ ప్రయాణరేఖను గూర్చి కూడ కొంచెము తెల్పుదును.

నేను చూచిన పెక్కు చేతులలో ప్రయాణరేఖలు శాస్త్రమునందు చెప్పినరీతిని లేవు. నేను చూచిన చేతులలోని రేఖలు సాధారణముగ నీరీతిని గలవు (చూ ౨౦ వ పటము). అనగా కంకణరేఖలలోని మొదటి



పటము ౨౦

రేఖపైనుండి చంద్రస్థానములోనికి రమారమీ అరంగుళము, కొన్నిచోట్ల ముప్పాతిక యంగుళమువఱకు చొరుచుకొని పోయి యున్నవి. అంతమాత్రముచే నవిప్రయాణరేఖలని చెప్పుట సాహసము. చంద్రస్థానమునందున్న రేఖ లన్నియు ప్రయాణరేఖలు కాజాలవు.

అరచేతిలోని సప్తగ్రహ స్థానముల లోను శని, చంద్రస్థానములు విశేషమైన వ్యాధులకు లోనైన స్థానములు. అందు చం

ద్రునకు మరియు విశేషముగా కలవు. చంద్రస్థానము మొత్తముమీద వచ్చు జాడ్యములు ౧. ఉన్మాదము, ౨. నీటి గండములు. ఇవి యెక్కువగ వచ్చుచుండును. చంద్రస్థానమును 3 భాగములుగ భాగించి చూచినచో (చూ ౨౧ వ. పటము) ప్రథమ భాగమునందు అజీర్ణము, మలబద్ధము, కడుపులో




పటము ౨౧

పోట్లు మొదలగు వ్యాధులును, మధ్య భాగమునందు నరములకు సంబంధించిన జాడ్యములు, నరములు యెక్కెట్టుకొని పోవుట, నరముల సంధులలో పోట్లు, వాతపు నొప్పులు, పసరు వృద్ధియగుట, పక్షవాతము మొదలగు వ్యాధులును, దిగువభాగమువలన ఆంబ విరేచనములు, అజీర్ణ విరేచనములు, అతిసారము, పాండువు, లేక రక్త క్షయముచే పాలిపోవుట, నీటిభయము, నిస్త్రాణ, రక్త



పటము ౨౨

ము నీరయిపోవుట, అతిమూత్రము, జలోదరము మొదలగు వ్యాధులు పెక్కులును సంభవించుచుండును. ఈ వ్యాధులు చంద్రస్థానముమీద సాధారణముగా నడ్డుగీట్లవలన నిరూపించవచ్చును. (చూ ౨౨ వ పటము)

---


తోటవాడు—
పరాకున
అనువాదము)
తలిశెట్టి రామారావు.

# నా మహారాష్ట్రయాత్ర

## జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

బొంబాయిలో రైలెక్కినది మొదలు యిప్పటి వఱకు కంటికి కునుకులేదు సరికదా కొయ్యవలె కూర్చుండవలసి వచ్చినది. బస్సు బయల్దేరుటకు రెండుగంటల వ్యవధియున్నది కనుక కొంచెముసేపు స్టేషనులో నొరగవలెనని ముచ్చటపడితిని. స్టేషన్ అంతా పరికించినాను. లోనిహాలులో కొన్ని బల్లలున్నవి వానిపై నేమీ ఖాళీలేదు. ఒక పొడవుపాటి బల్లమీద ఎవరివో సామానులున్నవి. దానికి రెండుప్రక్కలందు కూడ ఏమేమో మూటలు అమర్చబడియున్నవి. నేనీ ఘోరకలి చూచుచుండగా చరచరపోయి గజాసురుడు క్రిందిసామాను నిటునటు తన్ని బల్లమీది సరుకును క్రిందికి దొరలించి తాను దానిపై బడినాడు. బల్ల పెద్దది కాబట్టి దానిపై ఇద్దరికి చోటుగలదు. కాని 'సగము-గజాసురునకు' మాత్రము అది సరిపోయింది. మిగిలిన శరీరాన్ని అతడు దిగువదెస నున్న టీ షాపులో ప్రవేశపెట్టినాడు. "తుమ్ కోన్ హో. జావ్ బహార్" అని అంగడివాడు అరచినాడు. "మాఫ్"! (ఊరుకో!) అని ఒకపర్యాయం కెవ్వుని గజాసురుడు కన్నులు మూసినాడు. అతనితో ప్రసంగింపవలెనని ఆతురపడితిని కాని నా కప్పుడు తరుణము చిక్కలేదు. అతని ధోరణిని మాత్రం కనిపెట్టుచున్నాను. పలుకరించినంతన, దెబ్బతో నన్నాతడు 'గుటకాయస్వాహా!' చేయునేమో అని యడలితిని. 'నాసిక స్టేషనునకు వచ్చినవాడు తప్పక నాసిక పట్టణమున కరుగును. అందైన నీతని గలిసి కొందునుగాక'! అని మనసు కుదుట బఱచుకొంటిని. కాని మేనువాల్చుటకు నా కెక్కడా చోటు కానుపించలేదు. తుదకు కూర్చుండుటకైన తావులేదు. నేలపై కూడ నెందరో పరుండిరి. టీ షాపులో కొంతసేపు కాలక్షేపం చేయదలచినాను. చలితీవ్రంగా ఉన్నది. తేనీరు కొంతచలి ఆపునని యెఱుగుదును. ౧నాసికచలిని

౧. దారుణమైన చలిలో ఆ ఱేండ్లకుమున్ను హిమాలయములందు పెక్కునాళ్లు ప్రయాణం చేయవలసి వచ్చినది. పెషావరులో కొన్నిదినములుండి జంటూరావేండికోటల్ మున్నగుతావులు చూచుకొని కైబరు తెరువున కవ్వలనున్న లేండిఖానాకు పోతిని. ఱంతకుమున్ను అరడజను యేండ్ల క్రితము మాత్రము కైబరు కొండలందు టన్నెల్సు దొలచబడినవి. వీనిగుండా రైలుకడునేర్పున నడుచును. ఇండియాకును, ఆఫ్గనిస్థానమునకును నడుమ సరిహద్దులో ఒకచిన్న పోస్టాఫీసు ఉన్నది. ఒక పఠాన్ పెద్దమనిషి నా కందు కనిపించి, ప్రసంగధోరణినిబట్టి నేను కాశ్మీరమునకు బోవుచుంటినని గ్రహించి "అయ్యా! ఇపు డచటికి పోయిన ముప్పువాటిల్లును. అచటి చలిని సహించలేరు. ఈరోజులలో నచ్చటివారు జమ్మూకు పోదురు. పలువురు గుండెలకు కుంపట్లు కట్టుకొని తిరుగుచుందురు. ఈచలిలో మీకు తప్పక నెమోనియా వచ్చితీరును. ఇప్పుడు ప్రయాణం సాగించుట మంచిదికాదు. సాగింతురేని, తప్పనిసరిగ బ్రాందీని ఉపయోగించవలెను" అన్నాడు. "కాశ్మీరము పోవుట తప్పదు. కాని బ్రాందిని నాశ్రయించుటెట్లు దైవమా!" అని తలపోసితిని. బ్రాందికి బదులు మూడేసిగంటల కొక కప్పుమోతాదు చొప్పున హిమగిరి ప్రయాణంలో టీ పిల్చువాడను చిన్నచిన్న కొండపల్లెలందుగూడ టీ లభించెడిది. శ్రీనగరముపోవుతటి చాలమెల్లు జీలంనది దాపుననుండి కొండలోయలో పయనము సాగించవలెను. రాత్రులందు హిమగిరిపై నేకుటీరమందో విడిసి, మంచుగుండా త్రోవజేసికొని దురంతమై, దుస్సహమైన చలిలో నుదయమే జీలం నదిలో మునిగి స్నానానంతరము వేడివేడి తేనీరు త్రాగువాడను. టీవలన కొంతచలి చచ్చెడిది. వంగమిత్రులకుః తేనీటికి నెంతో స్నేహం. ఇట్టినేస్తము నాకుకూడ లభించినది. టీ యొక్క మహత్త్వపటుత్వముల నొకమహాకావ్యమున వర్ణింప గాంక్షించుచుంటిని.

టేవలన కొంతవరకు నెట్టింపదలచితిని. అందుచే టే పాపులో గట్టిగ తిప్పవేసితిని. పాపువాడు హిందూస్థానీయుడు. మంచి చలాకీ మనిషి. అతని ప్రోత్సాహం వల్ల రెండుకప్పులను గొంతుకలో ప్రవేశబెట్టితిని. "రోడ్డున కవ్వల ముసాఫర్లకై ఒకబంగ్లాయున్నది. పరుండుటకు మీ కందుచోటుదొరకును"అని చావాలా చెప్పినాడు. ఆవల కటికి చీకటి! ఎట్లో నేనూ, నాచెంబూ పోయి 'బంగ్లా'లో ప్రవేశించితిమి. శవములవలె జనం అచట పడియున్నారు. గుడ్డిలాంతరొకటి వెలుగుచున్నది. ప్రదేశము ధూళితో నిండియున్నది. చోటు కూడ స్వల్పము ఎంతసేపు నిలిచియుందును? నాకడ స్నానాంబరములేకదా యున్నది! "నాసికదుమ్ము పవిత్రమైనది" అనుకొని ధూళిలోనే పువాలు నొక మూల బఱచి శరీరమును దానిపై బడవేసితిని. వెంటనే నిద్రపట్టినది. తోడనే అచటనేదో అల్లరి బయల్దేరుటచే ఉలికిపడి నిద్రనుండి ఆకస్మికముగ లేచితిని. చీకటిలో అచటివారు కుమ్ములాడుకొనుచుండిరి! చెళ్లుచెళ్లుమను చఱపులు వినబడినవి. కాలికి బుద్ధిచెప్ప నుంకించితిని. పెద్దగోలలో "దొంగ! దొంగ!!" అని ఒకరిద్దరు కేకలు వేసిరి. నేను పారిపోయినయెడల నేనే దొంగనని నాభరతం పట్టెదరని తలచి నే నందే నిలువంబడి "ఆగండి! ఆగండి!!" అనిమాత్రం అరచితిని. స్టేషనునుండి ఒకరిద్దరు లాంతరులతో పరుగెత్తుకొని వచ్చిరి. ఎంతో కష్టముతో అప్పటి కురుక్షేత్రయుద్ధమును ఆపివేసిరి. జరిగిన కథ యిది నిద్రలో ఎవరో ప్రక్కవానిని తన్నినాడు. వాడులేచి అసలీపాయిదాలతో బదులుతీర్చినాడు. ఇరువురకు ద్వంద్వయుద్ధము సాగినది. చాపచుట్టలవలె వారు దగ్గరనున్న లాంతరుపైబడిరి. భగ్గుమని

౨. ఇట్టియనుభవము నీవఱలో నొకపర్యాయ మెఱుగుదును. కొన్నేండ్లకుమున్ను అలహాబాదునుండి బయల్దేరి నేను చిత్రకూటమునకు పోతిని నాతోకడియాల సత్యనారాయణమూర్తి యను నొక ఆంధ్రసోదరుడు పయనమైనాడు. ఈ సోదరుని స్వస్థలంతూర్పుగోదావరి జిల్లాలోని చింతపూడియను గ్రామము. చాలకాలమునుండి కుటుంబ సహితముగ నీతడు కలకత్తాలో నాబసకు దాపుననుండువాడు. బ్రాహ్మణుడు, అచ్చవైదీకి, మంచివాడు. అర్ధరాత్రివేళ చిత్రకూటంస్టేషనులో దిగితిమి. స్టేషనుకు అరమైలు దూరంలో విశ్రాంతిగృహమున్నదని వింటిమి. అర్ధరాత్రి! గాఢాంధకారము! నామిత్రుని కాళ్లకు జోడులేదు ఒంటికి చొక్కాలేదు. స్టేషనునుండి విశ్రాంతిగృహమునకు పోవుటకు సరియైన తెన్నులేదు. చుట్టుప్రక్కల తుమ్మచెట్లు నిరివిగా పెరిగియున్నవి. త్రోవనిండా ముళ్లే! మెల్లగా నడచినడచి నామిత్రుడు సరిగా వాడిముండ్లపై అడుగువేసి "అమ్మో! చచ్చేను!" అని కెవ్వుమని పనసస్వరమున మూలుగువాడు. చుట్టత్రాగుట నాకూ అభ్యాసంలేదు. అతనికీ అభ్యాసంలేదు. కావున మాదగ్గర అగ్గిపెట్టె సంగ్రహంలేదు. ఎట్లో కొంతసేపటికి ఆవిశ్రాంతిగృహం చేరితిమి. నామిత్రుడు తనమాటతో (చొక్కాలేకపోయినా, బిళ్లగోచీదారుడైనా యీతడు పాగాధరించాడు) పైకెగబ్రాకి రెండడుగులువేసి అక్కడ నిలిచిన ఒకమృగముపై గుభాలున కూలబడి, "అమ్మో! చచ్చేను!!" అని మరల బొబ్బపెట్టినాడు. "ఏమది?" అని ఒకఅడుగు వెనుకకువేసి, "భయంలేదు" అని ఆతనికి హుషారుయిచ్చితిని. ఇంతలో మువ్వురు హిందూస్థానీయులు ఒక టార్చిలైటుతో అచటికి వచ్చిరి. వారు ముువ్వురును ప్రయాణీకులే. పాఠకులు మున్ముందు వీరినిగుఱించిన విపులోదంతమును వేఱుగ్రంథమున నెఱుగగలరు. టార్చిలైటువెలుగులో చూచితిమిగదా ఒకఒంటె అందునిలిచియున్నది. నామిత్రుడు లేవనైన లేవక దానిముందు బోర్లగిలపడి మూలుగుచు, పిదప లేచి, వెలుగులో మృగమును చూచి "అయ్యో! దీని మొహంమండా!" అని వెనుకకు మామీదికి దుమికినాడు. "భయంలేదు. ఇది పెద్దపులికా"దన్నాను. "కాదంటారా" అని అత డన్నాడు. ఆచోటు మృగముల విశ్రాంతిగృహమని తేలింది. ప్రపంచములోని పెంటపరుకంతా అందున్నది. మేమైదుగురమూ పంచపాండవులవలె దానిలోనే నాటిరాత్రి శరీరాలను పారవేసితిమి.

అది యారిపోయినది. యోధులిరువురు ఒకరిపైబడుటచే పెద్ద యుద్ధము బయల్దేరినది.

అల్లరి ఆగినపిదప నెవరిచోటునందు వారొరగిరి. కొంచెము సేపైన పిదప నందుండి కదలిపోతిని. ఇంకను చీకటి అధికముగా నేయున్నది. స్టేషను దిక్కుగా పోతిని. కొంతమారమున అంధకారములో నేదో తెల్లని వస్తువు కానుపించినది. ఒకపర్యాయము కదలుచున్నట్లును, వేరొకమారు నిలిచినట్లును అదితోచినది. "ఏమది?" అని యూహించుచు నిలువంబడితిని. ఆవస్తువు అట్లే యున్నది. "ఇందాక దొంగ అబద్ధము! ఇపుడు నిజము అయియుండును. దొంగ కానియెడల అదేదో దయ్యమై యుండును. షేక్స్పియరు మహాకవియే దయ్యములను నమ్మియుండె, నట్టివి లేవని తలచుటెట్లు?" అని తలపోసి "ఎవరువారు?" అని కేకవేసితిని. జవాబులేదు. ఆవస్తువట్లే తిరుగుచున్నది. వేరుపైపునుండి స్టేషనుదిక్కుగ నడచితిని ఆవస్తువు నావెనకు రాదొడగినది. "శ్రీఆంజనేయం, ప్రసన్నాంజనేయం!" అనుకొని చరచరనడచి రోడ్డును చేరుకొంటిని. స్టేషనునుండి వెలుతురు క్షీణాలోకము దానిపై తోచినది. సమీపించిన ఆవింతవస్తువేమో నాకపుడు తెల్లమైనది. తెల్లబట్ట కప్పుకొని ఒక వ్యక్తి వచ్చి నాముందు నిలిచినాడు. "నీవెవ్వడవు?" అని బిగ్గరగా నంటిని. "మాది నాసిక. నేను పండాబ్రాహ్మణుండను. మీరెవరు? యాత్రీకులా?" అని ఆత డనినాడు. "అవును యాత్రీకుడనే దయ్యమువలె అట్లుమసలుచున్నావేమి? పలుకరించినపుడు మాట్లాడలేదేమి?" అన్నాను. నాప్రశ్నకుత్తరమీయక "నాతో నా! కరండు. చక్కగా యాత్రజరిపిస్తాను" అని ఆత డనినాడు. "నీవుజరిపించ నక్కరలేదు. పో" అని వడివడిగ నేను స్టేషనులోనికి పోతిని. అప్పుడైన సన్నాసి వదలలేదు. నావెంట స్టేషనులోనికి పరుగెత్తుకొని వచ్చినాడు. ఒకచిన్నకార్డు నాచేతబెట్టి "తాము నాతో దయచేయండి. మీకన్ని సదుపాయములు కలుగును" అని ఆతడనినాడు. ఆతని కార్డుపై దృష్టిపఱపితిని. అందిట్లున్నది.

"వె. రా. గంగాధర రామచంద్రఖాంబవే.
కి. సోమవార్ పేఠ్ ఘుర్‌నం. ౭౩౭౩ నాసికాక్షేత్ర"

నేను మఱిమాట్లాడక స్టేషను మాస్టరున్న గది లోనికి పోతిని. బ్రాహ్మడు వెనుకకు మరలినాడు. పిశాచము వదలిపోయినదని సంతసించితిని.

ఈ పండాబ్రాహ్మణుని చూచినంతనె నామనసున క్రోధభావ ముదయించినందులకు కారణము లేకపోలేదు. ఈతరి తెగను గుఱించిన దురభిప్రాయము లెన్నో పుళుగులవలె నామనసుపై ప్రాలినవి. మానసికముగ నాతో కలిసి యాత్రసలుపుచు నాతో సంతసించుచు, నాతో సంతాపించుచున్న చదువరులు అపుడు నామనసున నట్టిభావము లేల పొడసూపినవో యెరుగగాంక్షింతురు. పండాతెగను గుఱించిన ఉదంతమును వారెఱిగినచో మున్ముందు వారితో నేను మసలినరీతికి హేతువు లెవ్వియో గ్రహింపగలుగుదురు. కావున నతిసంక్షేపముగ నీవృత్తాంతము నించుక దెలుపుచుంటిని.

భారతయాత్రస్థలములం దెచ్చటికరిగినను పండాబ్రాహ్మణులు ప్రత్యక్షమగుదురు. వీరి యేజంట్లు దూరస్థలముల కరిగి యాత్రీకులను పట్టుకొందురు. మన యాత్రీకులలో పల్వురు పూర్వాచారపరాయణులు, పల్లెలందుండువారు. క్రొత్తచోటులనిన వారికి కొంత భయముండును. ఎందు విడియవలెనో, ఎందరుగవలెనో, ఏమేమి చూడవలెనో వారెఱుగరు పోయినచోటులో వాడుకయైయున్న భాష వారికి తెలియనిదై యుండుట కూడ కలదు. ఒక్క ఒక్కన పయనముసాగించు యాత్రీకులను తమవశమొనరించుకొని పండా బ్రాహ్మణులు చిత్తమువచ్చిన తెఱంగున ప్రవర్తించుచుందురు. వీరిచర్య మనసున కెంతేని బాధకలిగించును. యాత్రీకులను పిండి, వీరు పైకమును దీయుదురు. వీరివర్తనము వర్ణనాతీతము. ఆలయములలోని పూజారులకు వీరు సైదోడులు.

ప్రయాగలోని తెలుగుపండా హరిజగన్నాథశాస్త్రి. ఇతని సొంతయిల్లు దారాగంజిలో వేణీమాధవ మందిరమునకు రెండుఫర్లాంగుల దూరములో గంగానది యొడ్డున నున్నది. రెండవ తెలుగుపండా లేనందున పోటీచేర మేమియును నీతని కెదురునిలుకలేదు. ఇతడు చాల ధనము నార్జించి వృద్ధుడైనాడు. ఇతని కొక కొడుకు,

పేరు గణేశశాస్త్రి. ప్రయాగకు శారదాంబతో పోయినప్పుడు మాత్రము నే నీతని యింట మకాము పెట్టవలసి వచ్చినది. ౧౯౩౦, జనవరి నెల ప్రయాగలో మిగుల పవిత్రవంతమైయుండెను. ఆనెల ౨౯ తేదీని కుంభ మేళ మహోత్సవముజరిగినది. దీనిని మనము త్రివేణీ పుష్కర మనినను అనవచ్చును. ఆరేండ్లు గడచినది కావున అర్థపుష్కరమువలె నిదివల ప్రయాగయందు మహోత్సవము జరిగినది. అంతకు మూడేండ్లకుముస్నే హరిద్వారమున గంగాపుష్కరము జరిగినది. సంక్రాంతి నుండియే త్రివేణీస్నానము మహత్తరమైనదని ఊహింపబడుచుండెడిని. నానాప్రదేశములనుండి బహు సంఖ్యాకులు అప్పుడు ప్రయాగ కరుగుచుండిరి. అంతకు మున్నే సంవత్సరము నుండి కుటుంబసహితముగ దేశాటనము సలుపుచుంటిని. త్రివేణీపుష్కరమునకు శారదాంబతో కలిసి రాజస్థానమునుండి ఢిల్లీ మీదుగా అలహాబాదున కరిగితిమి. మకరస్నానమునకే అచట చేరవలెనని శారదాంబ పలికినది. సరిగ పెద్దపండుగ నాటికి గమ్యస్థానము చేరి హరిజగన్నాథశాస్త్రి యింట బసచేసి, విధ్యుక్తక్రియలు జరుపదలచితిని. తనజడ కొనయందలి ఛేత్తెడు భాగమును "త్రివేణీ" జనయిత్రికి వేణీదానము చేయుదునని శారదాంబ చెప్పినది దివంగతులైన నాతలిదండ్రుల నుద్దేశించి తీర్థవిధి పెట్టెదనని శాస్త్రితో నే బలికితిని. కాశిలో ఒక పెద్ద పండాకడ ఏజంటుగా పనిచేయుచున్న దేశికులు అను వ్యక్తి అప్పుడు శాస్త్రికడ నున్నాడు. శాస్త్రికి మఱింత లాభము కలిగించవలెననియు, తానుకూడ యిట్టువచ్చినట్లు కొల్లగొట్టవలెననియు నీత డూహించినాడు. ఈ యేజంట్లచర్య మిగుల విపరీతముగానుండును. ఛాయవలె వీరు వెంటవెంట దిరిగి, అక్కడైన పైకము దీసికొని, అంతటితో నూఱకొనక "అనకయిస్తాము కొంచెం పైకము బదులీయండ"ని తీసికొని మనము ప్రయాణం సాగించు దినమున నంతర్ధానమగుచుందురు. చేయవలసిన క్రియలకై శాస్త్రితో సంప్రదించి దేశికులు పెద్ద మొత్తమును వివరించినాడు ఇంచుమించుగ నాతడు తెలిపిన పైకమును యిచ్చివేసితిని. వేణీదాన మహోత్సవమునకు పసుపుబట్టలు కట్టుకొని, దంపతులు త్రివేణికి పోవలెనన్నాడు దేశికులు. "ఖేష్" అంటిమి. పైకము చేతబడువఱకు బ్రాహ్మణు లిద్దఱు మాఅడుగులకు మడుగులొత్తిరి. పరంపడి మాదారి మేమె చూచుకొనవలసివచ్చినది. యమునాగంగలు కలియుచోటు మా బసకు గమారమి రెండుమైళ్ల దూరమందు కలదు. "అచట మీకై ఒక బ్రాహ్మణుడు కనిపెట్టుకొని ఉంటాడు. వెళ్లండి" అన్నాడు జగన్నాథశాస్త్రి. వచ్చిచేసి మేమచటికి పోతిమి. బొబ్బిలి పాపారాయుడువంటి ఒక మహావీరుడు మా కందు ప్రత్యక్షుమైనాడు. ఆతడు హిందూస్థానీయుడు. అతని శరీరము దారువువలె నున్నది. మొగము బిందెకంటె పెద్దదైయున్నది పెద్దపెద్ద బూరెలు కొన్నివందలు సంద్రముగా పేర్చబడియున్నట్లున్నది ఆ వదనారవిందము. మీసములు మిగల పెద్దవి. చొక్కాతొడుగుకొన్నాడు. ఇతని జూచినంతన కొంచెము వెనుకకు తగ్గితిమి. ప్రయాగలో కొండఱు కొండఱు హిందూస్థానీ బ్రాహ్మణులు కొంత తెలుగు నేర్చుకొని అపరక్రియలందు హరిజగన్నాథశాస్త్రికి సాయపడుచు నాలుగుడబ్బులు సంపాదించుకొనుచుందురు. పాపారాయడు కొన్ని తెలుగుముక్కలను మక్కున బట్టినాడు. మమ్ములను జూచి "రా అండి కూసుకోండి" అన్నాడు. "వీడేదో కూయేమంటున్నాడు. ఏమికూత కుయ్యను దైవమా! చేతనైతే 'కొక్కొరోకో!' అనుము" అని శారదాంబతో చెప్పితిని. "బాబ్‌జీ! కూసకోండి" అని పాపారాయుడు పలికినాడు. "హిందీమే బోలో భయ్యా" అని కొంచెంసేపు కూర్చుని, నడినడుమకు దోకొని పోవుటకై అతడు నావ నీడ్చుకొనివచ్చులోపల మేమిరువురము "ముముక్షుజన హృదయంగమంబగు త్రివేణీ సంగమంబునఁ దానంబులు" గావించితిమి. హిందూస్థానీయులసంస్కృతోచ్చారణము విడ్డూరముగా నుండును. వంగపురోహితులు సంస్కృతమును చావగొట్టి చంపివేతురు. వీరు గౌడబ్రాహ్మణులు. మనక్రియలకువీరంతగా పనికిరారు. పాపారాయడేమో యుచ్చరించినాడు. వేణీదానసమయమున హిందూస్థానీనిప్పుడు తప్పడేమో! ఎట్లో అచ్చటికాండ జరుపుకొని శాస్త్రియింటికి పోయి, మఱునాడు తీర్థవిధి నిర్వర్తించి, అంతకుమున్నే

లాహోరునుండి మరలివచ్చిన మోతీలాలు, జవహరులను 'స్వరాజ్య' భవనమున దర్శించి గయకుపోతిమి.

గయలోని పెద్దతెలుగుపండా షోడశి నరసింహాచార్యులు. ఈయన మకాము "పంచవటి"లో. దక్షిణామూర్తి మఠమొక పండా. గయలో వివిధ ప్రదేశములందు పితృకార్యములు జరుగవలెను. ముఖ్యస్థానములు మూడు: (౧)ఫల్గుణినది, (౨)విష్ణుపాదము, (3) అక్షయావటము. ఆచార్యులవారి అనుచరులలో నొకడు ఫల్గుణికడ నుండును. నదికి కొంతదూరమున (యీనదిలోని నీరు నీలమండలను దాటదు) పదునరచే పది మట్టిచిప్పలలో అన్నము వండించి టోకుమీద అందటికి ఇచటి బ్రాహ్మణు డొకేమంత్ర ముచ్చరించును. వటవృక్షముకడ అపుడపుడు ఆచార్యులవారు పనిచూచుకొందురు. మంత్రము లుచ్చరించుచు ఈయన ఇతరప్రసంగముల లోనికి దిగుచుందురు. గయావళి ఇచట ప్రత్యక్షమగును. ఇత డొక హిందూస్థానీయుడు. పితృదేవతల కితడు భూలోకమున ప్రతినిధియట. పిండప్రదానము ముగిసిన వెనుక యాత్రికులు పోయి యీతనికాళ్లు పట్టుకొని "తృప్తికలిగినదా?" అని ప్రశ్నింతురు. చిత్తము వచ్చినంత పైకమును వీరికడనుండి పిండిగాని "తృప్తికలిగిన" దని ఈత డనడు. అట్లననిచో పితృకార్యమునకు భంగము వచ్చునట నరసింహాచార్యులుగారికి గయావళికి దగ్గఱ సంబంధము. తగినంత పైకము ముట్టినపిదప, గయావళీ కాళ్లమీదివ్యక్తి వీపుపైతట్టి ఆతనిమెడలో నొకగన్నేరు దండవేసి "తృప్తికలిగినది" అని సెలవిచ్చును. పెద్దపెద్ద మార్వాడీలు గయావళులకు విశేషధన మొసగుచుందురు. పితృదేవత లెట్లుందురో గాని, వారికి ప్రతినిధులనబడు మహాశయులు "పైలాపచ్చీస్!" పద్ధతిలోనివారు. వారి కథ వ్రాయుట కిది సమయముకాదు. సింగపూరు మున్నగు చోటులందు కూడ నాటకోటిచెట్లను గలిసి వీరు ధనము దెచ్చి చిత్తమువచ్చినట్లు వెచ్చింతురు. గయలోని పెద్ద పండాలు కొందఱు ఇన్‌కమ్‌టేక్సు చెల్లింపవలెను. టేక్సు ఆఫీసరు వచ్చునప్పటికి డేగలవలె వీ రెచ్చటికో రివ్వురివ్వున నెగసిపోదురు. "తైర్థిక సమాహిత సమ్యగము" గయనుండి అనంతరము మేము వారణాసి కరిగితిమి.

కాశిలో ఆంధ్రులు చాలమంది కలరు. పండావృత్తిలోనున్న అచ్చటి పెద్దలలో ముఖ్యులు చల్లా సుబ్బారావుగారు, శానావధానులుగారును. అవధానులుగా రీమధ్యనే పరదేశమందలి పని చూచుటకై వెడలిరి. వారికుమారుడు విశ్వనాథశాస్త్రి పితృకార్యములు జరుపుచుందురు. ఈమధ్య నొక భమిడిపాటిశాస్త్రి దశాశ్వమేధ ఘట్టమున ప్రేక్టీసు మొదలుపెట్టినాడు. చల్లా సుబ్బారావుగారికి, నాకూ చిరపరిచయము కలదు. కలకత్తాలో వీరు నన్ను కలిసికొనుచుండువారు. వీరి స్వస్థలము అమలాపురముదగ్గరనున్న ఇందుపల్లి. ఈయూరు నా అత్తవారియూరు. నా మామగారిని, ఆయన అన్నగారు "రావుసాహేబు" గిడుగు వేంకట రామమూర్తి గారిని(వీరు పదంపడి పర్లాకిమిడికిపోయిరి)r అమలాపురములోని వకీళ్లు గిడుగు వేంకట రత్నము, సూర్యనారాయణగార్లను సుబ్బారావుగారు బాగుగ నెఱుగుదురు. మాయూరు పేరవరం ప్రక్కనుండియే అమలాపురం, వానపల్లి, గన్నవరములకు పోవు కాలువ ప్రవహించు చున్నదికావున సుబ్బారావుగారు మాస్వస్థలము నెరుగుదురు. మా యూరిలోగూడ చల్లావారు న్నారు. కావున సుబ్బారావుగారు నాకు సన్నిహితులు. నాయెడల వీరికి ప్రత్యేకాభిమానము కలదు తొలుత నేను కాశికి ౧౯౧౭లో పోతిని.

నే నపుడు బాలుడను. నకన్న తల్లి నా యారవ యేటనే నన్ను విడిచి దివంగతయైనది. తొమ్మిదవయేట నా కుపనయన మైనది. మఱికొలది యేండ్లు మని యుండి, నాకు వివాహము చేసి నాజనకుడు తన యర్థాంగలక్ష్మిని గలిసికొనెను. నాతలిదండ్రులకు ముందు నా తాతగా రున్నపుడే స్వర్గస్థురాలైనది నా సవతితల్లి. బాలకుడనై పవిత్రమైన మూడు త్రిద్దినములను మస్తకమున దాల్చి దేశాటనమునకై బయలుదేరితిని. అమ్మకు, అయ్యకు సేవ సలుపగలుగు నదృష్టము నాకు లభింపలేదు. కొడుకుకై తపించి నన్నుగని నన్నొంటరిగ విడిచి వారు స్వర్గమును చేరుకొనిరి. వారితో వారియాస్తికూడ నంతర్ధానమైనది. వారి యస్థికలే నాకు నవరత్నములైనవి. వీనిని కనుల కద్దు

కొని, కన్నీటియందు పలుమారు వీనిని ప్రక్షాళనమొనరించి, మహాక్షేత్రములందు జననీజనకుల యాత్మలను దనిపి, ప్రత్యక్షముగ జేయజాలని సేవ నీతీరున నెరపి ధన్యుడ నగుటకై భారతపథికుడనై వెడలితిని. దురంత కష్టము లిచ్చు గోరుముద్దలను భ్రమించుచు శైశవమందే నావిజ్ఞాన యాత్ర నారంభించి, నేడును నాయుద్దేశసిద్ధికై శ్రమించుచున్నాను.

సుబ్బారావుగారిని కలిసికొని "నాచే పితృకార్యములు జరిగింపు"డని కోరితిని. "వంకాయవలె నున్నను పెద్దయూహలు కలవాడవు. మీ ఆస్తి మంచిది. తీర్థవిధి బాగుగ జరుగవలెను" అని ఆయన అన్నారు. నా యాస్తిని అప్పటికే కుక్కముట్టుకొనినదని ఆయన యెరుగరు. ఆయనా, జానకమ్మగారూ నన్నపుడెంతో ఆదరించారు. పదంపడి కాశీ పలుమారు పోతిని. హిందుస్థానీ మిత్రులయిండ్లలోనే బసచేసితిని. ౧౯౪౦ లో శారదతో పోయినపుడు కేదారఘట్టమున సుబ్బారావుగారి మేడలో విడిసితిని. "కలకత్తాలో పెద్దచదువు ముగించారు. అచ్చట పలుకుబడిగలవారు. మాతమ్ముడు ద్వారకాభూమిడిపోటి కృష్ణమూర్తివలె అచిరములో మీరు జిల్లామునసబు కాగలరు. దంపతులు వచ్చారు. ఇచ్చటి క్రియలు చాలాబాగా జరుగవలెను" అన్నారు సుబ్బారావుగారు. ఈపర్యాయము ఈయనఆశ పెద్దదైనది. గుమ్మడిపండువంటి బ్రాహ్మణుని ఆయన మా కప్పగించిరి. సుబ్బారావుగారి నట్టింట వధూవరులను మమ్మల నిరువురను చెరియొక పీటమీద గూర్చుండబెట్టి, గంగాఘట్టమున జరుగవలయు సంకల్పము నీత డింటికడనే యేకరువుపెట్టినాడు. స్నానసంకల్పమును నేనేయెరుగుదును. అందుకై ఒక ఎడ్వకేటును నియోగించుట నాకిష్టము లేదు. సుబ్బారావుగారు చెప్పిరికావున నే నందుల కంగీకరించితిని. బ్రాహ్మణుని సంకల్పధోరణి చిత్రముగా నుండెను. "శుక్లాం" అని, నిమిషము తడసి, "బరధరం" అని "శశి" అని ఆగి మరల మంత్రమును ముక్కలుచేసి, చెక్కలు కావించి అతడు తంతు జరిపింపసాగినాడు. "రాముని తోక" "పివరుం డిట్లనియె" అనువాక్కును తొలుత నీమహావిద్వాంసుడే ఉచ్చరించియుండునని యూహించితిని. సకల్పం ముగించి "మూడు రూపాయల జేడ యివ్వండి" అన్నాడు బ్రాహ్మడు. పదంపడి "కల్లోలవతీమతల్లి గంగాతల్లి" ని దర్శించి, మణికర్ణికయందు గ్రుంకులిడి "అన్నపూర్ణ విశాలాక్షీసనాథుం గాశీవిశ్వనాథుని" దర్శించి, భైరవుని సేవించి యింటికి మరలి, తీర్థవిధి నెరపితిని. ఈదేశికులు ఇచట ప్రత్యక్షమైనాడు. పెద్దపుస్తకమును దెచ్చి "ఇందులో సుబ్బారావుగారికి వీమివార్షిక మిత్తురో వ్రాయండి" అన్నాడు. "సుబ్బారావుగారు కాశీలో రెండు పెద్దమేడలు కట్టిరి. మెడలో బంగారపు రుద్రాక్షలు ధరించారు. వార్షికమును వారే పంపసమర్థులు." అనిచెప్పి అందుండి కదలిపోతిమి.

అయోధ్యయందు ముఖ్యమైన ఒక రామాలయమున స్వామికెదుట తెరగట్టి పూజారి "డబ్బు యిచ్చినగాని దర్శనము కా"దన్నాడు. ఒకమూల నొక ప్రాయ్యి, ఇంతబూడిద జూపి "సీత యిచ్చట వంటచేసెడిది" అని నెలవిచ్చినాడు. గోకులలోనూ, మథురలోనూ, బృందావనమందునూ పండాల దౌష్ట్య మధికము. "యమునా భేకీ"యని స్నానమునకు ముందు కొంతపైకమును చెల్లించవలెనట. నదినిగుఱించిన హక్కులన్నియు పండావాని చేతియం దున్నవట! బృందావనమున నందమందిర మొకటి యున్నది. ద్వారమునుండి లోనికి యాత్రీకులు డేకుకొని పోవలెనట. కృష్ణుడొకప్పు డందు డేకువాడని, ప్రాకువాడని, నే డందఱు అచ్చట నట్లుచేయవలెనట. మగవారు పసుపుదారములను, ఆడువారు పవిత్రమైన గాజులను అచ్చట కొనితీఱవలెనట. సంతానములేనివా రచట నొకరావిచెట్టునకు ప్రదక్షిణ మొనరించి పసపుదార మొకటి కట్టి ఇంటికరిగినయెడల, నచిరములో మనోరథసిద్ధి నందెదరట. బిడ్డను చంక నిడికొనివచ్చి కట్టినదారమును విప్పి, కృష్ణునకు భోగము చేయవలెనట. సూత్రమును గట్టునపుడు పండాలకు విరివిగా దానముచేయవలెనట. బృందావనంలో ఒకఅరవ ఆచారి యున్నాడు. అచ్చటి హిందూస్థానీ పండాలు చెప్పదానికి ఇతడు 'భళాభళి' యనుచుండును. గోకులలోని పండా యమునకడకు యాత్రీకులను గొంపోయి

"పాప్ కాటో! పాప్ కాటో!! అని చప్పట్లు కొట్టండి" అని వారిని ప్రోత్సహించును. అంతటితో వారి పాపములు అంతర్హితములగునట. ఇచ్చటగూడ నొక ఆలయమున దేవుని కెదురుగ పూజారి తెరకట్టినాడు. "మూడు రూపాయలజేడ యిచ్చినగాని తెర లేవ" దనినాడు. ఆతడు "విత్తంతువులకు, నిరుపేదలకు సంతర్పణలు జరిపెదము. పైక మీయండి" అన్నాడు. ఇట్టి సత్క్రియాలు పేరు జరపెదరనుట కెట్టి నిదర్శనములూ లేవు. వివిధప్రదేశములందు "మూడు రూపాయల జేడ" అను పదము వినబడుచుండును. పండాల కీశబ్ద మెట్లు పవిత్రమైనదో చెప్పలేను. "మాకు తోచిన దక్షిణ నిస్తాము. మూడుం జేడ లెక్కయేమో నాకు తెలియ"దంటిని. "మీకు దర్శనం కాదు" అని పూజారి గట్టిగా పలికినాడు. "దేవునకు పరదాయేమి? ఘోషాయేల?" అని నేనపుడు తెరదీసి మూలపాఱవేసితిని పూజారి హుంకరించినాడు. పదుగురు చేరి నన్ను మార్కొన గమకించిరి. "ఒక్కడొక్కడుగ రండి!" అని మూర మాలోచించి హిందీతో కొన్ని యింగ్లీషుమాటలు మేళవించి అట్టహాసము జేసితిని "ఈయింగ్లీషు మేమ్ యాత్రకై రాతే"దని గొణుగుకొనుచు వారు తరలిపోయిరి. గోవర్ధనమును జూచి మరల బృందావనమున కరిగితిమి. "రూపాయ జేడ యిచ్చినగాడల ప్రసాదమిస్తాను" అని యచటి ముఖ్యాలయములోని పూజారి పలికినాడు. మనదేవస్థానములలో భోగము చేయించినపుడు ఇచ్చులాగున చక్కని ప్రసాదము నాతడిచ్చునేమో యనియు, కొంతప్రసాదము నింటికి గొనిపోయి నలుగురకు దానిని పంచిపెట్టవచ్చుననియు ఆశపడి పూజారికి ఆతడడిగిన పైకమిచ్చి ప్రసాద మిమ్మని శారద యనినది. ఇసుకవంటి పదార్థమును మూడుపాడుముపట్ల పరిమాణముగల దానిని ఆతడు చేతిలో దులిపినాడు. "కిక్కురుమనకుండ ఈ మూడుపట్ల ప్రసాదమును నీముప్పూరు అన్నలకు వి. పి గా పంపు"మని మాత్రము నే ప్రోత్సహించితిని.

మాంఘిర్‌నకేడుమైళ్ళదూరమున 'సీతాకుండ్' అను ప్రదేశము కలదు. ఇచట దాశరథుల పేర్లతో నాలుగు గుంటలున్నవి. ఇందలి నీరు త్రాగుటకు గాని, అంటుటకు గాని బాగుండదు. అది నిల్వనీరు. పైన పచ్చని కోటెంగు ఉండును. వీనికి దాపున 'సీతాకుండ్' గలదు. అది వేడినీళ్ళగుంట. నీరు సలసల కాగుచుండును. అనవరతము అందుండి పొగ వచ్చుచుండును. ఈ చిన్ని చెరువుకు నలువంకలందు నిసుపడడి నిర్మింపబడినది. చెంబులద్వారా నీటి నీవలికి దీసికొనుటకు వీలుండును. నీటి నొక పెద్దపాత్రలోనికి తీసికొని ప్రక్కనున్న నూతిలోని నీరుతో దానిని తోలిపి స్నానము చేయవలెను. ఏటేట నందు పెద్దయుత్సవము జరుగును. ఇచటికి పోవనెంచి రాత్రి పదిగంటలకు మాంఘీర్‌లో దిగి స్టేషనున కరమైలుదూరమందున్న ధర్మశాలలో నారాత్రి విశ్రమించితిమి. తెల్లవారుజాము మూడుగంటలకు గదితలుపుపై "దబదబ" చప్పుడు వినబడినది. చప్పుడు క్రమక్రమముగా అధికమైనది. ఏమని నే నీవలికి వచ్చి చూచితిని. పదునేనుగురు వ్యక్తు లందు ప్రత్యక్షమైరి. "దొంగలేమో!" అన్నది శారద. భయములేదని ఆమెకు ధైర్యము చెప్పి "మీరెవరు? ఇచ్చట అల్లరిచేయుదురేమి?" అని వారి నడిగితిని. "మేము పండా బ్రాహ్మణులము. మీతో సీతాకుండ్‌నకు వత్తుము"అని వారనిరి. "మాతో రావలదు; పొండు" అని గట్టిగా జెప్పితిని. రెండుగంటలసేపు వారందే తిష్ఠవేసి పిదప నిష్క్రమించిరి. అనంతరము మే మొక టాంగా కట్టించుకొని 'సీతాకుండ్'నకు పయనమైతిమి. "ఇచ్చటి పండాలు బందిపోటులు పోలువారు. వీరితో మీరు జాగ్రత్తగా మసలవలెను సుమండీ!" అని బండివాడు మమ్ములను హెచ్చరించినాడు. బండి నడచుచుండగ నెవ్వరో ఒకబలిష్ఠకాయుడు చరచర వెనుకనుండి పరుగెత్తుకొనివచ్చి బండివాని ప్రక్కను గూర్చున్నాడు. ఆతడేమియు ననక ఊరకొనియుండెను. బండివాని కతడు పరిచితుడేమో యని యూహించితిమి. మేము దిగినతావునందే ఆవ్యక్తి దిగినాడు. అచట నేయూరును లేదు, నిర్జన ప్రదేశము. మేము బండి దిగుసరికి పదుగురు పండాలు మాదగ్గఱకు పరుగులెత్తుకొనివచ్చిరి. బండినుండి దిగిన బలిష్ఠకాయుడు "రండి స్నానమునకై" అని నా

తో పలికినాడు. "నీవెవర"వంటిని. "తెల్లవారు జామున ధర్మశాలలో గలిసికొన్నవారిలో నే నొక్కండను. యాత్రచేయించుటకై మీతో కష్టపడి యింతదూరము వచ్చితిని" అని ఆత డనినాడు. బండివాడు చెప్పినట్లు నిజముగ వీరందఱు బందిపోటులని అపుడు గ్రహించితిని. అచట పోలీసు లెవ్వరును లేరు. ఆనిర్జనప్రదేశమున సతీసహితుడనై నిలిచి వారితో కలహించిన, ముప్పు వాటిల్లునని యూహించి, నేనేమియు మాట్లాడక, బండివాని సాయమున నూతిలోనుండి కొంతనీరు తోడుకొని 'సీతాకుండ్' కడ స్నానము చేసితిమి. "మురికికంపు గొట్టుచున్నను మిగిలిన గుంటలలో గూడ మునుగవలె" నన్నారు పండాలు. "మీరు పోయి వానిలో దిగబడు" డంటిని. మేము స్నానముచేయుచుండ గుంపుగా వారచటికి వచ్చి "ఈతావునందే ఒకప్పుడు * సీత అగ్నిప్రవేశము గావించినది" అని చెప్పుచు సగము చచ్చిన ఆవుదూడను మాప్రోల నిలిపి, "దీనికై పదిరూకలిచ్చి సీతపేరున దీనిని మాకు దాన మీయుడు" అని వారనిరి. నేను వారిమాటను త్రోసివేసితిని. "మీత్రోవను మీరు పొండు" అంటిని. వారు పోక "పదిరూకలు కాకమానె, సగమియ్యండి" అన్నారు. ఇట్లు కొంచెము కొంచెముగా వెల తగ్గించి తుద కొకడు దూడను నాప్రోల నిలిపి, దాని తోకపట్టుకొని "బాబూజీకా నామ్ మే పాడేదస్ అణా గోదాన్" అని "పదణాలన్నరైనా యీయక తప్ప"దన్నాడు. నేను సనేమిరాయంటిని. ఈరొక్కదూడను వచ్చిన యాత్రికుల కడకు దెచ్చి ప్రతివానిచే గోదానమని దానితోకపై కొన్ని అణాలైన వారు పెట్టించితీఱుదురు. ఇది దురంతమైన బలాత్కారము. ఇక నందు తడయక, టాంగాను రాకపోకలకై కట్టించుకొంటిమి కావున, దూరమందున్న బండివానిని పిలిచి మేము దానిపై నెక్కి బండిని చరచర ద్రోలుమని అతనికి హుషారు యిచ్చితిమి. పండాలు బండి వెన్కబడిరి. "గోదానము తాలూకు పదియణాలైన నియ్యకతప్పదు" అని వారరచిరి. "ఇపుడు పోలీసుపటాలము వచ్చి మీ కిచ్చును. మీరు బ్రాహ్మణులు కారు. పుణ్యక్షేత్రములం దుండదగువారు కారు. మీరుండవలయుచోటు చీకటికైదు. మీ 'జులుమ్' సహించువారము కాము. తగు శాస్తి బొందెదరు. ఉక్కుమీఱి ప్రవర్తింపకుడు" అని పట్టరాని కోపముతో నే జెప్పితిని. బండి చరచర పోవుచునేయున్నది. ఒకరిద్దరుపండాలు హుమ్మని బండిపై నుఱుకబోయిరి! నా బండివాడు ముసల్మాను అప్పటివరకు అతడు తనకేల యని యూరకొనియుండెను. ముసల్మానుబిడ్డ! వానికి వీరావేశము కలిగినది. కవిసీకర్ర చేబూని కను లెఱ్ఱజేసి అతడు నిలిచినాడు.

ఉత్తర హిందూస్థానములో హిందూ ముసల్మానులకు విరోధము. హిందువులు సాధారణముగ ముసల్మానుబండివానిని కుదర్చనేకుదర్చరు. నే నీనియమమును పాటింపక తనబండినే ఏర్పరచినందున బండివానికి నాపై భక్తికుదిరినది. ప్రసంగధోరణినిబట్టి నేను దక్షిణదేశస్థుడ నని ఆతడు గ్రహించినాడు. దాక్షిణాత్యులపై నచటి మహమ్మదీయుల కెట్టికోపము లేదు. "ఒకజాతి చెడ్డది వేఱొకజాతి మంచిది" అని చెప్పలేము. ఆనిర్జనప్రదేశములో నాకు సన్నిహితుడై నన్ను గాపాడ సంసిద్ధుడైనవ్యక్తి ఒక మహమ్మదీయుడు. "ముష్కరుడైన తురుష్కు" డనియు, "కరకు తురక" యనియు, "తుచ్ఛుడైన మ్లేచ్ఛు" డనియు సాధారణముగ మన మీతనికి పేరు పెట్టుచుందుము. "తోడిభారతీయుడు, నా సైదోడు. ఈతని హృదయమందు అమరనదీ విమలవారిబోలు అనుకంప తొలుకాడుచున్న" దని నే నాముహూర్తమున గ్రహించితిని. ఆముహూర్తమున దురంత దౌష్ట్యమున కొడిగట్టినవారు తోడిహిందువులు, తోడిబ్రాహ్మణులు. ఈదురాత్ముల దుశ్చరిత్రను పొడగాంచి హిందూసంఘమును గురించి ఎట్టిదుర్విమర్శనమును చేయను. కాని ఒకప్పుడు మహత్తరమై యుండిన హిందూసంఘము నేడు నేలగూలినదనియు, దీనికి నేడెంతో సంస్కరణ మవసర మనియు, ఈ సంస్కరణము నందినపుడే నేడు దీని నెదుర్కొనిన తీవ్ర సమస్యలు పరిష్కారమునందగలవనియు, హిందూసం

* సీత అగ్నిప్రవేశ మచట గావించె ననుటకు రామాయణములో నెట్టి నిదర్శనమును లేదు.



పత్రికా పఠనము V. K.

ఘము పునరుద్ధరణము నందగలదనియు నొక్కివక్కాణింతును.

బండివాడు లేచినంతనే నాకును బల మధికమైనది. నాచేత గఱ్ఱలేదుగాని, వాడియంచులుగల పెద్ద మరచెంబు ఉన్నది. మరచెంబును నేను చేబూని నూతెను శారద కిచ్చితిని. మువ్వురము యుద్ధసన్నద్ధులమైతిమి. ఇక తమ పప్పు ఉడుకదని గ్రహించి పండాలు తోక జాడించిరి.

వింధ్యవాసిని దర్శింప నరిగినపుడు త్రోవలోనే తోడేళ్ళవలె పండాలు మమ్మెగుర్కొనిరి. అమ్మవారి సమక్షమున పూజారి చిత్తమువచ్చిన మొత్తమును పెట్టి తీరవలెను. జగద్ధాత్రి మ్రోల నాత డుచ్చరించు మాటలు కర్ణకఠోరములై యుండును. కల్లుసాకల పొంతగూడ నట్టి గుమాస్తులను వినము.

మూకమూకలై యెదురగు పండాలు "మీదే యూరు" రనియు, "ఏ మొహల్లాలో దిగుద"రనియు, "మీ రెంతమంది" యనియు క్రాసుపరీక్ష చేయుదురు. ప్రతి ప్రశ్నకు ప్రతివానికి జవాబుచెప్పుట అసాధ్యము. ఏ ప్రశ్నకు జవాబుచెప్పక అంతమూ వారు పీడించినపుడు "ఎచటనుదిగెద"రనినపుడు బొబ్బర్లంకయనియు,"ఎచటనుండి వచ్చి" రనినపుడు సుబ్బారాయుడనియు వారికి తెలియని తెలుగుమాటలను, తెలుగు పద్యములలోని పదములను ప్రత్యుత్తరములుగా నుచ్చరించువాడను. పండాల యొక్కయు, పూజారుల యొక్కయు వృత్తాంతము దెలుపవలెననిన నీసందర్భమున గ్రంథము పెరిగిపోవును. వీరికి సంపూర్ణమైన ఆంతరంగిక పరివర్తన మవసరము. వీరిని హద్దుపద్దులందు నిలుపు చట్టపు కట్టుదిట్ట మవసరము. ధూర్తులను పుణ్యస్థలములనుండి తఱిమికొట్టవలెను లేకున్న యాత్రీకులకు పుణ్యక్షేత్రములయెడలగల విశ్వాసము తుక్కుతుక్కలగును. పరిస్థితులు బాగుపడనంతవఱకు యాత్రీకులు వీరిపై నాధారపడక ప్రత్యేకమైన యేర్పాటులు గావించుకొనుట బాగు. తమ పురోహితుని వెంటనిడికొని, హిందీని కొంతవఱకైన నేర్చుకొని పరిభ్రమణమునకై పయనమైనచో దుర్వ్యయమునుండియు, దుష్టులబారినుండియు వీరు విడివడజాలుదురు.

కొంతసేపటికి స్టేషనుమాస్టరు గదినుండి యావలికి వచ్చితిని. చరచరవచ్చి గంగాధర రామచంద్ర ఖాండవే నాముందు నిలిచినాడు. నేనేమో యోచించుకొనుచుండ "ఇది మహాక్షేత్రము. రామక్షేత్రమూత్రమేకాదు. ఒకప్పు డిచట నీశ్వరుడు తపసుచేసినాడు. బ్రహ్మ యజ్ఞము చేసినాడు. దేవత లిండ్లు గట్టుకొని నివసించినారు. నదికడ నావ యెట్లవసరమో తీర్థస్థానముకడ పండా యట్లే అవసరము." అని యాతడేమేమో చెప్పినాడు. నే నూరకొనియుండుటచే ఆధోరణి స్వగతములో చేరిపోయినది. ఇంతలో నాసిక పోవు బస్సు వచ్చినది. "బ్రహ్మవలె యజ్ఞము చేయుము. ఈశ్వరునివలె తపసుచేసికొనుము. యాత్రీకులను పీడింపకుము" అని బుజముపైతట్టి ఖాండవేను హెచ్చరించి, నేను బస్సులో ప్రవేశించితిని.



శ్రీ యస్. వి. యస్. రామారావు గారు



వీరికి మదరాసు "ఫైను ఆర్ట్సు సొసైటీవారి చిత్రకళాప్రదర్శనము (1936) ఈ చిత్రమునకు ప్రథమబహుమతి యొసంగబడెను.




## సంధి

కర్త కోరాడ రామకృష్ణయ్యగారు, యం. ఏ. తెలుగు సీనియర్ లెక్చరర్, ఓరియంటల్ రీసర్చి ఇన్‌స్టిట్యూటు, మదరాసు విశ్వకళాపరిషత్తు.

వెల రు ౧-౮-౦.

ఇంచుమించుగా నవీన ప్రాచీనకాలములకు సంధికాలమునందు నిర్మితమైన యీ 'సంధి'యను వ్యాకరణ విమర్శగ్రంథము వెలువడుట యాంధ్రుల యదృష్టము గాని యన్యముగాదు.

రత్నము సానపట్టుటచేఁ బ్రకాశించునట్లు భాషయు విమర్శనముచే వన్నెకెక్కును. ఆంధ్రభాష కింతవఱకు సమగ్రమగు వ్యాకరణము వ్రాయఁబడలేదు. ఇందనుక నున్న వ్యాకరణములన్నియు సంస్కృత భాషాసంప్రదాయము ననుసరించి వ్రాయఁబడినవి. కావుటవి యథార్థమగు నాంధ్రభాషాతత్త్వము నెఱిఁగింపఁజాలకున్నవి. కనుకనే యహోబలపతి మున్నగువారు భాషాతత్త్వము తెలియక నిర్దుష్టములగు పెక్కు ప్రయోగములను దిద్ది తెలుఁగుఁదనమునకు హాని వాటిల్లఁజేసిరి. దేశభాషలకు వ్యాకరణము వ్రాయు వైయాకరణులు ఆయా భాషలకు సన్నిహితములగు భాషల తత్త్వముల నారసి వ్రాయవలయు ననుట నిర్వివాదము.

తెలుఁగునకు వ్యాకరణము వ్రాయు వ్యాకర్తలు తెలుఁగుభాషకు జననియనందగు మూలభాషనుగూడ బాగుగా నెఱింగి తమసూత్రముల నిర్మించియుండిరేని పెక్కు ప్రయోగములు సాధువులై, త్రోసివేయరానివియై యుండెడివి. కాని యట్టిదారిని మనపూర్వులు త్రొక్కరైరి. కావుననే వైయాకరణశిరోమణులగు వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రిగారు గూడఁ దమ యథర్వణకారికావళి పీఠికలో "అహోబలపతి మున్నగు మన యిటీవలి వైయాకరణుల నాఁటికి 'కాల్డ్‌వెల్' మొదలగువారి భాషాశాస్త్ర గ్రంథములవంటివి బయలు వెడలియుండకపోవుటచేతను, వారి కితర ద్రావిడభాషల జ్ఞానము లేకుండుటచేతను, భాషాశాస్త్రపద్ధతిని మీఱి కేవల ప్రభుసమ్మితములవలె నడుపఁబడిన సంస్కృత వ్యాకరణములనుమాత్రమే వారభ్యసించియుండుటచేతను ప్రమాదములు వారిగ్రంథములలోఁ బడుట కవకాశము గల్గెనని చెప్పుట సాహసము గాదు" అని వచించిరి.

శాస్త్రిగారివంటి మహావిమర్శకుల, వైయాకరణుల యాశయమును, గోరికను గార్యరూపమునఁ బెట్టి యాంధ్రులమన్ననకుఁ బాత్రులుగా శ్రీకోరాడ రామకృష్ణయ్యగారు రచియించినదే యీ 'సంధి.'

ఈ 'సంధి' వ్యాకరణములకు లొంగని పెక్కు ప్రయోగములను సాధించుటయేగాక వాని వ్యుత్పత్తులను గూడఁ గూలంకషముగాఁ దెలుపుచున్నది.

జీవద్భాషయగు నాంధ్రమునకుఁ గాలక్రమమున జరిగిన మార్పులన్నియు నీసంధి చూపుచున్నది. ఏశబ్దమునైనను సాధింపవలయునన్న దాని పూర్వోత్తరోదంతము నామూలముగా నెఱింగి తత్త్వనిర్ణయము చేయవలయు నను సిద్ధాంతమును బోధపఱచునదియే యీ 'సంధి'.

సంధియననేమి? ఈప్రశ్నకు సమాధానముగా నీగ్రంథోత్పత్తి మూలమైనది. చిన్నయసూరి మతమున "పూర్వపరస్వరంబులకుఁ బరస్వర మేకాదేశమగుట సంధి."

కేతన మతమున

"మొదలి పదము తుదివర్ణము
వదలక పైపదము మొదలివర్ణముతోడన్
గదియఁగ సంధులు నాఁదగు" —అని

విన్నకోట పెద్దనమతములో

ఆదిశబ్దాంత వర్ణంబు నంత్యశబ్ద
పూర్వవర్ణంబుతోఁ గూడఁ బొత్తుచేత
సంధి యగు—అని.

ఇందు సూరిగారి సిద్ధాంతము అనుపపత్తిమూలకము. సూరిగారి మతముచొప్పున లోపాదేశాగమ కార్యములు సంధికార్యములు కాకపోవలసివచ్చును. అయినను వీనిని సంధిప్రకరణములోమాత్ర మాతఁడు చేర్పకయుండలేదు. కాఁగా నీయాగమములన్నియు సంహితావశయందుఁ గలుగు మార్పులేకావున నివియు నీప్రకరణమునఁ జేర్పఁబడినవని తలంపనగును...చారిత్రకదృష్టితోఁజూచినచో వాస్తవముగా 'ను'గాగమ 'టు' గాగమ 'రు'గాగమాదులుచ్చారణ సౌకర్యము కాగణముగాఁ జేరినవిగాక, సహజముగా నాయాశబ్దములకుఁ జెందినవో, లేదా యట్టి కొన్నిప్రాచీనశబ్దముల సామ్యముచేఁ గాలక్రమమున భాషలో నేర్పడినవో యనుటచే సంధికార్యములుగాఁ బరిగణింపఁదగనివియేకావని చెప్పవలసియుండును."

ఇదియెంతయు యథార్థము. కావుననే పెక్కుశబ్దములకు సంధికార్యములతోడి యనావశ్యకమును జాటి తొలుతటి యఖండవాక్యములోని యథార్థప్రాచీనరూపములనీసంధి మనకనులయెదుటఁ బెట్టుచున్నది.

పొదరిల్లు అనునపుడు 'రు' గాగమవిధి యవసరములేకయే 'పొదరు X ఇల్లు' అను సత్యరూపమును జూపి యందులకు 'పరఁగఁ బొదరు పొదరు పల్లంబు పల్లంబు' అను తిక్కనప్రయోగమును జూపుచున్నది. ఇట్లే 'మగనాలు' అనునది "మగని + ఆలు" అనుదానినుండి యేమ్యాదిగణంబులోఁ జేరి 'మగనాలు' అని కాక మగన్ + ఆలు అనుదానినుండి యేర్పడినది. ఇట్లే పురుడు + ఆలు మున్నగునవి. కుటు + ఉసురు కుట్టుసురు; చిటు + ఎలుక చిట్టెలుక యనికాక 'కుట్ట్ి + ఉసురు, చిట్ట్ + ఎలుక' అని యేర్పడినవి.

ఇట్లే తొన్ + పది తొంబది, గోఁ—గోంగళ్ గోంగులు, గోఁగులు; నెఱి, నెఱింగళ్, నెఱింగులు-నెఱఁగులు; పేదర్ + ఆలు-పేదరాలు ఇత్యాది పెక్కురూపములను అపూర్వఫక్కిని తమిళకర్ణాటశబ్దముల సాదృశ్యముతో సాధించి తెలుఁగునకుఁ బ్రత్యేకాగమశాస్త్ర మనావశ్యకము అనుటను పాఠకులకు సుబోధకలిగించిన దీ నూతనమగు 'సంధి'. ఇందలి విషయములన్నియు నపూర్వములు. ఆంధ్రులకు, అనఁగాఁ గేవలాంధ్రభాషా మాత్రికవేదులకుఁ బారాయణము చేయఁదగినవి.

ఈ 'సంధి'యందుఁ బరామర్శింపఁబడిన విషయములు:—"భాషాలక్షణము-వ్యాకరణము, ఆర్యభాషారూపములు-చారిత్రకచిహ్నములు, ఆంధ్రమున నాగమవిధానము, బహువచనరూప నిష్పత్తి కుక్ విధానము, సంధిస్వరూపలక్షణములు, సంధిలోని యాగమాదుల స్వరూపము, యడాగమస్వరూపము, ద్రావిడభాషలోని సంధి, సంస్కృతభాషలోని సంధి, లోపసంధి, పదాంత్యవర్ణలోపము, ఇకార—ఉకార సంధులు, ప్రథమావిభక్తి ప్రత్యయస్వరూపము, ప్రథమేతర విభక్తి సంధి, అపదాదిస్వర సంధి, ద్విరుక్త టకారము, ప్రాంతాదులు ఆగమసంధి, 'టు' గాగమ 'రు' గాగమములు, అందుకు ప్రభృతులు, నుగాగమము, అలిగాగమము, ఆదేశసంధి, గసడదవాదేశసంధి, సరళాదేశసంధి, కళాద్రుతప్రకృతికవిభాగము అనునివి. ఇందలివిషయము నవిషయమే యపూర్వమైనది. ౭౩ సూత్రములతో నన్నియ భట్టును, ౨౨ సూత్రములతోఁ జిన్నయసూరియు ముగించిన సంధివిషయములు ఈ నూతన 'సంధి' రాయల్ సైజు పొత్తములో నూటయేఁబదియెనిమిది పత్రములచే నెలయించుచున్నది. ఎన్ని యపూర్వవిషయములు లేకున్న నీగ్రంథ మింత పెరుఁగునో చదువరు లూహించుకొందురుగాక! అనిదంపూర్వమగు నీ 'సంధి'ని వ్రాసి వెలయించి శ్రీరామకృష్ణయ్యగా రాంధ్రభాషకు మహోపకారము నొనర్చిరి.

'స్వస్థానవేష భాషాభిమతాః
సంతో రసప్రలుబ్ధధియః'

అను ప్రసమాచార్యుల వాక్యము సార్థకముగావించుచున్న రామకృష్ణయ్యగారి నేరితిని బొగడినను నత్యుక్తి కాఁజాలదు. విశ్వశ్రేయమే ప్రధానముగాఁ గల శ్రీరామకృష్ణయ్యగారి కిదివిధినిర్వహణ మేకదా!

ప్రాచ్యభాషా పరిశోధనాలయమును నెలకొలిపి భాషాసాహిత్య విమర్శనగ్రంథముల నాయా

భాషల రచియింప నేర్పాటుగావించిన మదరాసు విశ్వకళాపరిషత్తు మిక్కిలి అభినందింపఁదగినది. తమకు విశ్వకళాపరిషత్తువారు సమకూర్చిన సౌకర్యములను వినియోగించి శ్రీ రామకృష్ణయ్య పంతులుగారు ఇట్లే యికముందును ఆంధ్రభాషా సాహిత్యతత్త్వప్రకాశకములగు గ్రంథములను పెక్కింటిని రచియించి యాంధ్రభాషాప్రశస్తిని బ్రకటింతురుగాక !

పెనుమెచ్చ సత్యనారాయణరాజు

---

## జగత్కథ

ఈ భూమండలమున నొకానొక కాలమందు భరతఖండమువలె నఖండ పరిపూర్ణ సామ్రాజ్యము ననుభవించి, వెనుకటి కాలమున నింతయాత్మవిస్మృతిచే స్వస్వరూపజ్ఞానమును గోల్పోయిన దేశము వేరొకటి కానరాదు. ఈ యధఃపతనమునకు రాజకీయదాస్యమే కారణమని నొక్కిచెప్పవచ్చును. మనదేశము వేయి వత్సరములుగా విదేశీయుల పాలైనది. ఆవిదేశీయులు తమ పాలనప్రాభవముల బలపఱచుకొనునిమిత్తము తమ భాషను రాజ్యభాషగా నొనర్చి దానియందు దక్షులగు వారికి రాజకీయోద్యోగముల మచ్చుపెట్టి యాభాషావ్యాపనముచే దేశీయభావములు తలలెత్తకుండునట్లు కావించిరి. మనదేశమున పాశ్చాత్య విద్యాభివృద్ధితో పాటు సర్వతోముఖమైన పాశ్చాత్యవ్యామోహమును గూడ వ్యాపింపజేసినగాని బాహుళ్యమైన భారతీయ పూర్వచరిత్ర, సంప్రదాయ, విజ్ఞానము లణఁగి దేశము తమ యధీనము కాజాలదను రాజనీతిరహస్యము నూహించి తదనుగుణముగ విద్యాప్రణాళికలు సిద్ధపఱిచియు, పాఠ్యగ్రంథములు ప్రకటించియు కృతకృత్యులయిరి. ప్రాచీనసంప్రదాయములకు పునాదులగు స్మృతులును, పురాణములును అబద్ధములకు పుట్టినిండ్లనియు, అవి స్వార్థపరులగు స్వల్పసంఖ్యాకులచే పామరుల వంచింప నేర్పడిన గ్రంథములనియు, భారతీయుల తేజస్సంతయు నెరవు సొమ్మనియు, వారివిజ్ఞానమంతయు యవనాదులమూలమున సంపాదితమనియు వేవిధముల చాటి భారతీయుల కాత్మశక్తియందు నిరుపమానశంకను పుట్టించి కృతార్థులయిరి.

కాని, వారి యీ జతనము స్వవిషయవిస్మరణదూషితులగు భారతీయులకు ననుకొనని ఫలితాంతరమొనగూర్చినది. ఆధునికయుగమున నాగరకాగ్రగణ్యులనియు, స్వాతంత్ర్యప్రియులనియు ఖ్యాతిగడించి లోకాభివృద్ధికై పాటుపడవలసినవారు తామేయని భావించి ప్రకటించుకొను నీపాశ్చాత్యుల విద్యావిధానము మనయందంతర్లీనమైయుండిన సాంఘికార్థిక స్వాతంత్ర్యాభిలాషల నప్రయత్నముగ, ననివార్యముగ, ననాంఛితముగ దేశమంతట వ్యాపింపజేసి దేశీయోద్బోధ గావించెను. ఏతత్ఫలితముగ పూర్వవాసనాపరిచితులు విస్మృతౌన్నత్యమునకు గారణములారసి ప్రపంచమందలి సకలదేశముల నీసాంఘికార్థికరాజకీయాది వ్యవహారము లేయే పరిణామముల నెట్లందెనో పరిశీలించి పూర్వకాలమున నెప్పటికప్పుడు మనయందేర్పడు దోషముల నిర్మూలించుకొనుచు నూతనసంస్కారముల జేయుచుండినందువనే యట్లుంటిమనియు, ప్రకృత మనావశ్యకవిషయములందు దలదూర్చి యావశ్యకముల ననాదరణము గొనుటవలననే హీనస్థితి మనకబ్బెననియు నిర్ధారించిరి. మఱియు విజ్ఞానవ్యాప్తికి విదేశభాషాపఠనము గొప్పయాటంకమనియు విస్పష్టమాయెను.

అదియునుంగాక స్వాతంత్ర్యప్రియము ప్రతిదేశమును నిజదేశభాషయందు విద్యాప్రణాళిక నేర్పఱుచుకొని, విదేశభాషలనుండెడి యపూర్వగ్రంథముల యనుకృతిమూలమునను, భాషాంతరీకరణము మూలమునను తమతమభాషల పెంపొందించుకొనుట లోకవిదితము. ఏజాతియు విదేశభాషామూలమున విజ్ఞానోన్నతిగాని ఆర్థికోన్నతిగాని గడింపలేదు. ఏతత్క్షణపర్యంతము మనయాంధ్రలోకము నావరించియుండిన చీకటి యొక్కింత వీడినది. తన్మూలమున భాషేతరములనుండి యుద్గ్రంథముల నాంధ్రీకరించి తద్విజ్ఞానము మనసొమ్ము కావించుకొనవలయుననియెడు తృష్ణ కొందఱికి కలుగగా తత్కార్యసిద్ధికి వలయు పారిభాషిక పదజాలము స్వల్పమయ్యును తమసంకల్పము నెఱవేర్చుకొని మార్గదర్శకుల

గుటయే జన్మసాఫల్యముగ నెంచిన క్రియాశూరులు అనేకులుకలరు. వారిలోనొక్కరు మన "జగత్కథ"కు కర్తయగు శ్రీ కొమాండూరి, శఠకోపాచార్యులు, ఎం.ఏ. బియల్ గారు, వారి కృతి స్వతంత్ర గ్రంథముకాకున్నను తత్సమానపదవి నలంకరింప దగినట్టిది.

ఒకానొక యాంగ్లకవి గ్రంథములగూర్చి ప్రశంసించుచు వానిని తాత్కాలికములు, సార్వకాలికములు నని యిరు తెగలుగ విభజించెను వానిలో నీరెండవ తెగకు చెందినది యాంగ్లాభాషా రచితమగు శ్రీ వెల్సుగారి " Short History of the world " వారు తమ పీఠికయందా గ్రంథముంగూర్చి "ఈచిన్ని చరిత్రము నవలను చదువురీతిని సరాసరిగా చదువుట కుద్దేశింపబడినది. వివరములు క్లిష్టవిషయములు లేకుండ, ఇప్పటికి తెలిసియున్న చారిత్రికవిషయముల సామాన్యసంగతు లిందుండును.........మానవజాతి ప్రవృత్తిని గూర్చిన మనోభిప్రాయములు మరలజ్ఞప్తికి దెచ్చుకొనుటకు ఈగ్రంథము ముఖ్యముగా నుద్దేశింపబడినది." అనివ్రాసియున్నారు. అది యట్టిదే యగును.

ఈగ్రంథమున భూలోక మెట్లుపుట్టినదో, అందు ప్రాణికోటు లెట్లు సక్రమమున నుత్పన్నములైనవో, జీవవికాస మేయే పరిణామముల జెందుచు నానాటికి నభివృద్ధి గాంచుచున్నదో, రాజకీయ సాంఘికవేష భాషాచార వ్యవహార, ఆధ్యాత్మిక నీతిభావముల పట్ల ప్రజానాగరకత యేక్రమమున బెరిగినదో శాస్త్రీయదృష్టిని నిరూపింపబడియున్నది. అవాంతరభేదములచే నొప్పుచు, పరస్పర విరుద్ధములుగ గూడ గన్పట్టు ప్రజాసంఘముయొక్క నీతి మత సంప్రదాయక వైమనస్యముల నేకత్వము గల్పింప నుద్దేశించిన సంక్షిప్త గ్రంథముగ దీనిని భావింపవచ్చును.

వెల్సు మహాగ్రంథము చదువునెడ యూరపు ఖండమును, తత్ఖండస్థ క్రైస్తవమతమునే నాగరకతకును, విజ్ఞానమునకును జన్మస్థానములనియు, అఖండవాసులును, వారిమతమునే తరణోపాయమనియు వారుద్దేశించినట్లు తోచును. కాని యట్టి దోషమునకు లోనుగాక ఆచార్యులవారు మూలము ననుసరించుచు ఏయేపట్టుల తమకు భిన్నాభిప్రాయము కలదో నాయాపట్టుల టిప్పణుల మూలమున దెల్పుదు, పాశ్చాత్యశాస్త్రీయ సిద్ధాంతములకును మన పురాణాదులందు దెల్పబడిన సర్గప్రతిసర్గ సిద్ధాంతములకును తారతమ్య మెంతో లేదని సాధించునపుడును శ్రుతిస్మృతి పురాణాదులనుండి ప్రమాణములను బహుళముగ నొసగియున్నారు. అట్లొనర్పగా మూలమందలి లోపములు కొన్ని సమసినవి. ప్రతిపుటపాదమునను టిప్పణు లాచార్యులవారి పరిశోధనావిస్తృతిని, సత్యస్పృష్టిని, ధారణాశక్తిని, నిజదేశౌన్నత్యము నిలువబెట్టవలయునను నాసక్తిని వేవిధముల చాటును. ఈయాంధ్రగ్రంథము జదివిన సృష్టియందలి మూలసూత్రములు మానవమనోభావములం దేకరీతిగ బ్రవర్తిల్లుచుండుననుట రూఢియగును.

మూలగ్రంథమున భరతఖండము గూర్చి రెండధ్యాయములు మాత్రమే కలవు. అవి బుద్ధుని, అశోకుని గూర్చి వివరించును. ఆసందర్భమున టిప్పణుల జేర్చి మనదేశ చరిత్రమును మఱింత విపులము గావించియున్నారు గాని గ్రంథమూలమున భారతీయులు ఒకానొకప్పుడు ఖండఖండాంతరములం దల్లుకొని భూలోకమంతటిని మహోన్నతస్థితికి దే బ్రయత్నించినవారను పరిశోధనాఫలితములు హెచ్చరిక చేయబడలేదు. అట్లు చేసియుండిన ప్రాచీనులు కూపకూర్మములవలె నుండక దిగంతముల వ్యాపించి వన్నెయు వాసియు గాంచి సామ్రాజ్యస్థాపకులుగ నెలసిరను భావము వెదచల్లుటకవకాశ ముండియుండుననుట నా యాశయము.

మఱియు, మన యితిహాసాదులందు వర్ణింపబడిన మహోన్నతులును, వికృతాకారులు నగు రాక్షసాదిజాతులును, శరభాది మృగములును, గండభేరుండాది పక్షిజాతియు భారతీయుని యూహాసృష్టిగాక వాస్తవ ప్రపంచమున నెలసియుండినవే యనుటయు, పూర్వ ఋషులు సత్యముకొఱకే పాటుపడిరనుటయు విస్పష్టమగును.

ఈజగత్కథారచనము మన యాంధ్రభాషా చరిత్రమునం దొక విస్ఫుటయుగమును స్థాపించును. మన

పూర్వులు సామ్రాజ్యస్థాపకులుగ వన్నెకెక్కియుండిరి. అట్టివారికి నేటికి క్షీణదశ సంప్రాప్తించినది. కాని మన భాషకు భావికాలమున నుత్కృష్టపదము కలిగి Italian of the East అను బిరుదమును సార్థకపఱుచుకొనునను టకిదియొక శుభసూచనము. ఈసందర్భమున నొక చిన్న హెచ్చరిక. ఆంధ్రభాష పెల్లుగ సంస్కృత భాషపై నాధారపడి నూతనవిజ్ఞాన విషయములను, ఆధునికభావ శ్రేణిని ప్రచురించుట కనువుగానిదనుట పొల్లనియు, నట్టి యభిప్రాయవ్యాప్తికి మన విశ్వవిద్యాలయములును, అందు పట్టభద్రులగువారి మతృభాషానిరసనమే కారణములనియు, వారి యుద్బోధనమునసే మనకు శ్రేయమున గూడవలయుననియు హెచ్చరించుచున్నాను.

ఆంధ్రభాషయందు గ్రంథరచనమకష్టము కాదు. పండితపామరహృద్యమగు సరళభాషను గ్రంథరచన మొనర్చినవార నేకులుగలరు. చారిత్రిక రచనావిషయమున నద్దానికి మార్గదర్శకులుగా శ్రీశంకోపాచార్యులగారొప్పుచున్నారు. వారిగ్రంథము మనభాషయందు ప్రపంచ చరిత్రలేనికొరతను తీర్చినది. వాఙ్మయమున కొక యమూల్యమాణిక్యముగా నమరినది. ఈ యుద్గ్రంథమునందు కొన్నిలోపములు, నాకు దోచినవి యిట దిఙ్మాత్రము జేకొనియెదను. అయ్యవికూడ లేకుండిన నిది ప్రాచీనాధునికభాషాభిమాను లెల్లరకును అత్యంతాభిమతమై యుండెడిదని నాయాశయము'

౧. గ్రంథమంతయు వ్యావహారిక భాషలోనైనను, గ్రాంథికభాషలోనైన నుండవలెను. వాటి, వీటి వాని, వీని, కొత్త, కొవ్వు మొదలగు కొన్ని వ్యావహారిక పదములను చొప్పించుట యుక్తముకాదు.

౨. సాహిత్యసంబంధమగు పద్యకావ్యములలో మాత్రమే వ్యాకరణమును పాటింపవలయునుగాని తదితర గ్రంథములందావశ్యకము కాదనుభ్రాంతి మనలను వీడవలయును.

(ఎ) జాతులు వచ్చిరి; జాతులు వ్యాపించును. మొదటి జీవు లవతరించెను; మృదుదేహులు మత్స్యములు, జీవిప్రసవులు-హిండిల్బర్గనరములు, హిండిల్బర్గనరులు - ఇత్యాదులందు మహదర్థకామహదర్థకవిభేదము పాటింపబడవలెను.

(బి) థధల యుచ్చారణభేదము వ్యవహారమున కొన్ని మండలములందు మృగ్యమగుచున్నను గ్రంథస్థము కాకున్న పు డవి సమస్తాంధ్రులకు నాదరణీయములు కావనుట విస్మరింపరాదు.

అర్థము—అర్థము, యధార్థము, యాథార్థము వ్యర్థము, పృథివి, స్వార్థము-స్వార్థము; ఆర్థిక ఆర్థిక-ఇత్యాదికలగలుపువర్ణక్రమప్రయోగములు బహుళములు.

(సి) తెనుగుభాషయందు వర్ణక్రమము ననుసరింపనక్కఱలేదనువాద మొకటికలదు. వ్యావహారికరూపము లెవరికి తోచినట్లు వారు వాడవచ్చునుటకు నిదర్శనములు—

వశించు, చేసుకొను, అస్థి—అస్థి (ఎముక అను నర్థమున) తత్వము, శేల్లు శేళ్ళు, చిత్రపులు, చిత్తరువులు, మరిస్జ్జు, ఋష్యాసులు, వంస

(డి) విషయక్లిష్టత మూన్చుటకు విసంధియొంతో సహకారి యగునుగాని, దానిని విసుగు పుట్టింపదగునంత విస్తారముగా ప్రయోగింపరాదు.

"ఈస్థితిలోనున్న అండపిండములను...అవి మొదట అత్యల్పప్రాణులుగను, అంతట మత్స్యాంగకములుగను,...చివరకు ఆయాజాతి జంతువుల ఆకారము నొందునని తేలినది.

"ఐతే ఇవి అన్నియు...

"అట్లునో భూమి ఆరంభించి అనేక కల్పములై యుండును.

"ఈఉల్కల పదార్థము ఇనుపగనులలోని..."

ఇట్టివి పెక్కులు. సంధిచేయుటవలన నష్టమేమియు గలుగదు. సంధి కలుపునెడ కళాద్రుతప్రకృతిక భావము మఱచుటయు, ఉకారసంధికి యడాగమము గావించుటయు పెక్కుచోట్ల గంధక్లెను.

"సూర్యగోళముయొద్ద, వానిచుట్టు అతిశీతముగ, ఆరీతిగా యేర్పడియుండవని, కాదనియు రెండవనిమట్టుకు

జనులు యెవరియిష్టము, సంఘర్షమునను యితర అంత కన్న యెక్కునకు...మొదలైనవి.

(ఇ) ఈగ్రంథమునందు అరసున్నల ప్రసక్తియే లేదు. అయ్యది యొక యాధునిక మతము. కాని గ్రుత్ప్రకృతికములకు పరుషములు పరమగుచోట్ల సంధికార్యము గావించి యరసున్న లిఖించుట మంచిదనియు, శబ్దస్వరూప విజ్ఞానమునకెంతో తోడ్పడుననియు నామతము.

(ఎఫ్) "విస్తుల జల్లు కాలమందు కోతలలోను మంచిపంటలకై ... "ఆఫ్రికాలో చాలమంది గోధుమ వర్ణపు ఉష్ణమజాతి, శ్యామవర్ణపు నీగ్రోజాతి, వీటి మిశ్రితులుగా నున్నారు.

"మైల, అపరిశుద్ధత, ప్రమాదకరములు; అందుచే ...ఎక్కయు ఆదివాసిగకుం దక్క..."

ఇట్టిస్థలములందు విశేషణములమన్వయము, విశేష్యముల మన్వయ సముచ్చయము నుపయోగింప వలయును. వ్యవహారమున నీకార్యము పదాంత స్వరమును పొడిగించుటచే నెఱవేఱినను వ్రాతలోమాత్రము విడువరాదు.

(జి) షష్ఠీవిభక్తి ప్రత్యయమునకు 'కు' ముందు నుగాగమములేమి. కొన్నిపట్టుల కర్ణకటువుగా నుండును.

"ఇతిహాసములకును, మతములకును శరీరముకు..." నుగాగముగల ప్రయోగములును 'పరిణామమునకు'—ఇత్యాది వాడియుండగా సర్వత్ర ఏకవిధాన మనుసరించిన చక్కగనుండుననితోచెడిని.

(హెచ్) సమాసమన్వయమున సంధిగావింపమి దుర్భరముగానున్నది.

"ప్రపంచపు ఆశాదేశముల, వారి ఆర్థిక, ఈ అధ్యాయమున, భూమిఉత్పత్తిక్రమము, భూమి ఉష్ణపము"

(ఐ) వాక్యరచనా క్రమము ఆంగ్లపద్ధతినేకాక వింతపద్ధతులనుగూడ త్రొక్కినది:

"సారదర్శిరిచే కనబడును."

"వ్యక్తికిని దానిశిశువులకును స్వరూపజాతిసామ్యముండును; కాని వాని మధ్య వ్యక్తిభేద ముండును."

"ఇది ప్రారంభదశలో యగుటచే దానిమస్తిష్క మిప్పటి ఖడ్గమృగముల మెదటి పరిమాణమునకును తీసి పోవును."

"ప్రపంచమున బోస్కాజాతి జీవులు నవజీవయుగమునందే మొదలిడెను."

"ఈకథలు గాథలు నిష్కపటములు సహజమైశైలిలో, అంజలి యథార్థభావములు పూర్తిగా మరుగుపడకుండనే, కనబడుచున్నవి."

"గాయత్రీ మంత్రమును కనిపెట్టిన విశ్వామిత్రుడు..."

"అప్పటి ఆర్యులమధ్య జన్మచే కులాచార భేదములుగాని, నారిలో అంతర్వివాహము అంతర్భోజనములు నిషేధించుటగాని, కనబడదు."

(జె) అల్పశిరస్సు, ఆర్యేతరభాషికులు—వినుటకింపుగాని సమాసములు.

(కె) ఆంగ్లభాషా పదముల నాంధ్రలిపిని వ్రాయుటలో నాభావమందలి యుచ్చారణకు లోటులేకయు, ఆంధ్రభాషా సామాన్యధర్మమగు నజంతశబ్దముగా మార్చియు వ్రాయుట మేలని నాయభిప్రాయము.

రెలిజియన్, ఎస్ట్రానమి, గజటీర్, ప్రొటెస్టెంటు, మిథాలజీ, ఎనాలిసెస్, ఎయోలిత్సు—ఇత్యాదులు.

(యల్) ఆంధ్రీకరణమున గొన్ని హెచ్చరికలు. Jaw-bone=దౌడనరము అని వ్రాసిరి. నరమునకు సమానాంగ్లపదము nerve, muscle కాదు. Recalcitrant princes=స్వతిరేక ప్రభువులు. ఇయ్యది ముష్కరులు లేక మూర్ఖులగు ప్రభువులు అనియుండిన మూలార్థకబోధకము గును.

Lava like masses-ఆగ్నేయ శిలలు.

The moon, which nowadays keeps one constant face to earth, would then have been rotating visibly and showing the side it now so inexorably hides. ఈభావ

మంతయు "ఇప్పటివలెగాక అప్పటి చంద్రబింబము రాత్రులందు విచ్ఛిన్నముగ నగుపడియుండును" అని సంక్షిప్తము కావింపబడినది.

"We have told of the glorious intellectual dawn of Greece and Alexandria, and presently the collapse of the slave-holding civilisations and the clouds of religious intolerance and absolutist government darkened the promise of that beginning=గ్రీసులోను అలెగ్జాండ్రియాలోను జ్ఞానోదయమైన సంగతిని, దాస్యపద్ధతి తగ్గిపోవుటను, మూఢభావములు నిరంకుశప్రభుత్వములు ఈజ్ఞానారంభమునకు విఘ్నముగలిగించిన సంగతిని జెప్పియుంటిమి."

పైనాంధ్రాంగ్లవాక్యముల పరీక్షించిచూచిన నారెంటికినిగల తారతమ్యమేర్పడును ఇట్టివి పెక్కులున్నవి ఈయాంధ్రీకరణ మాంగ్లభాష తెలిసినవారికిగాక తదితరుల కనువెడల గూడ మూలమందలి భావములను విస్పష్టము చేయు బాధ్యత అనువక్తకునియందు గలదు. గ్రంథారంభమునందే "తెనుగున వ్రాయుటలో శైలిధారాశుద్ధతకన్న మూలసంగతుల సరిగ తర్జుమా చేయుటకే ముఖ్యముగ యత్నించితి" అని పలికియున్నారు. ఆప్రయత్నమునకు విశేషభంగము వాటిల్లినది. ద్వితీయ ముద్రణమందైనను సరిపఱుచుకొందురు గాక యని కోరెదను.

పారిభాషికపదముల సందర్భమునను ఆంధ్రవిజ్ఞానసర్వస్వాదికములను పరిశీలించియుండిన వీరికి శ్రమ తగ్గియుండుననిభావించెదను.

విస్తారమేల? ప్రూఫ్ సంశోధనములనెల్ల వీరేసవరించి తమపీఠికయందొక హెచ్చరిక వేసికొనియున్నారు గదా! ఏల యీచర్విత చర్వణము నవలోకింపను. గ్రంథకర్తకు గోచరింపనివి యెన్నోకలవు. కనకనే యిట్లు చెప్పితిని. గ్రంథపునర్ముద్రణమున నివియెల్ల శ్రద్ధగా తొలగింపబడవలెను.

ఏదియెట్లున్నను ఈగ్రంథముమాత్రము ప్రత్యాంధ్రునిహస్తము నలంకరింపదగినది. నష్టమైన ప్రతిభను పునస్సంగ్రహముగావించుట కిది యుద్బోధకమగును.

వేదము లక్ష్మీనారాయణశాస్త్రి

---

## Federalism in Government

By

Mr M. Venkatarangaiya M. A.
Reader and Head of the departmen of history, economics and politics.
University College of Arts, Andhra University, Waltair.

Price Rs. 2.

౧౯౩౦ సంవత్సరమునుండి ఫెడరల్ విధానము భారతీయులదృష్టి నాకర్షించినది. దీనిని గుఱించిన కథనము రౌండుటేబిల్ కాన్ఫరెన్సులలో ప్రతిధ్వనించినది. నేడు భారతీయులచెవులందు గింగురుమనుచున్నది దీనినిగుఱించియే. కాని ఫెడరల్ విధాన మననేమో, దీనికి సంబంధించిన మౌలిక సూత్రము లెవ్వియో, మనదేశమందలి ప్రత్యేకపరిస్థితులకి వెట్లుచెల్లునో, ఇక నావిర్భవింపనున్న రాజ్యాంగ సంస్కరణములు భారతీయులను ఫెడరల్ ఆశయము దాపల నెట్లు చేర్చునో, క్లిష్టమైన నవసమస్యలు దీనికతన నెట్లు పరిష్కారము నందగలవో, కన్ఫెడరేట్ యూనిటరీ విధానములకును ఫెడరల్ విధానమునకును గల సంబంధమెట్టిదో, ప్రస్తుతవిధానమునకును, దీనికిని నడుమ గల ముందంజయెట్టిదో, దీనికి సంబంధించిన యూనికమెరల్ లెజిస్లేచర్ బైకమెరల్ లెజిస్లేచరులందలి వ్యత్యాసమేమో, రెండవ ఛేంబర్ ఫెడరల్ కవున్సిల్ లేయేపరిస్థితులం దక్కరైయుండునో, భారతపరిస్థితులకు రెండవఛేంబర్ ఎట్లవసరమైనదో మన నాయకులందు కొందఱికిమాత్రము దెలియును. ఈయంశములు ప్రతిభారతీయునకును సంబంధించినవి. వీనిని గుఱించిన పరిజ్ఞానమును ప్రతిభారతీయుడును హృదయంగమము కావించుకొనవలెను.

ఆర్థికరాజకీయాంశములు జటిలములైనవి. గట్టి మెదడుగలవారికిగాని యివి బోధపడవు. కొరుకుపడని కొయ్యలని వీనికి తిలోదకములువదలిన నీరసమానసులు కలరు. మీదుమిక్కిలి ఫెడరల్ విధానమునుగుఱించిన విపులాంశములు గల ఒక యుద్గ్రంథ మీవఱలో గానరాలేదు. ఈతీరు విధానము గల దేశములను గుఱించిన ఉదంతమునుండియు, వివిధరాజకీయ గ్రంథములనుండియు ఫెడరల్ పద్ధతి యిట్టిదని గ్రహించుటకుమాత్ర మీవఱలో నవకాశముండెను. శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్యగారీ కొరతను దీర్చిరి. వీరు రాజకీయ అర్థశాస్త్రములను పిడికిటబట్టిన మనీషులు. స్పష్టమై యెల్లఱకును దెలియునట్లు మణిమోహనసేతువలె బోధింపగలశక్తి వీరికి గలదు. వీరు కేవలము బోధకులు కారు. భారతస్వాతంత్ర్యోద్యమముపట్ల గ్రామపునరుద్ధరణోద్యమముపట్ల విశేషానురాగము గలవారు. తాము చర్చించు నంశములు దేశపరిస్థితుల కెట్లు చెల్లుబడియగునో యని పరిశీలించుట వీరి యలవాటు. వీరిగ్రంథమెట్టిప్రాముఖ్యము వహింపగలదో పెక్కుమాటలందు చెప్ప నక్కఱలేదు.

భారతీయుల చూడ్కిలోనున్నది స్వరాజ్యము. దీనిని గుఱించి తీవ్రాందోళనము జరుగుతఱి రౌండుటేబిల్ సభలనుండి ఫెడరల్ ఘోష రివ్వున నెగసి భారత దిగ్వలయమున వాలుటచే నిదిస్వరాజ్యమును, సంపూర్ణముగాగాని, అసంపూర్ణముగాగాని, మనకొసగునేమో అని కొందఱూహాపోహాపడుచున్నారు. స్వరాజ్యము ఫెడరల్ విధానమునకు సహజకుండలముకాదు. దీని గళసీమయందనివార్యముగా స్వాతంత్ర్యాశయము శ్యమంతకమువలె తేజరిల్లునని తలపరాదు. కనడా, స్విట్సర్లేంట్, ఆస్ట్రేలియా, యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికా మున్నగు సీమలందువలె ఫెడరల్ విధానము స్వేచ్ఛాదర్శమును మణిపేటికవలె జేతులబూని మన కప్పనమొనరించునని యూహింపజెల్లదు. కేంద్రప్రభుత్వమునకును స్థానికప్రభుత్వములకును, స్వతంత్రరాష్ట్రప్రభుత్వములకును నూతన సంబంధమునుగూర్చునదే అఖిలభారత ఫెడరల్ విధానమని మనము గుర్తింపవలెను.

ఈవిధానమున ప్రత్యేకప్రభుత్వముయొక్క పాలనాపరిమితి నిర్ణయముకావలెను. ప్రత్యేకప్రభుత్వాధికారమునుగుఱించి స్పర్ధాభిప్రాయములు చెలరేగకుండుటకై దీని పాలనమునకు సంబంధించిన సూత్రములు లిఖితములై యుండవలెను. ఈరీతిపాలనము నవలంబించిన దేశము లట్లు కావించినవి. కేంద్రప్రభుత్వముగాని, స్థానిక ప్రభుత్వములుగాని చిత్తమువచ్చినట్లు పాలనావిధానమున మార్పులను, హ్రాసపాదులను చేర్పజాలనిదై యుండవలెను. ఇట్లనిన నీవిధాన మెల్లపుడు బిఱ్ఱబిగిసి యుండునని తలపరాదు. న్యాయస్థానతీర్మానములు అక్కఱను బట్టి సమయాసమయములందు దీనియందు కొంతపరివర్తనమును దెచ్చితీఱును. కఠిననిబంధనలు ప్రత్యక్షమైనను, ప్రజలందు చెల్లుబడియగుచుండు వాడుక వాని నతిక్రమింపవచ్చునని న్యాయశాస్త్రము తెలుపుచున్నది. ఇట్టివాడుక కతన నీవిధానమున సముచితమైన మార్పుకలుగును. స్థాయి విధాన మనబరగినను ఇందు చలనసౌకర్యము లుండును. లిఖితపాలనాంశములను విచారించుటకును, వివిధ ప్రభుత్వములను తమతమ ప్రత్యేకాంగణమందుంచుటకును ఒకన్యాయస్థానము (సుప్రీమ్ కోర్టు) అవసరము.

భారతదేశమున ఫెడరల్ భావము ప్రాముఖ్యము వహించుటకు తోడ్పడిన కారణములను శ్రీ వేంకటరంగయ్యగారు కడుచక్కగ వివరించిరి.

భారతసీమ విశాలవిస్తీర్ణముగలది. కాని యీయంశముకాక ఫెడరల్ విధానమునకు భుజము లొడ్డిన యంశములు చాలకలవు. మననేలయందు కాంగ్రెసు పతాకముక్రింద రాజకీయోద్యమము విశేషముగ విజృంభించుచున్నది. కాంగ్రెసువాదుల వాంఛ పూర్ణము కావలయుచో, పాలనాధికారమంతయు ప్రజలచేతులందు బడవలెను. భారతావని నిపుడేలుచున్నది ఇంగ్లాండు. బ్రిటిష్‌పార్లమెంటునకే భారతప్రభుత్వము (కవున్సిల్‌తో గూడిన రాజప్రతినిధిపాలనము) పూచీగా నున్నది. భారతాశయము నెరవేరుచో, భారత ప్రజాప్రతినిధులనుండి నేర్పడు మంత్రులకు ప్రభుత్వము పూచీయై యుండవలెను. ఈరీతి విధానమునకు

భారతీయులలనాటుపడలేదు కావున వారికది ఏమాత్రము భరించినని పాలకులతలంపు. వాణిజ్యపారిశ్రామికాంగణములలో నింగ్లాండు పొందుచున్న లాభమునకు దీనివలన ధక్కా తగిలితీరును. సివిల్ మిలిటరీ సర్వీసులందు రూకలు మూటగట్టుకొను ఆంగ్లేయులకు ఆశాభంగము కలిగితీరును. భారతాశయముపట్ల తమకుగల ఉద్దేశమును పాలకులు తొలుత ౧౯౧౭ లో వ్యక్తపరచిరి. ఈస్వీకరణమున పడిగోపురమువలె పెద్దగా నిలిచిన పదము "క్రమసిద్ధి". నేటికిని ఇది నిలిచియున్నది. రానురాను దీనినిసుసరించిన 'భళాభళి' యే వినబడుచున్నది. క్రమసిద్ధిలోని మొదటి మెట్టు డయార్కీ. ఇకమీదనిది కేంద్రస్థానమువరకు పాకునగును. ట్రయార్కీకి తావిచ్చును. అంత ప్రాముఖ్యములేని శాఖలు మంత్రుల కప్పగింపబడును. దేశరక్షణము, బాహ్యాంశములు రాజప్రతినిధి పిడికిటనుండును.

స్వరాజ్యపార్టీవంటి గట్టిపార్టీవలన చిక్కులు రాకుండుటకై, డెమక్రసీభావము విజృంభింపకుండుటకై ప్రతికూలభావములుగలవారు వీరికెదురు నిలిచి ఢీకొట్టవలెను. ఇట్టివారు నేటివ్ రాజులు పుత్తెంచు ప్రముఖులు. ఎడ్డెమంటే వీరు తెడ్డెమనగలరు! 'యతి' అంటే 'ప్రతి' అనగలరు. 'పులి' అంటే 'పుట్ట' అనజాలుదురు! వీరికిని వారికిని ఉజ్జీ కుదురదుకావున "ఒప్పులకుప్ప" ఆటసాగదు. సాగేది ఎండవట్లు! వీరిని కూటస్థులు చేయునది ఫెడరల్ విధానమే! మనప్రతినిధులకును ఆప్రముఖులకును జరుగు ముష్టియుద్ధములోని సుద్దులాటలలో Obstructionist tactics నేలరాలును!

దక్షిణాఫ్రికా, ఆస్ట్రేలియా, కనడాల ఫెడరల్ విధానమునకును, మనమోలనిక సాక్షాత్కరించబోయే ఫెడరల్ విధానమునకును హస్తిమశకాంతరము, ఆకాశపాతాళప్రభేద మున్నది. ఆయావిధానాంశము లాయాదేశములందే పుట్టినవి. అచ్చటి నాయకులే వానికి జనకులు. వారిచే నిర్మింపబడిన బిల్లులే బ్రిటిష్‌వారి అంగీకారము నందినవి. మన విధానమునకు కర్తలైనవారు మన నాయకులు కారు, మన మనపాలకులు.

వారికి చేదోడైనవారు నేటివ్ రాజులు, వాదోడైనవారు ముసల్మానుభాయీలు.

టేరిఫ్, రైల్వే, పోస్ట్, టెలిగ్రాఫ్, సాల్ట్ మున్నగునంశములనుసరించిన పాలనావిధానమున ఇకమీదట తమమాటకూడ వినబడవలెనని నేటివ్ రాజులనుచున్నారు. ప్రస్తుత మంత్రివర్గముతో గూడిన రాజప్రతినిధి అధికారమునకు అంజలెత్తవీరాశుకపడుదురుగాని ప్రజాప్రతినిధులనుండి వెడలిన మంత్రుల అధికారమునకు వంగి సలా మొనరింపరు. స్వరాజ్యోద్యమము వీరికి గిట్టదు. బ్రిటిష్‌రాష్ట్రప్రతినిధుల వాక్కు వీరి చెవులకు చేదైయున్నదికదా! మన ముసల్మానుసోదరుల సుండెలు దడదడలాడుచున్నవి. భారతదేశమందు వీరి సంఖ్య తక్కువ. స్వరాజ్య మనిన హిందూరాజ్యమని వారి తలంపు. ఒకప్పుడు మహమ్మదీయులు మనకు పాలకులై యున్నారు. ఇప్పుడు వీరికి పాలకులై హిందువులు తమఅక్కసు దీర్చుకొందురని Prime Minister కు తాము వ్రాసిన జాబులో మౌలానామహమ్మదాలీగారు తెలుపనే తెలిపిరి. మహమ్మదాలీగారి అడలు పాటును సర్ మహమ్మద్ షఫీగారు పంచుకొన్నారు. ఫెడరల్ విధానముకతన రాష్ట్రప్రభుత్వములు అధికారవర్గములను చేబూనునుగదా! పశ్చిమోత్తరరాష్ట్రము, పంజాబ్, బెంగాల్, బెలూచిస్థాన్, సింధురాష్ట్రములందు మహమ్మదీయుల బలగము అధికముకావున వీరియధికారమే అందు విజృంభించును. ఈయధికారము, ఇతరరాష్ట్రములం దధికసంఖ్యాకులైన హిందువుల అధికారమును 'ఖబడ్దార్' అనితీరును. ఫెడరల్ విధానములో నవలో హదింతామణివలె పనిచేయునది 'ఖబడ్దారే' మన ప్రభువులు checks and balances లో అందవేసిన చేతులు. ఇట్టి balance క్రొత్తవిధానమందుకూడ ఆయువుపట్టయి యుండును.

మనదేశములో "జాతి" "దేశము" "దేశభక్తి" వెనుకనుండి తాళము వేయునదే! ముందు వయ్యారిభామవలె తెయ్యిమనుచున్నది మతము. ఇతరదేశములలోని ఫేసిజమ్, కమ్యూనిజమ్, నాజిజమ్ లవలె మన

దేశములో కమ్యూనలిజమ్ గణాచారివలె నృత్యము చేయుచున్నది. ఉద్యోగములందూ సద్యోగములందూ ఇది యెంతేని పనిచేయుచున్నది. దీనికి 'జోహుకుమ్' అనజాలునది ఫెడరల్ విధానమే. దీనివలన ముఖ్యమతములవారు కొన్ని కొన్ని రాష్ట్రములలో విశేషాధికార మందెదరుకదా!

ఫెడరల్ ఆశయము గొప్పదనుట నిస్సంశయము. దీనివలన పాలకులకును పాలితులకును సన్నిహితసంబంధ మేర్పడును. స్వపరిపాలనమునకై ఇది చక్కని శిక్షణ మొసగజాలును. దీనికతన నధికార మొకేచోటున పేరుకొనక నలువలంకులందును విస్తృతమగును. ఇరువదవ శతాబ్దియందు జయపతాకము నిది యెత్తునని ప్రోథర్ తెలిపినాడు. కాని యీయాశయము మనకను లెదుట నభఃకుసుమమైయున్నది. సాధారణ ఫెడరల్ విధానమునకుండు ముఖ్యలక్షణము మన ప్రత్యేక ఫెడరల్ విధానమున శుద్ధపూజ్యము. ఇది మసిపూసిన మారేడుకాయ! రాష్ట్రపాలనాధికారము ప్రజలకుపూచీగానుండు మంత్రుల చేతులందున్నపుడు గవర్నరు సిద్ధిని నాయకునివలె జతికిలపడినపుడే ఫెడరల్ పాలనము నెరవేరును. కాని నేటివలె రేపును గవర్నరు సర్వాధిపత్యము వహించియుండును. నిక్కమైన పార్లమెంటరీ పాలనావిధానము రాష్ట్రములందు తలసూపినగాని ఫెడరల్ ఆశయము దేవదేవుని వలె ప్రత్యక్షముకాదు. కవలలుపోలువారుకాక ఉజ్జీలు కలియనివా రిందు పాలుగొందురు గావున నిది ముందంజ వేయలేదు. ఇండియా క్రౌన్ కాలనీ కాదు, డొమినియన్ కాదు; రెంటినడుమగల త్రిశంకుడు. త్రిశంకునకు ముట్టునది నేతిబీరకాయ.

గ్రంథము గంభీరభావ విలసితమై, సర్వాంగసుందరమైయున్నది. భాష నిర్మలకాసారసలిలమువలె కడుంగడు తేటగానున్నది. Style is the man అన్నాడుకదా Newman. చక్కనైనహృదయమేకదా చక్కనైనశైలిని సృష్టింపగలదు.

శ్రీ వెంకటరంగయ్యగారు ఆంధ్రాంగ్లములందు చక్కని పాండితిగలవారు. వీరి తెలుగుకూడ తేటగీతి కెనయై యుండును. వీరి అర్థశాస్త్రగ్రంథము, "భారతి" యందు ప్రచురింపబడిన వీరివ్యాసములును ఇందుకు తార్కాణములు. ఇట్టిగ్రంథము ప్రతిభారతీయుని చేతియందు నుండవలెను. దీనిని తామే ఆంగ్లీకరించి దేశాటనమునకై పుత్తెంచినచో శ్రీ వెంకట రంగయ్యగారు ప్రజల కెంతో మేలుచేసినవా రగుదురు.

జో. స.

---

## పల్లెపట్టు

గేయము, సచిత్రము. కర్త: చిరుమామిళ్ల విజయ పార్థసారథిగారు, ముప్పాళ్ల, నందిగామ, కృష్ణాజిల్లా చిత్రకారుడు వరదా వేంకటరత్నంగారు, రాజమండ్రి. ఫెదర్ వైటు కాగితము. ౫౩ పుటలు. వెల తెలియదు.

'మన రచయితలు గ్రామజీవితాన్ని చిత్రించడానికి ఇంకా తగినంత ఉత్సాహం పొందుటలేదు. ఎట్లో, కవికోకిల రామిరెడ్డి 'కృషీవలు'ణ్ణి కవుల భావనా ప్రపంచములోనికి తెచ్చారు.. .........నాయుడు బావను నండూరి సుబ్బారావు ఆదరించారు, యెంకి అతడికి ప్రాణం పోసింది. ఈ పంథాలో కాపుకన్నెయను, ఆమె మగనికి జోహారు లొసగుచున్నారు మన పార్థసారథిగారు.'

'కృషీవలుడను' కృషీవలుని నిత్యజీవనమును, నైతికప్రవర్తనమును వివరించు ఖండకావ్యము. రచన గ్రాంథికము. 'యెంకిపాటలు' కర్షక దంపతుల ప్రేమతత్త్వమును వెల్లడించు శృంగారగేయకావ్యము రచన వ్యావహారికము. 'పల్లెపట్టు'న పయిగ్రంథములలోని తత్త్వములు సంకీర్ణములయినవి. ఇందు నాయికానాయకులను 'సీతారాము'ల ప్రేమ, ఈనాటి రైతుల జీవితము, రైతుల ఆర్థికక్షోభ, రైతులోక మొనరించు వస్త్రోత్పత్తిక్రమము గేయములలో వివరింపబడినవి. ఇందలి భాష గ్రాంథిక వ్యావహారిక మిశ్రము. గేయచ్ఛందోనియామ కల్పనము స్వచ్ఛందము. చిత్రములు ఆయా సందర్భములకు ఎంతయు తగియున్నవి.

అన్ని విధములను ఇది పయి గ్రంథద్వయమునకు తరువాతిదే. అయినను రైతుయువకుల యుత్సాహమును అభివృద్ధిపరచుటకు, రైతుసంఘము నుద్ధరించుటకు నిది కొంత తోడ్పడగలదు.

పద్మావతీ చరణచారణ చక్రవర్తి

ఏకాంక పద్యరూపకము. శ్రీ శివశంకరశాస్త్రి విరచితము. లఘుటిప్పణీసహితము. శ్రీ వడ్డి బాపిరాజు చిత్రపటములతో కూడినది. ఫెదర్ వైటు కాగితము. ౬౩ పుటలు వెల ౮ అణాలు. తొమ్మిదణాలకపాల బిళ్ళలు పంపినచో పుస్తకము బుక్కుపోస్టుగా పంపబడును. వి పి.లు పంపబడవు. వలయువారు 'కళ', పిఠాపురము అను చిరునామాకు వ్రాయవలెను.

జయదేవమహాకవి సంస్కృతమున రచియించిన 'గీతగోవింద' గేయప్రబంధమునకు, తన్మూలమున అతని భార్య పద్మావతీదేవికి గౌరవ, సమ్మానములు కలిగిన విధ మీ చిన్న కావ్యమున మూడురంగములలో వివరింపబడినది

ఇందలి కథాంశము తక్కువ. అయినను అది ఉచితరీతిని పరిపోషింపబడినది. పాత్రౌచిత్యమునకు మాత్రము భంగము కలిగింపక రసమును లెస్సగ అది పోషించినది. గేయ, పద్యభాగములు రెండును ద్రాక్షాపాకమునబడి చదువరులను రసతన్మయుల నొనరించుచున్నవి.

ఇందలి చిత్రములు తత్తత్సందర్భమునకు అనుగుణములయి కవిభావమును బాగుగ ప్రకటింపజాలియున్నవి. 'లఘుటిప్పణి'లో అనేక విశేషములు వివరింపబడినవి. ఆంధ్రులందరు తప్పక ఆదరింపవలసిన కావ్య మిది. శ్రీ శాస్త్రిగారు ఇట్టి కావ్యములను రచించి ఆంధ్రవాణికి క్రొత్తతొడవులను పూర్తురుగాక!

---

ఉపయుక్తవాచకము

గద్య, పద్యాత్మకము. కర్త: శ్రీ పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి. క్రౌను ౧/౮ సైజు. పద్యము ౭౧ పుటలు, గద్యము ౧౧౭ పుటలు. వెల రు. ౧-౦-౦. వలయువారు గ్రంథకర్తగారికి పిఠాపురమునకు వ్రాయవలెను.

ఇందలి పద్యభాగము 'రామోపాఖ్యానము' ఎఱ్ఱనరచిత మనబడు మహాభారతారణ్యపర్వములోనిది. వచనభాగము 'పరీక్షిత్తు' గ్రంథకర్త బహుగ్రంథపరిశోధన మొనర్చి రచించినది. ఇందున్న యీ రెండు ఉపాఖ్యానములే.

"ఇప్పుడొక్క వాచకమె పెక్కేండ్లవఱకు మార్చరాదను ప్రభుత్వాజ్ఞ వెలువడినది. ......... పేలవముగనుండు వాచకముఁ జెప్పునప్పుడు పండితుఁడు శ్రద్ధగఁ బాఠముఁ జెప్పడని యనుభవపూర్వకముగా" గ్రంథకర్తకు "దెలియును. అందువలననే 'పరీక్షిత్తు'......... బాలుర మనస్తత్త్వముల కనువగురీతిని రచిం" పబడినది. 'ఇందు వరుసగా రెండు లేక మూడు సంవత్సరములు చెప్పదగిన వచనభాగము' కలదు. రామోపాఖ్యానమును 'పరీక్షిత్తుతో సమానముగా వరుసగా......... రెండు లేక మూడేండ్లు ౪, ౫ ఫారములలో జెప్పనగునట్లు యున్నది.'

ఈ వాచకములోని కథలు రెండును పవిత్రములు; నీతిదాయకములు; కాన విద్యార్థుల కుపయుక్తములే. కాని విద్యార్థులకు, ఉపాధ్యాయులకు విసుగు కలుగకుండవలెనన్న మరి కొన్ని గద్య, పద్యభాగములను చేర్చి యిందలి కథాద్వయమును చాలవరకు సంగ్రహించి ప్రకటించిన ఎంతయు బాగుగ నుండెడిది.

విద్యార్థులకు పఠనీయములగు ఉత్తమ వాచకములలో ఇది యొకటి. "ఈ వాచక ప్రాశస్త్యములఁ జిత్తగించి సహృదయు లాదరింతురుగాక!"

బు. వెంకటరమణయ్య

---

# ఈ నా టి కి

(మల్లవరపు విశ్వేశ్వరరావు)

ఏనాటి దీరత్నవేటి
కానాసిత దివ్యవీణ!
ఈనాటికి తెరచి మీటి
తీవు, బాల, నాబ్రతుకున!

ఏనాటి దీనిబిడపత్ర
జాలికాంతరప్రసవము!
ఈనాటికి నీగళార్ద్ర
మాలిక రాగిల్లు భృశము!

ఏనాటి దీ విస్తృతాభ్ర
నిభృత మిన్ను నక్షత్రము
ఈనాటికి నీ విశుభ్ర
నిశ్చలేక్షణపవిత్రము!

ఏనాటిదీరాగసిక్త
భావముగ్ధ జీవనమ్ము!
ఈనాటికి, బాల, ముక్త
రావ మొసగి తీవుసుమ్ము!

---

# సాభిప్రాయ విశేషములు

భారత సంవత్సరారంభము నందు ప్రపంచ వ్యవహారములు సదాశాంతికారకములు గాకను వినాశకారకములుగను గోచరంబు లగుచున్నవి. సకలరాజ్యములందును శాంతి వచనములు, సంగ్రామసన్నాహములు ప్రత్యక్షము లగుచున్నవి. యూరపు రాజ్యములు ప్రతిష్ఠించిన సంహారసన్నాహములు పది దిగంతములందు వ్యాపించుచున్నవి. పాశ్చాత్య సంస్కారము ప్రాచ్యసంస్కారము నావరించినది. యూరపుఖండమునందు జర్మని వలెను ఆసియాఖండమునందు జపాను రణభేరిని ప్రయోగించుచున్నది. జర్మను సైన్యములు లోకార్నో నియమముల నతిక్రమించి రైనులాండు నాక్రమించి యూరపురాజ్యములందు విషాదసంభ్రమములను గలుగజేసినది. నాజీపక్ష మవలంబించిన కార్యవిధానమునకు సంగ్రామ మనివార్యమైన ఫలము. కాలయాపనము సంగ్రామబీభత్సమును వృద్ధి జేయుటకు వినియోగపడునేగాని సంగ్రామ ప్రతిషేధమునకు వినియోగపడదు. సంగ్రామ సన్నాహములు శాంతికి సాధనములు గావు. హిట్లరుగారు ప్రతిపాదించిన ౨౦ ఏండ్ల శాంతి ప్రతిష్ఠాపనమును యథార్థముగను సంగ్రామాభ్యుదయ సాధనముగాని శాంతిస్థాపనసాధనముగాదు. దురభిమాన దురహంకార సంవర్ధనమునకు సాధనములైన నాజీసిద్ధాంత వ్యవహారములు సర్వసంహారమునకు వినియోగ పడునవులు ధర్మప్రతిష్ఠాపనమునకు వినియోగ పడజాలవు. శకుని మాయాద్యూతమువలెను హిట్లరుగారి సైన్యద్యూత వ్యవహారములును భయసంభ్రమ సాధనములైనను స్వసంహార సాధనములైనవేగాని స్వోద్ధరణ సాధనములు గావు. పరాధీనములందున్న దేశములు జర్మని హస్తగతములగుటకు సంగ్రామమె శరణ్య మగుచున్నది. నాజీబలమంతయును చేయుచున్న తపస్సునకు ఫలమును సుందోపసుందోపాఖ్యానము మహావ్యాఖ్యానము. ఈ వ్యాఖ్యానముచే భిన్నవిధమునను ఇటలీ బలగము అబిసీనియాయందు ప్రత్యక్షము చేయుచున్నవి.

*   *   *   *

## ఇటలీ దురంతములు

ఇటలీ విమానములు విషాగ్నిపూరితములైన బాంబుల మూలమునను అబిసీనియా రణరంగములందు జేయుచున్న సర్వసంహారము పాషాణహృదయములకును విషాదమును కలిగించుచున్నది. వైద్యాలయములు, గ్రామములు, శిబిరములు, స్త్రీలు, శిశువులు మొదలగునవన్నియును బాంబుల వర్షములకు గురియగుచు మానవధర్మ సంహారమునకు వినియోగపడుచున్నవి. అబిసీనియా రాకుమారి స్త్రీలసంఘమునకు జేసిన దీన

విజ్ఞాపనము పరమవిషాదమును గలుగజేయుచున్నది. అబిసీనియాయందు ఇటలీ యవలంబించుచున్న సంగ్రామవిధానము పాశ్చాత్య రాజ్యములు ప్రపంచమునకు సమకూర్చిన మానవధర్మ సాధనమునకు పరమప్రమాణములు. సర్వసంహార సాధ్యమైన పాశ్చాత్య సంస్కారము పాశ్చాత్యులకు విజయమును సమకూర్చినను మహాభారత సంగ్రామము వలెను, మానవసంహారమునకే వినియోగపడి సర్వసంహారమును జేయుట సహజము. పాశ్చాత్యరాజ్యము లుపక్రమించిన సంహార సాధనము ప్రాచ్యరాజ్యములను నావరించిన విధమును జపానువ్యవహారములు వెల్లడి చేయుచున్నవి. రుష్యా, గ్రేటుబ్రిటను మొదలగు యూరపురాజ్యములు ప్రాచ్యదేశము లందు ప్రతిష్ఠించిన ఆసురబల బీజములు పూర్ణముగను ఫలించినవి.

*   *   *   *

**జపాను విజృంభణము**

జపాను సంహార నిర్మాణ సాధనములను సర్వసంహారమునకు వినియోగించుచున్నది. జపానుయందు ఇటీవల సంప్రాప్తమైన సైనిక పరివర్తనము ప్రాచ్యదేశములందు సంభవముగా నున్నవి. విప్లవమునకు చిహ్నముగ నున్నది. నలువదికోట్ల చీనాప్రజలు నిస్సహాయులై జపానుసైన్యములకు బలియగుచున్నారు. జపానుపూనిన సంగ్రామ పరిశ్రమవలెను నిర్మాణపరిశ్రమలును మానవ ధర్మసంహారమునకు వినియోగపడుచున్నవి. చీనాహిందూస్థానాది దేశములందలి పరిశ్రమలు జపానుపరిశ్రమలను ప్రతిఘటింపజాలకను క్షీణించుచు, ప్రజల ప్రాణమాన ధన సంరక్షణము దుర్లభమగుచున్నది. దృష్టినేమూలలకు ప్రసరింపజేసినను జపానునిర్మాణములు ప్రత్యక్షము లగుచున్నవి. జపాను విజృంభణము ప్రాచ్యపాశ్చాత్య రాజ్యములకు విస్మయమును గలుగజేయుచున్నను ప్రతిఘటనము మాత్రము దుర్లభముగనున్నది. యూరపు రాజ్యముల వైరములె జపానువిజృంభణమునకు దోహదములగుచున్నవి. జపాను చీనా మంచూరియా దేశములం దుపక్రమించిన విజృంభణ ప్రస్థానమును మంగోలియాయందు నుపక్రమించినది. మంగోలియాయందు జపానురష్యా బలములకు సంఘర్షణము దినదినప్రవర్ధమానమగుచున్నది. సైనులాపు మంగోలియా రంగములందు తలయెత్తిన సంగ్రామాంకురములు మహాసంగ్రామపరిణామమును పొందు ప్రసంగము నావరించిన సంగ్రామసంస్కార ఫలము. వర్తమాన విషాదస్థితియందు విప్లవ చిహ్నమైన సోవియటురుష్యా శాంతికి సాధనమగుట చిత్రములలో చిత్రముగనున్నది. రుష్యాను, రుష్యాపరివర్తనమును ప్రతిఘటించిన ఫ్రాన్సు, గ్రేటుబ్రిటను మొదలగు మహారాజ్యములు శాంతి సంరక్షణమునకు సోవియటు రుష్యామీద నాధారపడుట విధిబలముగ నున్నది.

*   *   *   *

## రుష్యాపరివర్తన వికాసములు

మానవధర్మ వికాసాధ్యాయములందు రుష్యాపరివర్తన వికాసాధ్యాయములు విచిత్రాధ్యాయములు. ప్రపంచ పరిణామము నందు సృష్టిలయము లన్యోన్యాశ్రయములైన విధమును రుష్యాపరివర్తనము సువ్యక్తము చేయుచున్నది. సంహారముతో నారంభమైన సోవియటుమహోద్యమ మనుక్రమించిన నిర్మాణ విజృంభణము ప్రజ్ఞాసువులకు విస్మయమును గలుగజేయుచున్నది. మానవధర్మ వికాసమునకు సకల రాజ్యములందును, సంఘము లందును, సంస్థలందును పరివర్తనావసర ప్రయోజనములను రుష్యాపరివర్తనము విశదము చేసినది. పదియైదేండ్లకు పూర్వము నిందాపరిహాసములకు పాత్రమైన రుష్యాదేశము వర్తమానకాలమునందు స్తోత్రగౌరవములకు పాత్రమైనది. రుష్యాయందు ప్రజలు జాతి మత లింగ దశా వివక్షత లేకను మానవధర్మావరోహణమును జేయుచున్న విధము మానవధర్మ వికాసమునందపూర్వాధ్యాయము. మానవ స్వాతంత్ర్య ధర్మము రుష్యాయందు వికసించి ప్రపంచ పరిణామమునందు నూతనాధ్యాయోదయమునకు సాధన మగుచున్నది.

వర్తమానవిషాదావస్థయందు సంగ్రామ నిరోధమునకును, శాంతిసంరక్షణమునకును రుష్యాకు గల పవిత్ర సంకల్పమే యితర రాజ్యమునకును సాధ్యము గాకపోయినను జర్మను, జపాను రాజ్యముల సంగ్రామ ప్రయత్నములు సంగ్రామము ననివార్యము చేయుచున్నవి. దైవఘటన మెటులున్నను రుష్యా, ఫ్రాన్సు, గ్రేటుబ్రిటనుల సంయోగము శాంతిసంరక్షణమునకును, సంగ్రామ ప్రతిఘటనమునకును వినియోగపడుట ప్రకృతి ధర్మము. శాంతిస్థాపనమున కేర్పడిన నానాజాతిసమితి శాంతిస్థాపనమునకు నిరర్థకమైన విధమును ప్రపంచవ్యవహారములు విశదము చేయుచున్నవి.

*   *   *   *

## నానాజాతిసమితి

శాంతిస్థాపనమునకును, ఆయుధవిసర్జనమునకును, సంగ్రామప్రతిషేధమునకును, స్వల్పరాజ్య స్వాతంత్ర్య సంరక్షణమునకును నేర్పడిన నానాజాతిసమితి స్వీయప్రయోజన సంరక్షణములకై నిరుపయోగమైన విధమును ప్రపంచ వ్యవహారములు వేయినోళ్లను చాటుచున్నవి. నానాజాతిసమితియందు స్వల్పస్వతంత్ర రాజ్యములు చేరినను పెద్దరాజ్యముల ప్రయోజనములును, శ్వేతజాతుల ప్రయోజనములును ప్రధాననిశ్చయము లైనవి. అబిసీనియా పట్లను నానాజాతిసమితియును, సమితియందుగల యూరపురాజ్యములును చూపుచున్న నిరాదరణభావము సమితి ప్రయోజనమును నిరర్థకముచేసినది. ఇటలీమీదను సమితి నిర్ణయించిన ఆంక్షలు మాటలందు వలెను చేతలందు గనుపడకున్నవి. అబిసీనియాయందు ఇటలీ చేయుచున్న ఘోరమైన హత్య లప్రతిహతముగను సాగుచున్నవి. ప్రపంచము హత్యలను నిరసించినను ప్రయోజనము గలుగకున్నది. గ్రేటుబ్రిటను మీదను ఇటలీప్రజలు ద్వేషగీతములను

పాడుచున్నారు. మధ్యధరాసముద్రమునం దిటలీబలవిజృంభణము వ్యాప్తమగుచున్నది. ఇటలీ రోమకసామ్రాజ్యవిజయగీతములను పాడుట కుపక్రమించినది. ముస్సొలోనిగారి నాయకత్వముక్రిందను ప్రజలు కన్నుమిన్ను తెలియకను తాండవమాడుచున్నారు. హిట్లరు ముస్సోలినిగారల నిరంకుశ ప్రవర్తనము యుద్ధమునకు మార్గమగుచున్నది. యూరపురాజ్యముల నావరించిన సంగ్రామసన్నిపాతము గ్రేటుబ్రిటనును నావరించినవిధమును మంత్రుల, నాయకుల ప్రసంగములు, పత్రికలవ్యాఖ్యానములు, సంగ్రామసన్నాహములు వెల్లడి చేయుచున్నవి. సామ్రాజ్యాభిమానపూరితమైన బ్రిటీషుజాతీయ ప్రభుత్వము సంగ్రామరంగమునందు ప్రవేశించుటయును సహజావస్థగనున్నను, ప్రపంచశాంతి రక్షణభారమును, మానవస్వాతంత్ర్య రక్షణభారమును గ్రేటుబ్రిటనుమీదను విశేషముగ నున్నది.

* * * *

## గ్రేటుబ్రిటను మంత్రాంగము

బ్రిటీషు సామ్రాజ్యాంతర్భాగములందును, బాహ్యరాజ్యములందును గ్రేటుబ్రిటను పట్లను విశ్వాసము క్షీణించుచున్న విధమును ప్రపంచ వ్యవహారములు విశదము చేయుచున్నవి. బ్రిటీషుమంత్రాంగము పరాభవమును పొందినవిధమును ఇండియాబిల్లు నను గ్రహించిన సర్ సామ్యూయలు హోరుగారి నిర్గమనము వెల్లడిచేయుచున్నది. ఐర్లాండు స్వాతంత్ర్యమును ప్రకటించి స్వతంత్ర్యము ననుభవించుచున్నది. ఈజిప్టుహిందూస్థానములందు స్వాతంత్ర్యాభిలాష ప్రవర్ధమానంబగుచున్నది. వలసరాజ్యములందు స్వాతంత్ర్యప్రవర్తన మనివార్యముగను నాగుచున్నది. ఆత్మసంరక్షణమునకు గ్రేటుబ్రిటనుకు రక్షణవ్యాపారము శరణ్యమైనది. వ్యాపార పరిశ్రమ సంరక్షణమున కేర్పడిన ఒటావా యొడంబడికను సామ్రాజ్యాంతర్భాగము లన్నియును నిరాకరించుచున్నవి. భారత సామ్రాజ్య సభయును నిరాకరించినది. సామ్రాజ్యాభిమానము మాత్రము యథేచ్ఛగను విహరించుచున్నవిధమును బ్రిటీషు రాజ్యవ్యవహారములు, ముఖ్యముగను హిందూస్థానవ్యవహారములు విశదము చేయుచున్నవి.

* * * *

## హిందూస్థాన వ్యవహారములు

బ్రిటీషుపార్లమెంటు ఇండియాబిల్లును ప్రసాదించినది. బిల్లును ఆచరణమునందు పెట్టుటకవసరమైనవ్యవహారక్రమమంతయును జరుగుచున్నది. ఆర్థికవిన్యాసములు, నియోజకవర్గ నిర్ణయములు మొదలగు వ్యవహారములన్నియును సాగిపోవుచున్నవి. బిల్లుననుసరించి సింధు ఒరిస్సారాష్ట్రములు నిర్మాణము లయినవి. ౧౯౩౭ ప్రారంభమునందన్ని రాష్ట్రములందును రాష్ట్రీయస్వపరిపాలనము స్థాపింపబడనున్నది. ఇండియాబిల్లునియమములు నిరంకుశ ప్రభుత్వరక్షణమునకు వినియోగపడునటులు స్వాతంత్ర్యవికాసమునకు వినియోగపడవని రక్షణములు, ధ్రువాధికారము, నిరంకుశ శాసననిర్మాణాధికారము మొదలగు రాజకీయార్థిక రక్షణోపాయములన్నియును సమర్థించుచున్నవి. ౧౯౩౭ నందు రానున్న రాజ్యాంగవిధాన మొటులు

పరిణమించినను, ప్రభుత్వమునందు హృదయపరివర్తన మించుకేనియును గలుగలేదని రాజకీయార్థిక వ్యవహారము లేకగ్రీవముగను చాటుచున్నవి.

అస్సెంబ్లీయందు ప్రజాప్రతినిధులు నిరాకరించిన ఉప్పుపన్నును, పోస్టుకార్డును రాజప్రతినిధి సమర్థించుట విచిత్రముగను సామాన్యులకును గనుపడుచున్నది. దేశాదాయమునం దధికముగను లభించిన కస్టమ్సు [illegible]లందు ప్రజాసామాన్యమునకు సౌకర్యములను గల్పించుటకవకాశములున్నను, నిలువరామ్మును క్వెట్టా పునర్నిర్మాణమునకును, బ్రాడ్కాస్టింగు మొదలగు పనులకును వినియోగించుట యనుచితము. గత సంవత్సరమునందువలెను రాగల సంవత్సరమునకును వేసిన ఆదాయము రు. ౮౭,౩౫,౦౦,౦౦౦ను, వ్యయము రూ. ౮౫,౩౦,౧౦,౦౦౦ను అంచనా తప్పిపోవచ్చును. పోస్టాఫీసులవలనను ౫౦ లక్షలు లాభమువచ్చునపుడా లాభమును పోస్టుకార్డుల ఖరీదును తగ్గించుటకు వినియోగించుట యుక్తముకాని అన్యత్ర వినియోగించుట యుక్తము కాదు. అక్రమమైన ౧౮ పెన్సుల మారకముతోను, స్టర్లింగు సంయోగముతోను, బాహ్యాంతర సుంకములతోను నిండి నిబిడీకృతమైన ఆర్థికవిధానము సర్ జేమ్సు గ్రిగ్గుగారికి సంతృప్తికరమైనను దేశక్షేమమునకు ప్రతికూలములని సామాన్యులకును తెలిసిన విషయము. బ్రిటీషు ప్రభుత్వ రక్షణమున కేర్పడిన భారతప్రభుత్వము బ్రిటీషుప్రభుత్వము పాడినపాటనే పాడి తాళమువేయుచున్నది. వేయి కోట్ల అప్పులభారముతోను, ౫౦ కోట్ల సైన్యవ్యయభారముతోను పారతంత్ర్యబాధ్యతలతోను క్రుంగి కృశించుచున్న దేశమునకు ఇండియా బిల్లు పాశబంధములను సమకూర్చునటులు తరణోపాయమును సమకూర్పజాలదు. బ్రిటీషు భారత ప్రభుత్వమునందు హృదయపరివర్తనము గలుగని విధమును బడ్జెటు సంవిధానములందు సర్ జేమ్సు గ్రిగ్గుగారి ప్రసంగములు విల్లింగ్డను ప్రభువవలంబించిన ధ్రువసాధనమును విశదము చేయుచున్నవి. సామ్రాజ్యాభిమాన పూరితులైన విల్లింగ్డను దంపతుల నిర్గమనమును, లింలిత్గో ప్రభువర్యుని ఆగమనమును హృదయపరివర్తనమునకు వినియోగపడుట బ్రిటీషు ప్రయోజనములకు క్షేమకరము. దేశక్షేమమునకును, స్వాతంత్ర్యసిద్ధికిని స్వావలంబనమువలెను పరావలంబనము సాధనముగాదని ప్రపంచచరిత్రానుభవము పరిస్ఫుటము చేయుచున్నవిధమును కాంగ్రెసు చరిత్రయును స్ఫుటముచేయుచున్నది.

*    *    *    *

### కాంగ్రెసు నిర్ణయములు

లక్నోయందు గూడనున్న కాంగ్రెసు మీదను దేశక్షేమ మాధారపడియున్నది. కాంగ్రెసు ప్రజాదరణమునకు పాత్రమైన మహాసంస్థ. ఈ మహాసంస్థకు యువజన నాయకుడు పండిత జవహరులాలుగారధ్యక్షులగుట

మహావిశేషము. కాంగ్రెసునందు జాతీయవాదులు, మితవాదులు, సామ్యవాదులు, పార్లమెంటరి సాధనవాదులు, ధనాధికారవాదులు, సాంఘికవాదులు, సనాతనులు, స్వరాజ్యపక్షవాదులు మొదలగు వారందరును స్వకీయాభిప్రాయారాధనమును చేయగోరుచున్నారు. భిన్నపక్షముల నాయకుల సంయోగ సాహచర్యములను సమకూర్చుటకు నెహ్రూగారు చేయుచున్న ప్రయత్నములు ప్రశంసనీయములు మంత్రిపదవుల స్వీకరణవిషయమునందు నెహ్రూగారికి ప్రతికూలాభిప్రాయమున్నను వర్తమాన పరిస్థితులందు ప్రజాభిప్రాయమును పాటించి ప్రవర్తించుట నాయకులకు కర్తవ్యము. శాసనసభలను బహిష్కరించిన కాంగ్రెసు వర్తమానకాలమునందు శాసనసభాప్రవేశము నామోదించినది బహిష్కారప్రియు లెందరో వర్తమాన సమయమునందు సామ్రాజ్య శాసనసభయందు సభ్యులుగ నున్నారు. రాగల సంవత్సరమునందు వందలమంది రాష్ట్రీయ శాసనసభలయందు సభ్యులుగా నున్నారు. లక్నో కాంగ్రెసు మంత్రిపదవుల స్వీకరణమునో, నిరాకరణమునో నిర్ణయించుట కార్యసిద్ధికి సాధనముగ నుండగలదు. ప్రపంచవ్యవహారములను, హిందూస్థాన వ్యవహారములను సింహావలోకనము చేయునపు డాంధ్రవ్యవహారము లాంధ్రాభ్యుదయమున కనురూపముగను నిర్ణయించవలసిన యవసరము పరిస్ఫుట మగుచున్నది.

**ఆంధ్రాభ్యుదయము**

ఆంధ్రాభ్యుదయము గతించిన ౧౫ ఏండ్లయందును ప్రవర్ధమానంబగుచున్నను ౨౫ కోట్ల ప్రజలకును, దేశసంపదలకును, ప్రజాశీలమునకును ననురూపముగను వికాసమును పొందకుండుట యువజనహృదయమునందు సంతాపమును గలుగజేయుచున్నది. ఆంధ్రాభ్యుదయమునకు స్థలాభిమానము, కులాభిమానము, పక్షాభిమానము, నాయకాభిమానము, స్వప్రయోజనాభిమానము ప్రతిబంధకములై యభ్యుదయమునకు మందగతిని కల్పించినను సహజమైన యుద్యమము వికసింపకను నశింపజాలదు. ఆంధ్రాభ్యుదయము నుద్ధరించుటకు ఇండియాబిల్లు, ఒరిస్సా రాష్ట్రనిర్మాణము, కాంగ్రెసు వ్యవహారములు, ప్రజోత్సాహప్రబోధములు నూతనోత్సాహమును గలుగజేసినవి. జిల్లాబోర్డులను, శాసనసభలను స్వాధీనము చేసికొనుటకు కాంగ్రెసునాయకానుచరులు ప్రయత్నించుచు విజయమును బడయుచున్నారు. ధాత సంవత్సరాదిదినమునం దాంధ్రావనియందంతటను ఆంధ్రాభ్యుదయ దీక్షను వహించుటకు ప్రజలు సంకల్పము చేసిరి. స్వయముగను తరించినగాని పరులను తరింపజేయుట సాధ్యముగాదు. ఆంధ్రాభ్యుదయమునకు రాజకీయార్థిక సాహిత్యకళాసాంఘికాది సకలవిషయములందును ప్రజానాయకులు పరస్పరవిశ్వాసపరాయణులై పాటుపడవలసిన పరమావసరమును గ్రహించి దీక్షాపరాయణులై కామితార్థములను పరమేశ్వరానుగ్రహమునను బడయుదురు గాత!

---

Printed and Published by K. Nageswara Rao,
at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., Madras. Editor G. Subbaramayya



ముద్దుల పావురము

—తేజోమూర్తుల కేశవరావు.